# ఇవీ సంగతులు

'హాసం'
హాస్య-సంగీత పత్రిక

Also available on net - www.haasam.com

# హాస్యం - సంగీతం



**సీరియల్స్ :**







**కథలు :**





**క్లాసిక్స్ రీటోల్డ్ :**





**బాపూరమణీయం :**



**శీర్షికలు :**







**హ్యూమరథం :** - రావికొండలరావు



**ప్రత్యేక వ్యాసాలు :**



**సీరియల్ :**





**శాస్త్రీయం :**





**లలితం:**





**అర్థం చేసుకుందాం-ఆస్వాదిద్దాం**



**ప్రత్యేక వ్యాసాలు :**





**శీర్షికలు :**





**ఇంటర్వ్యూలు :**











సాంకేతిక కారణాల వలన 'ఆపాత మధురం', 'మీ పద సంపద' శీర్షికలను ఈ సంచికలో అందించలేక పోతున్నాం. వచ్చే సంచిక నుండి యధావిధిగా ఆ రెండు శీర్షికలూ కొనసాగుతాయి.

'సెంటర్‌స్ప్రెడ్'లో
సినీ సంగీత ప్రియులకు ప్రత్యేక కానుకగా
' ఔను... వాళ్లిద్దరూ ఇష్టపడ్డారు!'
'పంచతంత్రం'
సినిమా పాటల పుస్తకాలు కలర్‌లో

అనుబంధంగా సలీల్ చౌధురి, భానుమతి, గిరిజ పాటలు, కార్టూన్స్ స్పెషల్ 14, 54, 65, 71 పేజీలలో

ముఖచిత్రం: పవన్‌కళ్యాణ్

'హాసం' పత్రికకి సంవత్సర చందాని రెన్యువల్ చేస్తూ చెక్కుని పంపిస్తున్నాను. ఇంకొక సంవత్సరము పాటు హాయిగా నవ్వుకునే హక్కును రిజర్వు చేసుకుంటున్నాను. ఎప్పటికప్పుడు 'హాసం' గురించి మీకు ఉత్తరం వ్రాయాలనుకుంటూనే ఏమిటి వ్రాయాలో తోచక ఆగిపోతున్నాను. ఏదో ఒక వ్యాసమో, కథో, శీర్షిక, జోకో బాగుంటే దాని గురించి ప్రత్యేకంగా వ్రాయొచ్చు. పుస్తకం మొదటి పేజీ నుంచి... పొరపాటు... మొదటి అక్షరం నుంచి ఆఖరి అక్షరం వరకు ఎంతో హృద్యంగా వదలకుండా చదివిస్తున్న పత్రిక గురించి ఏమని వ్రాయాలి? మొదటి ఐటమ్ నుంచి తీసుకొని చివరి ఐటమ్ వరకు వర్ణిస్తూ వ్రాయాలి. అప్పుడు ఇంకొక పుస్తకం తయారవుతుంది.

మన 'హాసం' పత్రిక, దాని సమర్పకులు, పాఠకులు అందరూ చిరకాలం వర్ధిల్లాలని ఆశిస్తూ... -మంగాదేవి, హైదరాబాద్

'హాసం' ప్రారంభసంచిక నుండీ క్రమం తప్పక చదువుతున్నాను. - ఆపాత మధుర తెలుగు - హిందీ చిత్రాల వివరాలను దాస్తున్నాను 'హాసం' ప్రత్యేక ఫైల్‌లో. సెలవులు 3, 4 రోజులు వరుసగా వస్తే ... మళ్ళీ మళ్ళీ చదువుతున్నాను. 15-20 ఏళ్ళ క్రింద ఫిలిమ్‌ఫేర్స్ కూడా దాచాను. రెంటికీ కొన్నిసామ్యాలు కనిపించాయి. ఆనందంగా ఉంది.

-కె.వసంతకుమార్, దేవరకొండ

'హాసం' సంచిక 22లో కీ.శే. మల్లిక్‌గారి గురించి వ్రాసి స్మరించినందుకు ధన్యవాదాలు. 'మల్లిక్‌గారు శ్రీ వెంపటి చినసత్యం గారి డ్యాన్సు ట్రూపుతో మా వూరు నిజామాబాదు వచ్చినప్పుడు నాకు పరిచయం ఏర్పడింది. డ్యాన్స్ ప్రోగాం విరామ సమయంలో ఆయనొక హిందీ పాట "నజానె క్యా లాచారీ హై ఆజ్‌మన్ భారీ... భారీ... హై" పాడితే ఆ పాట యిప్పటివరకు నా మనస్సును తట్టుతూనే ఉంది. వారి ఫోటో 'హాసం' పత్రికలో ప్రచురించి పరిచయం చేసినందుకు ధన్యవాదాలు.

-మేక రామస్వామి, నిజామాబాదు

16-31 ఆగస్టు సంచిక అందాల తార కీర్తి అగర్వాల్ ముఖచిత్రంతో అత్యంత సుందరంగా వుంది. సరదా కథ "బిన్‌లాడెన్ - పెండ్లాడెన్" కడుపుబ్బ నవ్వించింది. అస్సలు ఆమె పేరు కథ చదివాక "అదృష్టిణి" అని పెడ్తే బావుండేది అనిపించింది. హేట్సాఫ్ మహర్షి! సద్దాం ఆంటీ

# జనవాక్యం

ఇంటి కథ సీరియల్ ఆసక్తికరంగా సాగుతోంది.

-రఫీ, రాంబాబు, కృష్ణ, పొందూరు

శ్రీమతి సావిత్రి ఘంటసాల గారి 'మా మావయ్య ఘంటసాల కథ' చాలా బాగుంది. బడే గులాం అలీఖాన్ ఎపిసోడ్ అత్యద్భుతం. ఖాన్‌సాబ్ అంతిమక్షణాల్లో ఘంటసాల పరామర్శ సంఘటన గుండెల్లో తడిని కళ్ళల్లోకి రప్పించింది.

-ఓలేటి శ్రీనివాసుభాను, హైదరాబాద్

సంగీతంతో ముడిపడిన కళాకారుల సామర్థ్యాన్ని సార్థకతను విశదపరుస్తూ, వారి ఖ్యాతిని, శ్రమనూ తరతరాలకు సంజీవపరిచే ప్రకియలో మీరు తీసుకుంటున్న శ్రమ అంతా ఇంతాకాదనిపిస్తోంది. ప్రతి నెల పక్షానికీ పక్షానికీ పెరుగుతున్న పాఠకుల (చందాదారుల) సంఖ్యతో సరిచూస్తే మనదేశంలో సంగీతం ఆదరింపబడినంత కాలం 'హాసం' ఆదరణ తగ్గదనీ, ఇలాంటి పత్రిక కోసం ఎన్నాళ్ళుగానో ఎదురుచూస్తూ దాహార్తులైన మాలాంటి వారికి 'నిఝంగా' (బుడుగు వెర్షన్‌లో) 'హాసం' ఓ అమృతధార.

-నేమాని సీతారామ్, విజయవాడ

నేను మల్లాదిగారి అభిమానిని. మేలో హైదరాబాద్ వచ్చినప్పుడు ఆయనను ఇంటిలో కలిశాను. ఏమండీ మీ సీరియల్స్ ఇటీవల రావట్లేదు అని అడిగాను. 'సద్దాం ఆంటీ ఇంటి కథ' 'హాసం' అనే పత్రికలో వస్తోంది అని ఒక లేటెస్టు బుక్ 'శ్రీరామనవమి' స్పెషల్ ఇష్యూ చూపారు. అలా మీ 'హాసం'ను పరిచయం చేసిన ఘనత మల్లాది వెంకటకృష్ణమూర్తి గారికే దక్కింది. అంతే మీ 'హాసం' మా హృదయవీణలు మీటే దరహాసం' అయింది.

ఇప్పుడు 'కడప' నుంచి మీ పత్రిక తెప్పించుకుంటున్నాను. నందలూరులో ఈనాడు ఏజెంటు వద్ద మీ 'హాసం' లభించుట లేదు. ఏర్పాటు గావించేది. ఇక ఘంటసాల సావిత్రి గారి సీరియల్ 'మా మామయ్య ఘంటసాల కథ' ఆకట్టుకుంది. ఘంటసాల సావిత్రిగారి అడ్రస్ వీలైతే ప్రచురించేది. రేలంగోడు సినిమాలో చేరడానికి కలకత్తా ప్రయాణంలో పడ్డ కష్టాలు చదివాం. ఆ రోజుల్లో సినిమా పరిశ్రమలో చేరడానికి ఇన్ని అగచాట్లని తెలుసుకున్నాం. 'ఆపాత మధురం', 'హ్యూమరథం' అన్ని బాగున్నాయి.

-కె.బాలసుబ్రహ్మణ్యం, నందలూరు

మీ 'హాసం' అందరూ నవ్వుకునేది కాదు. అందరినీ నవ్వించే పత్రిక. హాస్య -సంగీత సాహిత్యాలకు విలువనిస్తూ పాత కొత్త పాటలు, గాయకులు, సంగీతకర్తలు, హాస్యచక్రవర్తులు గురించి వారి జీవిత విశేషాలు అందిస్తున్న హాసం-నాలాంటి సంగీత హాస్యాభిమానులకు ఒక భగవద్గీత. మనసుకు అందమైన లోకాల్లో విహరింపజేసి, ఇహపర ఆనందాన్నందించే తారక మంత్రం మీ హాసం. అభినందనలు.

జీవితపు విలువలతోపాటు గళాల విలువలు గూడా దిగజారి అరుదై పోతున్న ఈ రోజుల్లో నేనున్నానని తీయగ పలికే తోడుగ హాసమున్న అదే భాగ్యము. ఘంటసాల గారి జీవిత చరిత్ర విశేషాలు ఆ మహానుభావుని భక్తులకు విలువైన వరం. భానుమతి, ఆదినారాయణరావు, ఎ.ఎం. రాజా, రావు బాలసరస్వతుల పేర్లు తెలియని ఈ తరానికి మీరందించే విశేషాలు పాఠ్యాంశాలు.

రావి కొండలరావు, తనికెళ్ళ భరణి వంటి సినీ అనుభవజ్ఞుల వ్యాసాలు, సినీ సంగీతంతో పాటు లలిత సంగీతానికి సముచిత స్థానం కల్పించి, చిత్తరంజన్‌గారి లలిత గీతాల వివరణలు - సంగీత పిపాసులకు మీరు అందించే బాలశిక్ష.

-ఈశ్వర సూర్యసంపత్ కుమార్, శ్రీకాకుళం

మీ 16-31 ఆగస్టు సంచిక చదివాను. హాస్య సంగీత పత్రిక హాసం చదవటానికి నిండుగా వుంటుంది. మొదటి పేజీ నుండి చివర పేజీ వరకు క్రమం తప్పకుండా హాసం పాఠకులును చదివేటట్టుగా సంపాదకులు అద్భుతంగా అన్ని విషయాలను పొందు పరుస్తున్నారు. ఆపాత మధుర విషయాలు క్రమం తప్పకుండా చదువు చున్నాం. ఈ సంచికలో "మా మామయ్య ఘంటసాల కథ" ఘంటసాల సావిత్రి గారు సీరియల్ మా హృదయాలను ఎంతోగానో హత్తుకుంది.

-పి.టి.రాజు, పాచిపెంట

సంపుటి :1 సంచిక: 23

1- 15 సెప్టెంబరు 2002

పేజీలు: 68 + 8

వెల : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూదన శర్మ

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

హాస్య-సంగీత పత్రిక 23

"వినాయకుడు గణాలకే కాదు, హాస్యానికి కూడా అధిపతే" అని తెలుగువాళ్లు తీర్మానించినట్టు కనబడుతుంది. దీనికి శాస్త్రీయమైన కారణం ఏదైనా ఉందో.. లేదో? ఎందుకంటే పురాణాల ప్రకారం చూసినా విఘ్ననాయకుడు వేదవ్యాసుడికి వ్రాయసకాడే గానీ, హాస్యాన్ని రచించిన వాడు కాదు. జ్యోతిషశాస్త్ర ప్రకారం చూడబోతే బుధుడిని హాస్యప్రియుడు అన్నారు కానీ వినాయకుడిని అనలేదు.

బహుశా రూపం చేత విఘ్నేశ్వరుడు నవ్వు పుట్టించే కారణంగా హాస్యానికి, ఆయనకూ సంబంధం ఏర్పరచారేమో! కానీ ఆయనను చూసి నవ్విన పాపానికి చంద్రుడు నానా అవస్థలూ పడ్డాడు. తను పడడమే కాదు, తనను చూసిన వాళ్లను కూడా ఇక్కట్లలో పడేశాడు. 'నవ్వు నాలుగిందాల చేటు' అన్న సామెతకు ఓ ఉదాహరణగా మిగిలే ఈ ఉదంతంలో ముఖ్యపాత్రధారియైన లంబోదరుడు నవ్వుకు ప్రతినిధిగా నిలవడమేమిటి?

చైనా వాళ్ల ధర్మమాని మనకు బుద్ధుడు నవ్వుతూ సాక్షాత్కరిస్తున్నాడు. మనకు గంభీరరూపంలో తెలిసిన బుద్ధుడిని అలా స్వీకరించడం కష్టమే అయినా 'పోనీలే, ఇదీ ఓ అవతారమేమో' అని సరిపెట్టుకుంటున్నాం. గజాననుడిని కూడా అలా వేరే దేశం వాళ్లు నవ్వించే ప్రయత్నం చేసినట్టు కనబడదు. చేసినా నవ్వే ఏనుగు ముఖం ఎలా ఉంటుందో మనకు తెలియదు కాబట్టి మనం గుర్తుపట్టలేం. బజార్లో అమ్మే బొమ్మల్లో కూడా వినాయకుడు వీణ వాయిస్తూనో, నాట్యం చేస్తూనో కనబడుతున్నాడు కానీ నవ్విస్తూ కనబడటం లేదు.

తన తెలివితేటలతో సర్వగణాలకు అధిపత్యం సంపాదించుకున్న ఈ దేవుడిని నవ్వులపాలు చేసినవేమిటీ అంటే - పెద్దబొజ్జ, బుల్లి వాహనం, ఉండ్రాళ్ల మీద వ్యామోహం అని చెప్పుకోవాలి. స్థూలకాయులు హాస్యప్రియులు అంటారు. తమను ఎగతాళి చేసేవారిని పరుగు పెట్టి నాలుగు తన్నలేక, 'పోవోయ్, నేనేమీ అనుకోలేదులే' అనేసి తనమీద జోకులు వేసేసుకుంటారట! చంద్రుడి గొడవ తర్వాత గణాధిపతి కూడా ఈ రకమైన తరహా అలవరుచుకుని ఉంటాడని మన తెలుగువాళ్ల అంచనా వేసి వుంటారు.

అందుకే కాబోలు ఆంధ్రపత్రిక వీక్లీ వారు ప్రతీ వినాయకచవితి సంచికను హాస్య సంచికగా వెలువరించేవారు. రూపసామ్యం వల్ల తన కథానాయకుడికి చిలకమర్తి వారు 'గణపతి' అని పేరు పెట్టి గణపతి అనగానే చిరునవ్వులు మొలకలెత్తేలా చేశారు. వినాయకచవితినాడు పుట్టి, తల్లిదండ్రుల చేత విఘ్నేశ్వరరావు అని పేరు పెట్టించుకున్న కారణంగా, పేరు నిలబెట్టుకోవడానికి హాస్యరచయిత అయ్యారు ఆదివిష్ణు! క్రమంగా కార్టూనిస్టులు వినాయకుడి మీద కాపీరైటు తీసేసుకుని, తక్కిన ఏ దేవుడి మీదా వేయలేని కార్టూన్లు ఆయన మీద గుప్పిస్తున్నారు. ఏతావాతా వినాయకచవితి రాగానే మామూలు పత్రికలలో కూడా హాస్యం గురించి ఎదురుచూసేలా పాఠకులను తయారు చేశారు.

మరి హాస్యానికి అంకితమైన 'హాసం' నుండి పాఠకులు మరింత ఎదురు చూడరూ!? అందుకే ఈ సంచికలో హాస్యానికి ప్రాధాన్యత ఇచ్చాం. మామూలు హాస్యశీర్షికలతో బాటు అదనంగా ఎన్నోపేజీలు హాస్యానికి కేటాయించడం జరిగింది. హాస్యాన్ని పండించిన నాటకకర్తల గ్రూపు ఫోటోను 'నిక్షిప్తచిత్రం'గా అందించడం జరుగుతోంది. బొజ్జ గణపయ్య 'హాసం' పాఠకులందరినీ నవ్వుల జల్లులతో ఆశీర్వదిస్తాడని ఆశిద్దాం.



HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 383 1388 / 657 0215
*email:* haasammag@hotmail.com

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
on behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018
Fax: 040-3541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eenadu Compound
Somajiguda, Hyderabad-82

వినాయక చవితి సందర్భంగా | ఓ స ర దా క థ

# బాబోయ్... ఇదే బావుంది!

-రాజా

**పక్షులు ఆకాశంలో ఎగురుతూ ఉంటే వెనక నుంచి భూపాలరాగం వినిపించటం లాంటి హడావుడి, హంగు, ఆర్భాటం లాంటివేవీ లేకుండా పరమ రొటీన్‌గా తెల్లవారింది. అందుకు నిదర్శనం సుందరాచార్య పిచ్చిపిచ్చిగా పాడుకుంటూ, మధ్యమధ్య స్వంత వ్యాఖ్యానాలు చేరుస్తూ పేపర్ చదువుకోవటమే...**

"అమ్మ నీ తీయని దెబ్బ...
ఇవాళ పేపర్లో వార్తలేంటబ్బా!?
పురుషుల్లో పుంగవా...
గాలీ తీసిన బుంగవా...
అమ్మనీ తీయని దెబ్బ....
ఇవాళ పేపర్లో వార్తలేంటబ్బా!?"

అంటూ వార్తలతో కలబడిపోయే కార్యక్రమంలో తెగ బిజీగా ఉన్నాడతను.

"తప్పిపోయిన వారి ప్రకటనలు... హుఁ... తప్పిపోయిన వారెక్కడైనా నేను తప్పిపోయాను అంటూ ప్రకటనలు ఇస్తారా? తప్పిపోయిన వారికోసం ప్రకటనలు అని ఉంటే బావుండేది"

'బాబూ నీవు ఇల్లు వదిలిన వెళ్లిన దగ్గిర్నుంచి మీ అమ్మ బిపీ నార్మల్‌కు వచ్చింది. మీ నాయనమ్మ తిక్కతిక్కగా మాట్లాడటం మానేసి ఇపుడు అందర్నీ గుర్తుపడుతోంది. తరచుగా నాకు వచ్చే గుండెదడ కూడా తగ్గిపోయింది. కనుక నీవెక్కడున్నదీ మాకు తెలియపరుస్తే మరికొంతకాలం పాటు నువ్వు అలా అలా తిరిగి రావటానికి కావలసిన డబ్బు అప్పోసప్పోచేసి పంపగలను...

ఇట్లు మీ నాన్న'.

"అహ్ బహు విచిత్రంగా ఉందే ఈ ప్రకటన.... ఇది ప్రకటన కాదు వికటన" అంటూ మరో పేజీమీదకి దండెత్తాడు.

అంతే... భూమికి గురుత్వాకర్షణ శక్తి ఓ క్షణం సేపు పోయి మళ్ళీ తిరిగొచ్చేసినట్టు ఒక్కసారిగా ఎగిరిపడ్డాడు. అందుక్కారణం సదరు మరో పేజీలో కనిపించిన ఇంకో ప్రకటన.

"ఆహా... భలేఛాన్స్....

ఈ దెబ్బతో మారిపోతుంది నా జాతకం... ఇంకా ఆలస్యం చేస్తే అది మహాపాతకం" అనుకున్నాడు. గబగబా లేచి క్రాపు సర్దేసుకున్నాడు.

"నాగమణీ.... ఓ నాగమణీ...

త్వరగా రావే నా రమణీ" అంటూ కేకేశాడు భార్యని.

"ఏంటండీ పొద్దున్నే ఆ గావుకేకలు... మీర్రాసిందేదైనా పడిందా ఏంటి కొంపదీసి" అంటూ లోపల్నుంచి వచ్చింది నాగమణి.

"ఓసీ పత్నీధర్మ... నన్నర్థం చేసుకోవేంటే నా ఖర్మ" అంటూ నెత్తికొట్టుకోబోయాడు. క్రాఫ్ చెరిగిపోతుందని మానేశాడు.

ఆమెకివన్నీ కొత్తేం కాదు. ధర్మపత్ని అని సంబోధించకుండా పత్నీధర్మ అని అన్నాడంటే ఆ పక్కన వచ్చే 'ఖర్మ'కి ప్రాస అని కాలరెగరేస్తాడని తెలిసి ఆ విషయం రెట్టించకుండా "ఎందుకు పిల్చారో చెప్పండి" అని అడిగింది.

"చూడు ఈ ప్రకటన...
అతి త్వరలో జరగబోతోంది
ఓ మహత్తర బృహత్తర సంఘటన"
అంటూ చదివి వినిపించాడు.

"కావలెను. సరికొత్త కథలు చెప్పగల రచయితలు, పాతకథకైనా సరే సరికొత్త రూపునివ్వగల కథా రచయితలు కావలెను. ఎదురింటిజాణ - పక్కింట్లో బిచాణా, సాల్లేబే సాలే, రక్షలు రక్షలు పాదరక్షలు వంటి సిల్వర్‌జూబ్లీ చిత్రాలు తీసిన దర్శకజంట అంకుశం - పరాంకుశం నగరానికి విచ్చేసిన సందర్భంగా నూతన రచయితలకు ఆహ్వానం... కలుసుకొన గోరువారు హోటల్ త్రిశోకా రూమ్ నెంబర్ నూట పదకొండుకి ఈ రోజే రావలసింది'-

పేపరు మడిచేసి విసనకర్రలా విసురుకుంటూ బహువిలాసంగా భార్య వంక చూశాడతను.

"ఖర్మ... ఇది నిన్నటి పేపరు... చూసి మీరెక్కడ పరుగెడతారోనని ఈ పేజీ తీసి దాచేశా.... అసలిది ఎలా వచ్చింది బైటికి?" అంటూ ఖంగారు పడిపోయింది నాగమణి.

అవార్డు అందుకోటానికి మొదటిసారి ఫ్లైయిట్ ఎక్కితే, వాతావరణం బాగులేనందువల్ల విమానాన్ని వెనక్కి తిప్పేస్తున్నాం అనే అనౌన్స్ మెంట్ వినిపించినట్టుగా విలవిల్లాడి పోయాడు సుందరాచార్య.

"ఓసి భర్తృ ద్రోహీ....

నీ పాపానికి నిష్కృతి నహీ...." అని శపించేసి "ఈ పాటికి ఆ దర్శకులు రూమ్ ఖాళీ చేసి వెళ్ళిపోయారో ఏంటో" అంటూ చెప్పులు తీసుకొని అందులో కాళ్లు పెట్టి పరుగెడదామని చిన్న ప్రయత్నం చేశాడు. అది విశ్వప్రయత్నంగా మార్చినా సరే ఉపయోగం కనిపించలేదు. అప్పటికే ఆమె చేతులు అతగాడి కాళ్ళని చుట్టేసుకొని ఉన్నాయి.

"నాగమణీ...
దయచేసి చెప్పకు ఆగమనీ"
అని గర్జించాడు కూడా. కంఠస్వరం సమ



యానికి సహకరించక కీచుగా వచ్చింది సౌండు.

"ఏవండీ... ప్లీజండీ... ఇప్పటికే మీరు రాసిన కథలు చదివి ఇద్దరు ఎడిటర్లు ఆ పత్రిక్కి రిజైన్ చేసి వెళ్ళిపోయారు. తెలీక ప్రింటింగ్‌కి ఇచ్చేసిన సబ్ ఎడిటర్ ఉద్యోగం ఒక్కవారంలోనే సర్క్యులేషన్ విపరీతంగా తగ్గిపోయినందుకు హుష్‌కాకి అయిపోయింది. మన చుట్టుపక్కల వాళ్ళంతా ఇళ్ళు ఖాళీ చేసేసి వెళ్ళిపోతున్నారు. పాలవాడు, కూరలవాడు ఈ వీధిలో అడుగు పెట్టడానికి హడలిఛస్తున్నారు. ఇంకొన్నాళ్ళు పోతే మనిద్దర్నీ ఈ దేశం నుంచే వెలేస్తారేమోనని భయంగా ఉందండీ.... దయచేసి వెళ్ళకండీ" అంటూ ప్రాధేయపడసాగిందామె.

కానీ వినిపించుకునే మూడ్‌లో లేడతను. "హుఁ... వెలేస్తారా? అలా వెలేసిన వారి చేతే వారి ముక్కుల మీద వేలేయిస్తా...

ఈ ఛాన్స్‌క్లిక్ అవనీ....

దెబ్బకి దద్దరిల్లిపోతుంది ఈ అవని"

అన్నాడు భవిష్యత్తులోకి చూస్తున్నట్టు లుక్స్ ఇచ్చేసి.

అయినా అడిగావు కనుక ప్రయత్నిస్తా....

ప్రస్తుతానికి నిష్క్రమిస్తా.....

తిరిగొస్తున్నప్పుడు తీసుకొస్తా....

నీకొక రూపాయల బస్తా"

అంటూ రెండు అడుగులు ముందుకు వేసి ఆగిపోయాడు తన షర్టుని లాగినట్టనిపించి.

"మరి ఆఫీసు?" అంది నాగమణి లేచి నిల్చొని.

ఆమె అమాయకత్వానికి నవ్వొచ్చిందతనికి. "హు హు హు హు... ఆఫీ సు...!? అని అడిగాడు నమ్మకం చాలక.

అవునన్నట్టు తలూపిందామె.

"ఆఫీసు...

లేదండీ... నిజానికి బెల్లుకొడితే ఇంకా ఎక్కువ తుళ్ళిపడి ఉండేవారు" అన్నాడు సుందరాచార్య వారిని ఓ భయంకరమైన ఆపద నుండి తప్పించేసిన వాడిలా వీరనవ్వులు చిందిస్తూ.

"మీరు?"

"రచయితని... మీ ప్రకటన చూసి వచ్చా".

"అది నిన్న మాత్రమే కలుసు కోమని ఇచ్చాం కదా?"

"నేనా పేపరు



"ఈలోగా నేనయిపోతాను అవ్వని" అందామె చేసేదిలేక కళ్ళొత్తుకుంటూ.

ఆ అవకాశం చాలతనికి. వెంటనే కాళ్ళు వెనక్కి లాగేసుకొని చెప్పుల్లో పెట్టేశాడు.

"పోనీ... అక్కడ మామూలుగా మాట్లాడ తానని, ప్రాసలు అస్సలు వెయ్యనని ప్రామిస్ చెయ్యండి" వేడుకుందామె- మంగళ సూత్రాలు చూపిస్తూ.

వేదాంతిలా నవ్వాడు సుందరాచార్య.

"పిచ్చి నాగమణీ!

ప్రాస నా కవిత్వరక్తానికి ధమని...

అయినా నేనేమైనా ఆ ప్రాసని

పిలుస్తానా రా రమ్మని...

దానంతటదే వచ్చేస్తుంది ఝాం ఝుమ్మని...

కళాజీవితం అనే

నా డ్రాయింగ్ రూమ్‌లో ఓ చిన్న షో పీసు....

దాని గురించి ఆలోచించి పాడు చేసుకోకు

మెంటల్ పీసు"

అంటూ నిష్క్రూచీగా బైటికి నడిచాడు సుందరాచార్య.

***

"లోపలకు రావొచ్చాసార్".

తదేక దీక్షతో ఫారిన్ ఛానల్స్ చూస్తున్న అంకుశం, పరాంకుశం తుళ్ళిపడ్డారు.

"పూర్తిగా వచ్చేసి, రావొచ్చా అని అడుగుతారేంటి... రండి కూర్చోండి" అన్నారు.

"తలుపు తెరుచుంది కదాని బెల్లు కొట్ట

చూసింది ఇవాళే కదా!?"

ఒకరి ముఖం ఒకరు చూసుకున్నారు అంకుశం, పరాంకుశం.

"అంటే విషయ సేకరణ విషయంలో మీరు ఒక రోజు లేటుగా ఉన్నారన్నమాట".

చెక్కుచెదరలేదు సుందరాచార్య "నీవెక్కవలసిన రైలు, ఒక జీవిత కాలంలేటు అని అన్నాడో తెలుగు కవి. బెటర్ లేట్ దెన్ నెవర్ అని అన్నాడింకో ఇంగ్లీషుకవి. అంచేత నా అదృష్టాన్ని పరీక్షించుకుందామని వచ్చా. రూమ్ ఖాళీ చేయకుండా మీరింకా ఉండటం నా అదృష్ట సోపానానికి తొలి మెట్టుగా అనిపించింది" అన్నాడు.

"ఓహ్ అదా.... మా ఫ్లైయిట్ ఇవాళ కాన్సిల్ అయింది. సరే కూర్చోండి. నా పేరు అంకుశం. ఇతను పరాంకుశం... మీ పేరు?"

"మచిలీపట్నం సుందరాచార్య".

"విచిత్రంగా ఉందే పేరు?" అన్నాడు పరాంకుశం.

"దానికో కథ ఉందండీ... మా స్వస్థలం బందరు. ఆచార్య ఆత్రేయ అన్నా, వేటూరి సుందరరామ్మూర్తి అన్నా నాకెంతో ఇష్టం. అందుకే వాళ్లిద్దరి పేర్లూ, మా ఊరిపేరు కలిపి కలిసొచ్చేట్టుగా ఆచార్య బందరరామ్మూర్తి అని పెట్టుకొన్నా. కానీ కొందరు అకృతార్థులు, ఆ పేరుకి వికృతార్థాలు తీసి వెకిలి చేస్తూ ఉంటే చూసి సహించలేక మచిలీపట్నం సుందరాచార్యగా మార్చుకున్నా".

"బావుంది మీ పేరు వెనకే ఇంత కథ ఉంటే మీరు చెప్పబోయే కథ ఇంకెంత ఉంటుందో?" అన్నాడు అంకుశం ఆశగా.

"ఖచ్చితంగా చాలా ఉంటుంది. ఇంతకీ మీకెలాంటి కథ కావాలి?" అడిగాడు సుందరాచార్య శ్రీకృష్ణదేవరాయులులా.

"బూతు కథలు, వయొలెన్స్ కథలు, సమాజానికి చెడు చేస్తాయి. ప్రేమ కథలు, పెళ్లికథలు తెగవచ్చేస్తున్నాయి. మన సినిమా పూర్తయ్యే సరికి అవి కూడా బోరు కొట్టేస్తాయి. అంచేత సస్పెన్స్ కథ ఒకటి ట్రై చేద్దాం అనుకుంటున్నాం. మీ దగ్గరేమైనా ఉందా?"

"లేకేం తప్పకుండా ఉంటుంది. కాకపోతే పౌరాణికాలు తీసే ఉద్దేశం లేదా మీకు?"

"ముందు అనుకున్నది కానివ్వండి" అన్నాడు పరాంకుశం. 'పాయింట్లోకి రా' అన్నట్టుగా.

"పోనీ పౌరాణికాల్లో సస్పెన్స్ పెట్టి చూడండి. నావెల్టీగా ఉంటుంది" అన్నాడు సుందరాచార్య అదిరిపోయే అయిడియా ఇచ్చినవాడిలా కళ్ళెగరేసి కాలరు సర్దుకొంటూ.

అతడు ఊహించినట్టుగానే వాళ్లిద్దర్లోనూ ఒకేసారి జర్క్ వచ్చింది.

"ఇతగాడి దగ్గరేదో అద్భుతమైన స్టోరీయే ఉన్నట్టుంది. పౌరాణికాల్లో సస్పెన్స్... ఎంత నావెల్ థాట్?" అనుకుంటూ "మీ కథ వినడానికి మేం రెడీ... ఇక కానివ్వండి" అన్నారు.

"ఆహా ఏమి నా భాగ్యం...
ఇక వదిలిపోతుంది ఇండస్ట్రీలో
భావదారిద్ర్య వైరాగ్యం... "

అన్నాడు సుందరాచార్య ఆపుకోలేని ఎమోషన్‌తో. అంతలో భార్యకిచ్చిన మాట గుర్తు కొచ్చింది. ఎందుకైనా మంచిదని "ఎలా ఉంది సార్ నాప్రాస?" అని అడిగాడు.

"మీకు ప్రాస అంటే మోజా?"

"మోజా? వాక్యానికో ప్రాసపడకపోతే ప్రాణం జిలార్చుకుపోతుందండి" అన్నాడు నిజం చెప్పేస్తూ.

"మరింత సేపు బాగానే మాట్లాడేరుగా?!"

"అది నాభార్యకిచ్చిన మాటకు కట్టుబడి...
కానీ మీరు ఇచ్చిన ప్రోత్సాహమే
నా ప్రాసకు ఇప్పుడు పెట్టుబడి".

"వీలైనంత వరకు ప్రాసలు తగ్గించి చెప్పండి" అన్నారు అతని సంగతి తెలియక.

"అసలు నాకు చిన్నప్పుడు మా అమ్మ చ్యవనప్రాశ పట్టినప్పట్నించీ అలవాటండీ ఈ ప్రాస" అన్నాడు సుందరాచార్య రెచ్చిపోతూ.

"మీరు ఆస్మా పేషెంటా?"

"అవునండీ.... అస్తమానం ఆస్మాతో బాధపడే వాణ్ణి చిన్నప్పుడు. అందుకే నాకు అన్నప్రాశన కంటే ముందు చ్యవనప్రాశే చేశారు".

బిక్కచచ్చిపోయారు అంకుశం పరాంకుశం.

"త్వరగా కథను చెప్పండి
ప్రాసలకు గ్యాపిచ్చి...
లేకుంటే ఎక్కుతుంది
మాకు తిరుగులేని పిచ్చి"

అన్నారు ఇంకెలా ముందుకెళ్ళాలో తెలీక.

"ఆహా... మీరు కూడా ప్రాసలు అద్భుతంగా వేస్తున్నారే" అంటూ పరవశించిపోతున్న సుందరాచార్య నిలువుగుడ్లేసుకుని చూస్తున్న వారిద్దర్నీ గమనించి కథ చెప్పే మూడ్‌లో కొచ్చేశాడు.

"ఇంతకూ సస్పెన్స్ కథ కావాలన్నారు కదూ.... చచ్చుపెన్నులు ఊహించలేని సస్‌పెన్స్ కథ, అందరికీ తెలిసిన కథ చెప్తా వినండి" అన్నాడు.

"అందరికీ తెలిసిన కథా....
అదేంటి?"

"వినాయకుడి కథ"

"వినాయకుడి కథా!? అందులో ఏవుందీ సస్పెన్సు!?"

"లేకేం బోలెడంత ఉంది.... పార్వతీదేవి స్నానం చేస్తూ వినాయకుణ్ణి కాపలాపెడుతుంది కదా. అప్పుడే వచ్చిన శివుడికి ఇతగాడు ఎవరా అన్నది సస్పెన్స్...

తల్లి స్నానం చేస్తుంటే లోపలికి వెళ్తానంటున్న ఈ వ్యక్తి ఎవరా అన్నది వినాయకుడికి సస్పెన్స్".

నిలువుగుడ్లు గుండ్రంగా తిరగటం మొదలు

జస్ట్ ఫర్ ఫన్

## 'ఆది' కథ!

భగవంతుడు ఆడమ్, ఈవ్‌లని సృష్టించి సృష్టిలో విశిష్ట సృష్టికి శ్రీకారం చుట్టారు.



గార్డెన్ ఆఫ్ ఈడెన్‌లో ఈవ్ నరసన వున్నా ఆడమ్‌ని ఒక సందేహం తీరక వేధిస్తోంది.

సృష్టికర్తనే అడిగి సందేహం తీర్చకుందామనుకున్నాడు ఆడమ్. ఒక రోజు తను ఒంటరిగా వున్న సమయంలో ఆకాశం వైపు చూస్తూ "హే భగవాన్" అంటూ ప్రార్థించాడు.

"ఏమిటి ఆడమ్" అంటూ భగవంతుని వాణి వినిపించింది.

"భగవాన్ నన్ను ఒక సందేహం ఈవ్‌కన్నా ఎక్కువగా అంటి పెట్టుకుని వుంది" అన్నాడు ఆడమ్.

"చెప్పు" భగవంతుడు ధైర్యం చెప్పాడు.

"భగవాన్ మీరు ఈవ్‌ని ఎందుకు అంత అందంగా సృష్టించారు" అని తన సందేహాన్ని వెల్లడించాడు ఆడమ్.

"అదా నీ సందేహం. ఆమె ప్రేమలో నువ్వు పడడానికి" భగవంతుడు చెప్పాడు.

"అది సరే భగవాన్, మరి ఈవ్‌ని అంత మూర్ఖురాలిగా ఎందుకు సృష్టించారు" అని వెంటనే అడిగాడు ఆడమ్.

"అమాయకుడా అందుకూ కారణం వుంది. ఈవ్ నీ ప్రేమలో పడడానికి" అంటూ కనిపించని భగవంతుని వాణి వినిపించకుండా ఆగిపోయింది.'

-తాజీప్రసాద్

పెట్టాయి. అంకుశం, పరాంకుశంకి. అవేవీ గమనించే పరిస్థితిలో లేడు సుందరాచార్య.

"వచ్చినవాడు కాస్సేపు వెయిట్ చెయ్యకుండా తన కొడుకు తల ఎందుకు నరికేశాడా" అన్నది పార్వతీదేవికి సస్పెన్స్.

ఏ తల తీసుకువచ్చి బ్రతికిస్తాడా అన్నది నందికి, భృంగికి సస్పెన్స్....

ఎవరు ఉత్తరాన తల పెట్టుకుని పడుకొని ఉంటారా అన్నది వెతుకుతున్న, తక్కిన ప్రమథ గణాలకి సస్పెన్స్...

కావాలంటే ఆ సీన్లో 'ఉత్తరాన ఊరవతలా" అనే పాటని బ్యాగ్రౌండ్ మ్యూజిక్‌గా వాడుకోవచ్చు కూడా" అంటూ ఓ ఉచిత సలహా పారేశాడు.

"పౌరాణిక చిత్రానికి సాంఘిక చిత్రంలోని పాట బ్యాగ్రౌండ్ మ్యూజిక్‌గా పెట్టడం ఏవిటండీ?"

"అదేనండీ నావెల్టీ... ఏం చెప్తున్నానూ... ఆ.... య్యస్ గుర్తుకొచ్చింది. చంద్రుడు నవ్వడంతో తర్వాత ఏం జరుగుతుందా అని దేవతలకి సస్పెన్స్...
తను పొందిన శాపానికి తరుణోపాయం ఏవిటా అన్నది చంద్రుడికి సస్పెన్స్....
ఆ తర్వాత చంద్రుణ్ణి పాలలో చూసిన శ్రీకృష్ణుడికి ఏ ఆపద రానున్నదోనని రుక్మిణీదేవికి సస్పెన్స్" అంటూ ఊపిరి తీసుకోడానికి ఆగాడు సుందరాచార్య.

"ఇంకా ఉందా అండీ సస్పెన్స్" అని అడిగారా ఇద్దరూ దొరికిన ఆ కాస్త గ్యాప్‌లో.

"టెన్షన్‌గా ఉందాండీ?"

కాదంటే ఇంకెలా ప్రొసీడవుతాడో తెలీక ఔనని తలూపేశారు ముందు జాగ్రత్త చర్యగా.

"చూశారా చూశారా ఇన్ని సినిమాలు తీసిన మీరే ఇంత టెన్షన్ ఫీలయిపోతుంటే ఇక ఆడియన్స్ సంగతి చెప్పాలా... అన్నట్టు ఎంత వరకూ చెప్పాను... ఆ మళ్ళీ గుర్తుకొచ్చింది...
తనకు శమంతకమణిని సత్రాజిత్తు ఎందుకు ఇవ్వనన్నాడో శ్రీకృష్ణుడికి సస్పెన్స్....
ఆ మణిని ధరించి వెళ్ళిన ప్రసేనుడు ఏవయ్యాడోనని సత్రాజిత్తుకి సస్పెన్స్...
పోయిన ఆ శమంతకమణి జాడ తెలిసే వరకు వెదుకుతున్న భటులకి సస్పెన్స్...
శ్రీకృష్ణుడు, జాంబవంతుడు పోరాడుతూ ఉంటే అది ఎప్పుడు ముగుస్తుందోనని జాంబవతికి సస్పెన్స్....
తానెందుకు ఓడిపోతున్నాడో తెలుసుకోలేని జాంబవంతుడికి శ్రీకృష్ణుడే శ్రీరాముడని తెలిసే వరకూ సస్పెన్స్..

ఇలా అడుగడుగునా సస్పెన్స్‌తో ఉన్న వినాయకుడి కథ కన్నా సస్పెన్స్ ఉన్న పౌరాణిక కథ ఏముందండీ? చెప్పండి" అన్నాడు సుందరాచార్య సోఫాలో వెనక్కి చేరబడి.

"మేం అడిగింది పాత్రలు సస్పెన్స్‌లో పడి పోయే కథ కాదండీ.... ప్రేక్షకుల్ని సస్పెన్స్‌లో ముంచే కథండీ".

"నాకర్థం అయిందండీ... శ్రీకృష్ణుడు దేవుడు కాబట్టి అలాంటి నీలాపనింద నుంచి బైటపడ్డాడు. మరి సామాన్య మానవుడి గతి ఏంటీ? అనే సస్పెన్స్‌తో బైటికొస్తాడండీ ప్రేక్షకుడు. అది చాలదుటండీ వాడికి!?"

"మీరు సాంఘిక సస్పెన్స్‌లు చెప్పలేరాండీ?" అడిగారా ఇద్దరు ఆఖరి ఆశతో.

"లేకేం అండీ... ఈ కథనే మనం సాంఘికం చేసుకోవచ్చు. పార్వతి స్నానం చెయ్యబోతుంటే తొంగి చూడబోతాడు శివరావు. 'అదేం బుద్ధి నానా' అంటాడు గణేష్. 'నీకెందుకు నోర్మూయ్' అంటూ ఒక్కటిచ్చుకొంటాడు శివరావు. తూలిపడిపోయిన గణేష్‌కి స్టూల్‌మీదున్న మేకు గుచ్చుకొని ముఖం చీరుకుపోతుంది. ఆ తర్వాత అష్టకష్టాలు పడి అతని ముఖానికి ప్లాస్టిక్ సర్జరీ చేయిస్తాడు శివరావు. దాంతో అతన్ని గుర్తుపట్టడం కష్టం అయిపోతుంది. అటువంటి గణేష్ అందరి చేతా ఎలా శభాష్ అనిపించుకుంటాడా అన్నదే మెయిన్ సస్పెన్స్ అన్నమాట... కావాలంటే ఇలాగ కూడా మార్చుకోవచ్చండీ... ఎలా ఉందండీ?" అని అడిగాడు సుందరాచార్య ముఖం నిండా కుతూహలం ఎక్స్‌ప్రెషన్‌ని గుప్పించేస్తూ.

అంతవరకు రకరకాల షాక్‌లకి అలవాటు పడ్డ అంకుశం పరాంకుశంకి ఆఖరి ఆశ అడుగంటి పోయినందుకు బాధ కలగలేదు. సుందరాచార్య గురించి మనసులో చూచాయిగా ఏర్పడిన అభిప్రాయం కన్ఫర్మ్ అయిపోయినందుకు ఓ రకంగా ఆనందంగా కూడా ఉంది. ఇక తప్పించు కోవటమే తక్షణ కర్తవ్యం అని నిర్ధారించేసుకొని "పవిత్రమైన ఒక పౌరాణిక కథని ఇలా ఇంత విచిత్రంగా మార్చుకోవచ్చని ఇన్నేళ్ళ మా సినిమా అనుభవంలో మాకు తట్టని విషయం సుమండీ... ఇన్నాళ్ళకు మాకు జ్ఞానోదయం అయింది" అన్నారు.

"థాంక్సండీ.... మీరైనా గుర్తించారు నా ప్రతిభని" అన్నాడతను పొంగిపోతూ.... కాస్సేపాగి "ఇంకోటుందండీ" అన్నాడు ఇదే ఛాన్సని.

"ఇంకో కథా!?"

"కథ కాదండీ... విషయం అండి.... ఒకప్పుడు మన సినిమాల్లో మాటలు, పాటలు ఒకరే రాసే వారు. ఇప్పుడు మాటలు ఒకరు పాటలు కొంతమంది రాస్తున్నారు. కథ, మాటలతో పాటు పాటలు కూడా నేను రాస్తే మళ్ళీ పాతరోజుల్లోని స్వర్ణయుగాన్ని ప్రేక్షకులకి అందించిన వాళ్ళవుతారు మీరు".

"మీరు పాటలు కూడా రాస్తారా?" అదిరి పడ్డారా ఇద్దరూ కొత్తరకం షాక్‌కి.

"ట్యూనిస్తే!?"

"హమ్మయ్య... ట్యూనిప్పుడు లేదుగా... అయినా ట్యూన్ ఇవ్వడం మ్యూజిక్ డైరెక్టర్ పని. మా పనికాదు.." అన్నారు వంతులవారీగా.

"నాకు తెలుసండీ... అందుకే నాకు బాగా వచ్చిన ట్యూన్‌కే సాహిత్యం రాసేసుకుని తెచ్చా. నేనే పాడి వినిపిస్తా.... వినండి" అన్నాడతను పట్టువదలని విక్రమార్కుడిలా.

"ఇదే లాస్ట్ కదా... మాటివ్వాలి మరి" అన్నాడు అంకుశం చిలిపిగా చేయిచాస్తూ.

"ఓయ్యస్.... ఆ విషయంలో నో ప్రాబ్లెమ్... ఏదో హడావుడిగా బయలు దేరడంతో ఇంతకు మించి ఇవాళ్టికి నా దగ్గర స్టాకు ఏదీ లేదు కూడా..."

"అయితే కానీండి మరి" అన్నాడు పరాంకుశం హుషారుగా మనసులో బతుకు జీవుడా అనుకుంటూ.

"ఒరిజనల్ పాట వేటూరి సుందరరామ్మూర్తి రాసిందండి.

'కలికి చిలక చలికి దరికి చేరగనే' అంటూ మొత్తం పల్లవి అంతా

'ల'కారాలతోనే రాశారండీ...



అంతకు ముందు ఆత్రేయగారు 'రేకంటి రూపం కంటి' అంటూ అన్నీ 'ట'కారాలతో ఓ పాట రాశారండీ.... వాళ్ళిద్దరి ఇన్స్పిరేషనే కదండీ నాకు. అందుకని 'కలికిచిలక' పాట ట్యూన్‌లో అన్నీ 'ర'కారాలతోనే రాశానండీ ఈ పాట'' అన్నాడు జేబులోంచి పాట కాగితం తీస్తూ.

" 'ర'కారలతోనా?''

"అవున్సార్ కొత్త ప్రయోగం ఇది...

గుర్రమల్లె గుర్రుపెట్టి చూడకుమా

తొర్రలోన చిర్రుబుర్రులాడకుమా

ఎర్రగున్న కుర్రపిల్ల సర్రుమన్నది

జుర్రుకున్న కుర్రతనం వర్రగున్నది

తుర్రుమంటె హుర్రే హుర్రే హుర్రే"

ఇంకా చరణాలు పాడాలనుకొని వాళ్ళిద్దరి వంకా చూశాడతను. పరాంకుశం బాత్‌రూమ్‌కి వెళ్లివచ్చినట్టున్నాడు. అంకుశం మాత్రం ఫ్రిజ్‌లో పెట్టేసినట్టు ఫ్రీజ్ అయిపోయాడు. సదరు భంగిమ అర్థంకాక "సార్... సార్... మళ్ళీ తన్మయత్వంలోకి వెళ్ళి పోయారా?'' అని అడిగాడు.

"అసలు మాకొక తనువుందన్న సంగతే మర్చిపోయాం. అప్పుడే స్వర్గానికి వెళ్ళిపోయాం అనుకున్నాం''

"థాంక్యూసార్... థాంక్యూ'' అన్నాడు సుందరాచార్య ఉప్పొంగిపోతున్న ఆనందాన్ని వినయంతో కప్పేయడానికి ప్రయత్నిస్తూ.

"ఖర్మ... వీడికి వ్యంగ్యం, వెటకారంలాంటివేవీ తెలిసినట్టు లేవు'' అని మనసులో అనుకొని "తొర్రలో చిర్రుబుర్రులాడటం అంటే ఏవిటి గురూగారూ?'' అడిగాడు అంకుశం.

"అబ్బే... దానికే అర్థమూ లేదండీ.... అయినా యుగళగీతాల్లో కొన్ని మాటలకి ఈ కాలంలో ఏ అర్థమూ ఉండకూడదండీ. ఉండదు కూడా'' అన్నాడు సుందరాచార్య వారి అజ్ఞానానికి జాలిపడుతూ.

"అయితే అంతా అనర్థమే అన్నమాట... మరి జుర్రుకున్న కుర్రతనం వర్రగుండడం ఏంటంటీ?'' అడిగాడు పరాంకుశం బహు అమాయకంగా.

"అది మా గురువుగారు ఆత్రేయ టైప్‌లో కొట్టా''.

"పోదురూ బడాయి.... ఇంత చిన్నముక్కకి మద్రాసుకెళ్ళి ఆత్రేయగారింట్లో టైప్‌రైటర్ తీసుకొని కొట్టాలటండీ? ఈ ఊళ్ళో తెలుగు టైప్‌రైటర్లే లేవా... మరీ చోద్యం కాక పోతే...'' అన్నాడు అంకుశం.

"ఏంటో... డైరెక్టర్‌గారు తెగ కార్టూన్ లేసేస్తున్నారు'' అన్నాడు సుందరాచార్య.

"ఓహో దీన్ని కార్టూన్ అంటారా....!? సరేగానీ... మాకిప్పుడే ఓ బ్రహ్మాండమైన అయిడియా వచ్చింది'' అన్నాడు పరాంకుశం.

"ఏదీ... నన్ను చూశాక, నా కథ, మాటలు, పాట విన్నాక.... అంతే కదూ!?''

"ఎగ్జాట్లీ''.

"థాంక్యూ.... థాంక్యూసర్... ఇంతకీ ఏంటండీ ఆ అయిడియా''.

"మన సినిమాల్లో హీరోలకి హీరోయిన్‌లకి కాస్ట్యూమర్లు, బ్రెయిన్ ట్యూమర్లు ఉంటారు కదండీ...''

"బ్రెయిన్ ట్యూమర్లు ఎవరండీ?'' అడిగాడు సుందరాచార్య ఆశ్చర్యంగా.

"ఓహ్... అదా... మీ ప్రభావం మా వాడిమీద పడింది లెండి. అందుకే కొత్త కొత్త పదాలు సృష్టించేస్తున్నాడు. మా వాడి ఉద్దేశం కాస్ట్యూమర్లు, హెయిర్ డ్రెస్సర్లు అనీ'' అని సర్దేశాడు పరాంకుశం.

"ఆ... కరెక్ట్... అలా కాస్ట్యూమర్లు, హెయిర్ డ్రెస్సర్లు ఉన్నట్టే ప్రత్యేకంగా హీరో గారి డైలాగులకి మాత్రం స్పెషల్‌గా ఓ రైటరుంటే ఎలా ఉంటుందీ?'' అన్నాడు అంకుశం అందిపుచ్చుకుని.

"అదరహో అదరహో''

"అదురుతుంది కదా.... అంచేత మేం తీయబోయే పిక్చర్లో ఫస్ట్‌హాఫ్‌లో ... అంటే... ఇంట్రవెల్‌దాకా మా హీరోకి - మాటలు, పాటలు... అన్నీ మీరే.... అంతా మీరే.'''

"వాహ్...అదుర్స్...కానీ ఇంట్రవల్ దాకానే ఎందుకండీ... మరీ ఆ తర్వాత....!?''

"దానికి ఇంకో రైటర్‌తో రాయించు కుంటాం... ఇద్దరుంటే పోటీపడి రాయొచ్చు. హీరోగారు కూడా సంతోషించి కాల్షీట్‌లు బాగా ఎడ్జెస్ట్ చేస్తారు. మీలో టాలెంట్ ఉంటే భవిష్యత్తులో ఇద్దరు ముగ్గురు హీరోలకి పర్మనెంట్ రైటర్‌గా సెటిలయిపోవచ్చు కూడా'' అన్నాడు అంకుశం డ్రీమ్ సీన్‌కి సూచనలా చూపుడు వేలితో సర్కిల్స్ చుట్టేస్తూ.

సుందరాచార్య కూడా ఇంచుమించు సగం దూరం వెళ్లిపోయాడు కలల్లోకి.

"సార్... గురూగారూ.... ఇంటికెళ్ళి మాటలు, పాటలు ఆలోచించండి సార్'' అంటూ తట్టి లేపాడు పరాంకుశం.

"కరెక్టే... ముందాపని చెయ్యాలి కదా.... ఏవిటో నన్ను మరీ మొహమాట పెట్టేస్తున్నారు... ఇంతకీ స్టోరీ ఫైనలైజ్ చేసుకోలేదు మనం'' అన్నాడతను.

"ఆ... అదే... మీ ప్రతిభ గమనించాక పౌరాణిక సినిమా, సస్పెన్స్ సినిమా అన్నీ వాయిదా వేసేసుకొని వీరప్పన్ తిరిగే అడవుల్లాంటి అడవుల్లో ఓ జంగిల్ సినిమా తియ్యాలనే అయిడియా వచ్చింది నాకు'' అన్నాడు అంకుశం.

"అలా అయితే పెద్ద హీరో డేట్‌లు నా దగ్గరున్నాయి. ఆ హీరో ఎవరో క్లాప్ కొట్టేరోజే ప్రకటిస్తా. అయ్యా సుందరాచార్య గారూ.... మన సినిమా కన్ఫర్మ్‌డ్... టార్జాన్ సినిమాని నిజమైన అడవుల్లో పెద్ద హీరోతో తీస్తున్నాం. ఫస్ట్ హాఫ్ వరకు హీరోగారికి మాటలూ పాటలూ ఊహించేసి, రాసేసి సిద్ధం చెయ్యండి. నెలరోజుల్లో మీ ఇంటికొచ్చి మీ డబ్బులు మీకిచ్చేసి మా స్క్రిప్ట్ మేం పట్టుకుపోతాం... ఏంటీ.... ఓకేనా?'' అన్నాడు. పరాంకుశం ఆలోచించడానికి అవకాశం ఇవ్వకుండా.

"ఓకేనా అని అడుగుతారేంటండి.... అది ఓకే కాదు నా పాలిట పూల బొకే'' అన్నాడు సుందరాచార్య ఆవేశంతో ఊగిపోతూ.

"సార్సార్... ప్రాసలతో సహా ఇంటికెళ్లి ఆలోచించండి సార్... ప్లీజ్'' అంటూ అతణ్ని ఆటో ఎక్కించేసి అయిదు నిముషాల్లో హోటల్ రూమ్ ఖాళీ చేసేసేరు అంకుశం - పరాంకుశం.

***

ఎవరో పిల్లిలా నడుస్తూ బెడ్‌రూమ్‌లోకి వెళ్ళినట్టుగా అనిపించి వంటింట్లోంచి వచ్చి చూసింది నాగమణి.

మంచం మీద విష్ణుమూర్తి పోజులో పడుకుని ఉన్నాడు సుందరాచార్య.

"రా.... నీకోసమే చెప్పులోంచి కాళ్ళు తీసి



రెడీగా ఉంచాను" అన్నాడు ఆమెను చూసి.

"ఎందుకు?" అందామె ఆశ్చర్యంగా.

"ఎందుకేవిటి... పెళ్ళానివికదాని ఫస్ట్ ఛాన్స్ నీకిస్తుంటే...!? రేపట్నించి అందరూ నాకు పాదాభివందనం చేస్తూ ఉంటే కళ్ళకద్దుకోడాని క్కాదు కదా కనీసం చూడ్డానిక్కూడా ఛాన్సు దొరకదు నీకు. ఆలోచించుకో... ఒకటవ సారి... పాదాలు రెడీ... రెండవసారి... ఆలసించిన ఆశా భంగము... మూడోస్సారి..." అంటూ చెలరేగి పోతున్నాడతను.

"ఎంత అమాయకులండీ?" అందామె జాలిగా చూసి.

"ఆమాట నేననాలి నిన్ను చూసి.... అసలు విషయం తెలిస్తే నువ్విలా అనవు. బ్రహ్మరథం పడతావు" అంటూ జరిగింది మొత్తం ఆడియో క్యాసెట్ పెట్టేశాడు.

"అందుకే అన్నాను మిమ్మల్ని అమాయకులని" అందామె.

"అద్గో మళ్ళీ అదేమాట"

"ఏం చెయ్యను మరి... మీకింకా అర్థం కాకపోతే... టార్జాన్ సినిమాని ప్రపంచంలోని ఏ భాషల్లో తీసినా ఇంట్రవల్ వరకు హీరోకి అరుపులు తప్ప ఒక్క డైలాగు కూడా ఉండదు. ఇంక మీరేం రాస్తారు మాటలూ... పాటలూ...?"

గుండెలో చిన్న కుదుపు వచ్చినట్టు ఒక్కసారిగా ఊగిఆగిపోయాడు - షాకులు ఇవ్వడమే తప్ప తీసుకోవటం తెలియని - సుందరాచార్య.

తనని ఈ పద్ధతిలో బురిడీ కొట్టించి బైటికి పంపించాలనే ఊహ వాళ్ళకి ఎలా వచ్చిందా? అని ఆలోచించసాగాడు. పరాంకుశం బాత్‌రూమ్ లోంచి బైటకి వెళ్లడం గుర్తుకొచ్చింది. ఆ టైమ్‌లో ఎవరైనా ఫోన్ చేసి వాళ్ళకి చెప్పే అవకాశం ఉంది. కానీ ఎవరికంత అవసరం....?

"వాళ్ళకి ఫోన్ చేసి మాట్లాడేవు కదూ?" అడిగాడు కోపంగా భార్యని చూస్తూ.

అవునన్నట్టు తలూపిందామె.

"నీకేం ద్రోహం చేశానని ఇలా వెన్నుపోటు పొడిచావు... నేను పైకి రావటం నీకిష్టం లేదా?"

ఆమె ధైర్యంగా తలెత్తి అతని కళ్ళలోకి చూసింది" ఇష్టం కాబట్టే ఇలా చేశాను" అంది.

ఆవేశాన్ని అవమానంతో కలిపి హరాయించుకోడానికి చేస్తున్న ప్రయత్నంలో అర్థం కాలేద తనకి.

"నా మనసులో మాట చెప్తాను... మరోలా అనుకోకండి.. ఉన్న ఉద్యోగం సక్రమంగా చేసుకోకుండా రోజూ వెళ్ళి సంతకాలు పెట్టేసి స్టూడియోల చుట్టూ, సినిమా వాళ్ళ చుట్టూ తిరగడం, లేకపోతే జీతం నష్టం మీద ఇంట్లో కూర్చుని ఎవ్వరూ మెచ్చుకోలేని రాతలు రాయటం, అవేవీ గ్రహించుకోలేక మీ భ్రమల్లోనే మీరు బతికేస్తూ అందరూ మీ గురించి వెకిలిగా మాట్లాడుకునే అవకాశాన్ని ఇవ్వటం - ఇవన్నీ నాకెంత బాధ కలిగిస్తున్నాయో తెలుసా? నిజంగా మీ(రాసేవన్నీ అంత గొప్పవే అయితే, మీ మీద మీకున్న నమ్మకమే కరెక్ట్ అయితే మనకు తిండి పెట్టే ఆఫీసునెందుకూ మోసం చెయ్యడం? రిజైన్ చేసేసి బైటికి వచ్చి మీ శక్తిని నిరూపించుకోండి. నిజంగా అవసరం ఉన్న వాడికైనా ఓ ఉద్యోగం దొరుకుతుంది. ఇలా మోసం చేస్తూ సంపాదించి తినే తిండి వల్ల కలిగే ఆలోచనలు సత్ఫలితాలను ఇస్తాయా చెప్పండి....!?" అడిగిందామె ఎంతో సౌమ్యంగా.

వెయ్యిగొంతులు వెర్రిగా ఘోషిస్తూ చేసే రాద్ధాంతాలకు లేని శక్తి మృదువుగా చెప్పే ఒక్కమాటకి ఉంటుంది.

సమయాన్ని గుర్తించి సందర్భాన్ని బట్టి వివేకానికి పదునుపెట్టగల విచక్షణకుండే బలం అలాంటిది. మొదటిసారి అనుభవపూర్వకంగా ఆ విషయం అవగాహన అయిందతనికి.

"ఈ యాంగిల్‌లో నేనెప్పుడూ ఆలోచించ లేదు సారీ" అన్నాడు ఓ అరగంట పాటు మౌనంగా హృదయంతో సాగిన ఘర్షణ తరువాత.

"నాకు తెలుసు... అందుకే మిమ్మల్ని అమాయకులు అని అన్నాను" అందామె తేటపడిన మనసుతో.

"ఇంకా నయం... చెడ్డవాణ్ణి అనుకోలేదు"

"అలా అనుకొని ఉంటే ఇంత బాధపడతానా?"

"మరేం చేసేదానివి?"

"మీ ఆఫీస్‌కి వెళ్ళి కంపాషనేట్ గ్రౌండ్స్ కింద మీ ఉద్యోగం నాకు ఇమ్మని లెటర్ పెట్టేదాన్ని".

"ఏయ్... తెలిసే మాట్లాడుతున్నావా.... భర్తపోతేనే కంపాషనేట్ గ్రౌండ్స్ కింద భార్యకిస్తారు ఉద్యోగం..."

"పోతేనే కాదు... పట్టించుకోకపోతే కూడా.... అలా రూల్సు మార్చాలని లెటర్స్ మీద లెటర్స్ పెడతా" అందామె సూటిగా అతని కళ్ళలోకి చూస్తూ.

"బాబోయ్! అంతకన్నా ఈ ట్రీట్‌మెంటే బావుంది" అన్నాడతను రెండు చేతులు ఎత్తి దండం పెట్టేస్తూ.

సెప్టెంబరు 5 సలిల్ వర్ధంతి సందర్భంగా...

# భగవంతుడి భాష తెలిసిన సంగీత దర్శకుడు

# సలిల్ చౌధురి



ఏర్ ఫోర్సులో చేరిన కొత్తలో...

'మధు మతి' సినిమా మా డిఫెన్స్ థియేటర్ లోకి వచ్చింది.

ఫ్రెండ్స్‌తో కలిసి చూశా!

అప్పటి దాకా 'తుమ్హారా నామ్ క్యా హై' అంటే 'మేరా నామ్ రాజూ' అని జవాబివ్వటం తప్ప పెద్దగా హిందీ రాదు. ట్రెనింగ్ సెంటర్‌లోకి వెళ్ళగానే ఓ మినీ భారతాన్ని చూశా... అన్ని రాష్ట్రాల వాళ్ళూ అన్ని ప్రాంతాల వాళ్ళూ అన్ని భాషల వాళ్ళూ. మీడియమ్ ఇంగ్లీషు. ఓ పదిహేను రోజులు గడిస్తే గానీ ఎవరు ఏ రాష్ట్రం వాళ్ళో వాళ్ళ భాష ఏమిటో అర్థంకాలేదు.

'మధుమతి' సినిమా చూసినప్పుడు భాష పూర్తిగా అర్థం కాకపోయినా సినిమా అర్థం అయింది. I simply loved it. బయటికి వచ్చిన వెంటనే మళ్ళీ టిక్కెట్టు కొని రెండో షో కూడా చూశా. మా 'బులెట్'కి రాగానే హిందీవాడ్ని ఒకడ్ని పరిచయం చేసుకుని 'మధుమతి' పాటలు 'ఏమన్నావచ్చా' అని ఎంక్వైర్ చేశా. 'వచ్చు'నన్నాడు. 'పాడమన్నా...'

అతను పాడుతుంటే నేను తెలుగులో రాసుకున్నా.

ఆ పాట 'సుహానా సఫర్ ఔర్ యె మౌసమ్ హసీఁ' అనేపాట. పాట పాడిన స్నేహితుడి పేరు కృష్ణ చంద్ర.

ఇదంతా ఎందుకు చెప్తున్నానంటే -

'Music is the Language of God' అని హైద్రాబాద్‌లో 'ఘంటసాల' విగ్రహావిష్కరణ సభలో (హేట్సాఫ్ టు బాలు...) లతా మంగేష్కర్ గారన్నారు.

ఆ భగవంతుడి భాష బాగా తెలిసిన వాడు 'సలిల్ చౌధురి'.

గుండెలోయల్లోంచి స్వరాల్ని బయటికి తీసి బాణీలు కట్టిన సంగీత దర్శకుడు 'సలిల్ చౌధురి...'! ఓ కథా నాయకుడు (దిలీప్‌కుమార్) కొండల్లో కోనల్లో హాయిగా హుషారుగా నడుస్తూ 'సుహానా సఫర్ ఔర్ యే మౌసమ్ హసీఁ' అని పాడుకున్నా -

ఓ కథానాయకి 'లేని' బాధని ముఖం మీదకి తెచ్చుకుని 'దయ్యారె దయ్యారె దేఖోరే పాపీ బిఛువా, అని పాడుతూ - ఆ 'దొంగ' తేలుకాటుకి 'మందు' నా ప్రియుడి 'ముద్దే' అని సిగ్గు వొలకపోసినా - (వైజయంతిమాల)

'జంగల్ మే మోర్ నాచా కిసీనేన దేఖా' అని ఓ హాస్యనటుడు (జానీవాకర్) పెగ్గు బిగించి ప్రేక్షకుల్ని తన 'అల్లరి'తో ఆనంద పరవశుల్ని చేసినా -

'ఆజారే... ఓ... పర్‌దేశీ' అని ఆ కథానాయిక కాబోయే ప్రియుడ్ని తలుచుకుంటూ కొండ కోనల్లో తిరిగినా

'ఘడీ ఘడీ మేరా దిల్ ధడ్‌కే' అని ఆమె తన గుండె చప్పుడులోని 'గుట్టు' వినిపించినా -

'టూటే హువె ఖ్వాబోంనే' అని కథా నాయకుడు గుండె పగిలి విలపిస్తూ ప్రేక్షకులచేత కన్నీరు పెట్టించినా సామాన్యమైన విషయం కాదు.

'లత'గారు అన్నట్లు 'ఎంతో బాగా భగవంతుడి భాషని' అర్థం చేసుకుని ఉండాలి!

ఒక సినిమాలో 'ఒక్క పాట' సూపర్ హిట్టయితే పొంగిపోయి 'I am the greatest'



అని పోజిచ్చే యీ రోజుల్లో, 'ఆనాడు' ఆ పిక్చర్లో 'అన్ని పాటలూ' సూపర్ డూపర్ హిట్టయినా వడ్డించిన విస్తరిలా 'వినయంతో' నిలిచిన ఆ మహానుభావుల్ని ఎన్ని నోళ్ళతో పొగడాలి? నాలుగు దశాబ్దాలు దాటినా 'మధుమతి' పాటలు ప్రజల హృదయాల్లో నిలిచి పోయాయంటే ఆ ప్రతిభకి ఏ పట్టం కట్టాలి?!

'సలిల్‌చౌధురి' మితభాషి మొహమాటస్తుడు. ముక్కుసూటి మనిషి. దొంగదారులూ దొడ్డిదారులూ తెలియవు. మనం 'అందంగా' పిలుచుకునే 'పబ్లిక్ రిలేషన్స్' అంతకన్నా తెలియవు. హిపోక్రసీ'కి మారుపేరైన 'బాలీవుడ్‌'లో ఇమడలేక 'తన' ప్రజలమధ్యకి ఎన్నోసార్లు 'పారి' పోయిన ఘనత ఆయనదే.

'సలిల్‌చౌధురి' కమ్యూనిస్టు. కమ్యూనిస్టు సిద్ధాంతాలని మనసా వాచా నమ్మి... ఆ సిద్ధాంతాలని 'సంగీత పరంగా' ప్రచారం చేసేవాడు. విచిత్రమేమిటంటే - కమ్యూనిస్టయినా 'దుర్గా పూజ' రోజుల్లో (దసరా) 'భక్తి' గీతాలు స్వరపరిచి ప్రజలకందించిన ఘనతా సలిల్ చౌధురిదే.

సలిల్ చౌధురిని పట్టుపట్టి సంగీత దర్శకుడ్ని చేసిన ఘనత బిమల్‌రాయ్‌కే చెందుతుంది. తీసుకొచ్చింది 'ముఖర్జీ'లైనా 'మధుమతి'ని కట్టబెట్టింది బిమల్‌రాయే. (ఒక చిన్నమాట చెప్పి తీరాలి - ఎవరు తీసుకొచ్చారనే దానికంటే - ఎవరు నిలబెట్టారనేదే ఈ చిత్ర పరిశ్రమలో ముఖ్యం - జీవితంలో కూడా!).

ఒక సినిమాని హిట్ చేసి మరుగుపడిన వాళ్ళెందరో వున్నారు. హిట్టయిన ఒక సినిమా పేరు చెప్పుకుని పది సినిమాలు సంపాయించుకున్న వాళ్ళూ ఎందరో వున్నారు. ప్రతీ సినిమానీ హిట్ చేసి కూడా ఆ సక్సెస్‌ని Cash చేసుకోవడం తెలీని 'వర్క్‌హాలిక్' సలిల్ చౌధురి. 'చిత్త' శుద్ధితో పని చెయ్యటం తప్ప - 'విత్త' శుద్ధి కోసం పాటుపడని 'ప్రజా' సంగీత దర్శకుడు సలిల్ చౌధురి.

ఆయన స్వరపరిచిన ప్రతి పాటా ఓ అద్భుతం. సిచ్యుయేషన్‌కి తగినట్లు స్వరాల్ని సమకూర్చడం ఆయన ప్రత్యేకత.

'జాగో మోహన్ ప్యారే' అని భగవంతుడ్ని మేలుకొల్పినా - 'యే మెరే ప్యారే వతన్ - యే మెరే బిఛ్‌డే చమన్ తుఝ్‌పె దిల్ కుర్బాన్... తుఝ్‌పె దిల్ కుర్బాన్ (ప్రేమ్ ధవన్... చిత్రం... కాబూలీ వాలా - గాయకుడు మన్నాదే) అంటూ

దేశభక్తి గీతాన్ని స్వరపరిచినా - 'మైనే తెరేలియే హీ సాత్ రంగ్‌కే సప్‌నె చునే... సప్‌నే... సురీలే సప్‌నే...' (గుల్జార్... చిత్రం ఆనంద్... గాయకుడు ముకేష్) అని ఊహల్లో విహరించినా -

'తుమ్హే జిందగీకే ఉజాలే ముబారక్
అంధేరే హమే ఆజ్ రా 'సాగయేఁ హై'

(గుల్జార్ చిత్రం - పూర్ణిమ - గాయకుడు ముకేష్)అని ప్రేయసిని దీవించినా...

'హరియాలా సావన్... ఢోల్ బజాతా ఆయా...ధిన్ తక్‌తక్... (శైలేంద్ర... చిత్రం - దోబిఘా జమీన్- గాయకుడు - మన్నాదే) అని శ్రావణమాసాన్ని శ్లాఘించినా అలాగే -

ఏక్ రాత్ మె దో దో చాంద్ ఖిలే
ఏక్ ఘూంఘట్ మే - ఇక్ బద్‌లీమే
(రాజేంద్ర కృష్ణ - చిత్రం - బర్‌ఖా - ముకేష్)
అని ప్రేయసిని పొగిడినా -
అన్నిటి వెనకా 'హృదయం'కని(విని)పిస్తుంది.
నేడొస్తున్న 'కీబోర్డు' సంగీతంలో లేనిది అదే!
ఓ భగవంతుడా -
మళ్ళీ 'వాళ్ళ'ని పుట్టించవూ?
వాళ్ళ పాదాల్ని తాకే అవకాశాన్నివ్వవూ!
అంతటి 'వినయాన్నీ'
అంతటి 'విజ్ఞానాన్నీ'
అంతటి 'అంకితభావాన్నీ'
మాకూ 'ప్రసాదించవూ!'
ఇదే నా ప్రార్థన.
"మనుషులు వస్తారు... మనుషులు పోతారు...
కానీ నేను నిరంతరం ప్రవహిస్తూనే వుంటాను'
(Men may come & Men may go
but I go on for ever -Brook)
అన్న సెలయేరులా -
సంగీతం ప్రవహిస్తూనే వుంటుంది.
ఒక తరాన్నించి మరో తరానికి...!
ఒక హృదయాన్నించి మరో హృదయానికి!!
అలా ప్రవహింపచేసిన 'మహానుభావుల్లో' అతినిరాడంబరుడు 'సలిల్ చౌధురి'.
సినిమా 'పాట' బ్రతికున్నంతకాలం ఆయన 'అమరుడే!'

-భువనచంద్ర



తా.క.: 'మధుమతి' సినిమాలోని ఒక పాటలో సలిల్ చౌధురి ఉపయోగించిన బ్యాక్ గ్రౌండ్ మ్యూజిక్‌ని యథాతథంగా 'చెమ్మీన్' అనే మలయాళ చిత్రంలో వాడటం జరిగింది. 'ఎందు కలా జరిగిందీ' అనే ప్రశ్న కొంతకాలం నన్ను వేధించింది. తరవాత ఓ ఫ్రెండ్ (మ్యూజీషియన్) ఆ సందేహాన్ని క్లియర్ చేశారు. 'చెమ్మీన్' చిత్ర దర్శకుడు 'రాము కరియత్' కోరిక మేరకే సలిల్ చౌధురి ఆ బ్యాక్‌గ్రౌండ్ మ్యూజిక్‌ని వాడారని'. అన్నట్టు 'చెమ్మీన్'కి నేషనల్ ఎవార్డు వచ్చింది. 'మన్నాదే' మొదటిసారిగా మలయాళంలో పాడటం కూడా 'చెమ్మీన్'లోనే.. ఆ పాట 'మానసమైన వరుం' అనే పాట. అందులో రెండో చరణం అద్భుతం -

"కడలిలె ఓళవుం
కరళిలె మోహవుం
అడజగహోమనె అడజగవిల్లా" అని.

అంటే -
కడలిలోని కెరటమూ
మనసులోని మోహమూ
ఎంత అణచివేద్దామన్నా
అణగవు -అని

-భువనచంద్ర

**ఈ వ్యాసంలో ఏ తప్పులు దొర్లినా దయచేసి తెలియచేస్తే సరిదిద్దుకుంటాను. ఎందుకంటే పాటలూ పాటల రచయితల పేర్లూ అన్నీ కూడా నార్త్‌లో వున్నప్పుడు డైరీలో వ్రాసుకున్నవి. క్రాస్ చెక్ చెయ్యడానికి ఆనాడు అవకాశం లేదు. నమస్తే**

**-భువనచంద్ర**

# రచయితగా సలిల్ చౌధురి

సంగీతదర్శకులు రచయితలు కావడం అరుదు. మన ఆదినారాయణరావు గారు 'ఆదిత్య' పేరుతో కథలు రాశారు. సలిల్ చౌధురి రాసిన కథలు కష్టజీవుల గురించి.



పారిశ్రామికీకరణ రైతులను కూలీలుగా ఎలా మారుస్తుందో చూపిన "దో బిఘా జమీన్" (బెంగాలీలో 'రిక్షావాలా') సినిమా కథ ఆయన కలం నుండి వెలువడినదే! కమ్యూనిస్టు పార్టీ సభ్యుడిగా, ఇప్టా (ఆంధ్రలో ప్రజా నాట్యమండలి) కార్య కర్తగా బెంగాల్ లోని పల్లెపల్లె తిరిగి పాటలు పాడి (ఆయనే రాసి, బాణీలు కూర్చినవి) ప్రజల్లో చైతన్యం రగిలించారు.

సలిల్ తన తండ్రి ద్వారా స్ఫూర్తి పొందారంటే అతిశయోక్తి కాదు. ఆయన అసామ్ టీ తోటల్లో డాక్టరుగా పనిచేసే రోజుల్లో ఓ బ్రిటిష్ మేనేజరు తనను 'నిగ్గర్' అన్నందుకు చెంప పగలగొట్టిన ధీశాలి. అంతే కాదు సంగీతంలో నిష్ణాతుడు. ఆయన నుండి పాశ్చాత్య సంగీతం, అసామ్ గిరిజనులు నుండి జానపద సంగీతం నేర్చిన సలిల్ తన ఎనిమిదో యేటనే ఫ్లూటు వాయించగలిగేవాడు.

కలకత్తాలోని బంగబాసీ కాలేజీలో చదివాక, రెండవ ప్రపంచ యుద్ధం, బెంగాల్ కరువు కళ్లారా చూశాక ఆయన ప్రజల పక్షాన్న నిలిచాడు. 1954-55 వరకు సాగిన ఈ దశలో సలిల్ నాన్-ప్రొఫెషనల్ గానే ఉన్నాడని చెప్పాలి.

సినిమారంగానికి వచ్చిన తర్వాత ఆయన విశిష్టశైలి, విభిన్నమైన ఆర్కెస్ట్రయిజేషన్, ముఖ్యంగా బాక్‌గ్రౌండ్ సంగీతం ఇచ్చే విధానం అందరినీ ఆకట్టుకున్నాయి. 75 హిందీ సినిమాలు, 40 బెంగాలీ సినిమాలు, 26 మలయాళీ సినిమాలతో బాటు 'చైర్మన్ చలమయ్య' తెలుగు సినిమాకు కూడా సంగీతం ఇచ్చిన సలిల్ చౌధురిని జైకిషన్ 'జీనియస్' అన్నాడు. రాజ్ కపూర్ 'తబలా నుండి సరోద్ వరకు ఏ వాయిద్యాన్నైనా అవలీలగా వాయించగల ఘనుడు' అని మెచ్చుకున్నాడు.

1990లలో దూర్‌దర్శన్ వారి కోసం 50 మంది గాయకులతో పాటలు పాడించవలసివచ్చి నపుడు ఆయన తను బెంగాలీలో రాసిన ప్రజాగీతాలను యోగేశ్ చేత హిందీలోకి అనువదింపజేశారు.

- కమ్యూనికేటర్ ఫీచర్స్

## మధుమతి (1958)

రచన: శైలేంద్ర గానం: లతామంగేష్కర్

ఆజారే... పర్‌దేసీ...
మైఁ తో కబ్‌సే ఖడీ ఇస్ పార్
యే అఖియాఁ థక్ గయీఁ పంథ్ నిహార్
ఆజారే పర్‌దేసీ ॥మైఁ తో॥
మైఁ దియేకీ ఐసీ బాతీ
జల్ న సకీ జో బుఝ్ భీ న పాతీ ॥మైఁ దియే కీ॥
ఆ మిల్ మేరే జీవన్‌సాథీ ఓ... ఆజారే ॥మైఁ తో॥
తుమ్ సంగ్ జనమ్ జనమ్ కే ఫేరే
భూల్ గయే క్యోం సాజన్ మేరే ॥తుమ్ సంగ్॥
తడపత్ హూఁ మైఁ సాంజ్ సవేరే ఓ... ఆజారే ॥మైఁ తో॥
మైఁ నదియా ఫిర్ భీ మై ప్యాసీ
భేద్ యే గహరా బాత్ జరాసీ ॥మైఁ నదియా॥
బిన్ తేరే హర్ సాంస్ ఉదాసీ ఓ... ఆజారే ॥మైఁ తో॥

## ఆనంద్ (1970)

రచన: యోగేశ్ ముఖ్యగాత్రధారి: మన్నాదే

జిందగీ కైసీ హై పహేలీ హాయె
కభీ తో హఁసాయే, కభీ యే రులాయే ॥జిందగీ॥
తో భీ దేఖో మన్ నహీఁ జాగే
పీఛే పీఛే సప్‌నోంకే భాగే ॥తోభీ॥
ఇక్ దిన్ సప్‌నోం కా రాహీ
చలా జాయే సప్‌నోం సే ఆగే కహాఁ ॥జిందగీ॥
జిన్హోంనే సజాయే యహాఁ మేలే
సుఖ్ దుఃఖ్ సంగ్ సంగ్ ఝేలే ॥జిన్హోంనే॥
వో హి చున్‌కర్ ఖామోషీ
యూఁ చలే జాయేఁ అకేలే కహాఁ ॥జిందగీ॥

## మాయా (1961)

రచన : మజ్రూహ్ సుల్తాన్‌పురి గానం: లతా, రఫీ

తస్వీర్ తేరీ దిల్ మేఁ జిస్ దిన్ సే ఉతారీ హై (2)
ఫిర్ తుఝే సంగ్ లేకే,
నయే నయే రంగ్ లేకే
సప్నోంకీ మెహఫిల్ మేఁ ॥తస్వీర్ తేరీ॥
ఆ: మాథే కీ బిందియా తూ హై సనమ్
నైనోంకా కజ్‌రా పియా తేరా గమ్ ॥మాథే కీ॥
నైన్ కియే నీచే నీచే,
రహూఁ తేరే పీఛే పీఛే
చలూఁ కిసీ మంజిల్ మేఁ ॥తస్వీర్ తేరీ॥
అ: తుమ్‌సే నజర్ జబ్ గయీ హై మిల్
జహాఁ హైఁ కదమ్ తేరే వహీఁ మేరా దిల్ ॥తుమ్‌సే॥
ఝుకే జహాఁ పల్‌కేఁ తేరీ,
ఖులే జహాఁ జుల్ఫేఁ తేరీ
రహూఁ ఉసీ మంజిల్ మేఁ ॥తస్వీర్ తేరీ॥

## పరఖ్ (1960)

రచన: శైలేంద్ర గానం: లతామంగేష్కర్

ఓ సజ్‌నా, బర్‌ఖా బహార్ ఆయీ
రస్ కీ ఫుహార్ లాయీ,
అఖియోం మేఁ ప్యార్ లాయీ ॥ఓ సజ్‌నా॥
తుమ్‌కో పుకారే మేరే మన్‌కా పపీహరా (2)
మీఠీ మీఠీ అగ్‌నీ మేఁ జలే మోరా జియరా ॥ఓ సజ్‌నా॥
ఐసీ రిమ్‌ఝిమ్ మేఁ ఓ సజనీ,
ప్యాసే ప్యాసే మేరే నయన్
తేరే హీ ఖాబ్ మేఁ ఖోగయే ॥ఐసీ రిమ్‌ఝిమ్॥
సాఁవ్‌లీ సలోనీ ఘటా జబ్ జబ్ ఛాయీ (2)
అఖియోం మేఁ రైన్ ఆగయీ నిందియా న ఆయీ ॥ఓ సజ్‌నా॥

## చాంద్ ఔర్ సూరజ్ (1965)

రచన: శైలేంద్ర గానం: ఆశాభోంస్లే

బాగ్ మేఁ కలీ ఖిలీ, బగియా మెహకీ
పర్ హాయ్‌రే అభీ ఇధర్ భఁవ్‌రా నహీఁ ఆయా
రాహ్ మేఁ నజర్ బిఛీ బహకీ బహకీ
ఔర్ బేవజహ్ ఘడీ ఘడీ యే దిల్ ఘబరాయా హాయ్‌రే
క్యూం న ఆయా, క్యూం న ఆయా, క్యూం న ఆయా
బైఠే హైఁ హమ్‌తో అర్మాఁ జగాయే
సీనే మేఁ లాఖోం తూఫాఁ ఛుపాయే
మత్ పూఛో మన్‌కో కైసే మనాయా ॥బాగ్ మేఁ॥
సప్నే జో ఆయే తడ్‌పాకే జాయే
దిల్ కీ లగీ కో లెహకాకే జాయే
ముష్కిల్ సే హమ్‌నే హర్‌దిన్ బితాయా ॥బాగ్ మేఁ॥
ఇక్ మీఠీ అగ్‌నీ మేఁ జల్‌తా హై తన్ మన్
బాత్ ఔర్ బిగ్‌డీ బర్‌సా జో సావన్
బచ్‌పన్ గఁవాకే మైనే సబ్ కుఛ్ గఁవాయా ॥బాగ్ మేఁ॥

## రజ్‌నీ గంధా (1974)

రచన: యోగేశ్ గానం: లతామంగేష్కర్

ఊ ఊ ఊ ఊ ఊ ఊ ఊ ఊ
హాఁ... యూహీ మెహకే ప్రీత్ పియాకీ మేరే అనురాగీ మన్‌మేఁ
రజ్‌నీ గంధా ఫూల్ తుమ్హారే మెహకే యూహీ జీవన్ మేఁ
హాఁ... యూహీ మెహకే ప్రీత్ పియాకీ మేరే అనురాగీ మన్‌మేఁ
అధికార్ యే జబ్ సే సాజన్ కా
హర్ ధడ్‌కన్ పర్ మానా మైనే ॥అధికార్॥
మైఁ జబ్‌సే ఉన్‌కే సాథ్ బంధీ యే భేద్ తభీ జానా మైనే
కిత్‌నా సుఖ్ హై బంధన్ మేఁ ॥రజ్‌నీ గంధా॥
హర్ పల్ మేరీ ఇన్ ఆంఖోం మేఁ
బస్ రహతే హైఁ సప్నే ఉన్‌కే ॥హర్ పల్॥
మన్ కెహతా హై మైఁ రంగోంకీ ఇక్ ప్యార్ భరీ బద్‌లీ బన్‌కే
బర్‌సూఁ ఉన్‌కే ఆంగన్ మేఁ ॥రజ్‌నీ గంధా॥


చదువుల్రావు
సత్యమూర్తి
హియర్ హియర్, వన్స్ మోర్ అని తెగ అరిచేవారు
నేను ఢిల్లీలో ఇంటర్ యూనివర్సిటీ యూత్ ఫెస్టివల్లో డిబేట్ లో మాట్లాడుతూంటే అక్కడ అంతా దద్దర్లైపోయి...
నేను క్రికెట్ మేచ్ లో షాట్స్ కొడుతూంటే అంతా హాహాకారాలు చేసేవారు
నా స్మార్ట్ నెస్, నా టాలెంట్స్ ని చూసి కాలేజీ అమ్మాయిలు...
నీ డాబులకేంకానీ... నువ్వు చెయ్యలేని పని ఏదైనా ఉంటే చెప్పు. మేము చేసి చూపిస్తాము
చాలా థేంక్స్. ఈ టిఫిన్, కూల్ డ్రింక్స్ బిల్లు నేనివ్వలేను. మీరివ్వండి. టాటా...

సీరియల్

3

# సినీతిచంద్రిక



రావి కొండలరావు

**జరిగిన కథ**

**ఒక ఊళ్లో ఒక ధనవంతుని కుమారుడు సినిమా తీస్తానని పట్టుబడతాడు. ఒక మాజీ దర్శక నిర్మాత వచ్చి వాళ్లకు సినిమా తీయడంలో సాధక బాధకాలు చెప్పసాగాడు. "నేనూ, విశ్వాస్ అనే అతనూ కలిసి రత్నాలు అనే ప్రొడ్యూసర్‌ని వెంటబెట్టుకుని ఓ హీరోయిన్ ఇంటి కెళ్లాం...." అని సాగ దీస్తుంటే ధనవంతుడి కొడుకు విసుక్కున్నాడు.**

**(ఇక చదవండి)**

**"ఉండ్రా నాయనా! -- చెబుతున్నారుగా చెప్పనీ, ఏమీబోరు కొట్టడు బావుంది. చెప్పు మహాశయా!"**

**"ఏం -- ఏం చెబుతున్నానూ --విశ్వాస్ అని నాకో స్నేహితుడు..."**

**"అదంతా ఐపోయిందయ్యా -- మీరంతా కలిసి హీరోయిన్ యింటికెళ్ళారు."**

**"ఆఁ, హీరోయిన్ యింటికెళ్ళాం గదూ! ఆమె పెద్దతార. మా అందరికంటె వయస్సులో కూడా పెద్ద అనే నా నమ్మకం. అన్నీ మాట్లాడుకున్నాం. అడ్వాన్సు యిచ్చాం. ఆమె ఒప్పుకుంది. ఐందా --లెండి పోదాం అంటే ఆ రత్నా కదలడే! రానంటాడు ఆమెలేని నా జీవితం వృథా వృథా అంటాడు. అట్లా పాడుకోటానికి వీలుగా ఆమె పేరును సుధా అని మార్చుకోమంటాడు.**

"రత్నాగారూ, ముందుంది ముసళ్ళపండుగ -- కాస్త పరిచయం కానీండి -- ఆమె మీ చుట్టూ తిరుగుతుంది. అని ఏవేవో చెప్పి లేవనెత్తి, కార్లో కుదేశాం. దారంతా రత్నాగారు ఆమెకోసమే పరితపించాడు."

"మీరిలా డీలా పడిపోకూడదు రత్నాగారూ!"

'డీ'లాఎక్కడపడ్డాను పోవయ్యా, మూడంకెలా పడి చుట్టుకుపోతూ ఉంటేనూ" అని కసురుకున్నాడు రత్నా.

రత్నాలు ఆ పూట భోజనం మానేశాడు.

"నన్నొక్కసారి హుఁ నా భాగ్యదేవతతో.... హుఁ ...' మాట్లాడనివ్వరూ... హుఁ.... ఇంక నేను హుఁ ... బ్రత... హుఁ .... కను... హుఁ..." అంటూ మూలగసాగాడు.

"మూలగరాదు రత్నా -- చెబుతూ ఉన్నది నీకే!" అని గర్జించాడు విశ్వాస్, టేబిల్‌మీద కత్తితీసి అతనికి చూపుతూ, రత్నాలు 'ఆఁ' అని లేచాడు. -- "ఎబ్బే... నేనా మూలిగింది! ఎవడన్నాడామాట! ....నేనెందుకు మూలుగుతాను." అన్నాడు మామూలుగానే.

"ఆఁ అదీ వరస, కూచోండి. ఆ వేళ రావాలి. అప్పుడు మూలుగుదురుగాని" అన్నాడు విశ్వాస్.

రత్నా ఏమనుకున్నాడోగాని -- "నేను సినిమా తియ్యను" అన్నాడు ఛట్టున.

"ఆఁ" అని ఇద్దరమూ ఒకరి మొహాలు ఒకరం చూసుకున్నాము."

"మీరు నన్ను హత్య చేస్తారు -- ఆ సంగతి నాకు తెలుసు. వెనకటికి ఇట్లాగే కొందరు నమ్మించి ఒకతన్ని హత్య చెయ్యబోయారు. మీకా కథ సవిస్తరంగా చెబుతాను వినండి.

అప్పటికి సినిమాలూ, నేనూ పుట్టలేదు. ఈ కథ మా తాతగారు మా తండ్రి గారికి చెప్పగా, మా తండ్రిగారు వారి స్నేహితునితో చెప్పగా చాటుగా నేను విన్నకథ. నాటకాలలో బాగా పేరు తెచ్చుకున్న ఒక బెంగాలీ మనిషికి ఒక ఊళ్ళో సన్మానం ఏర్పాటుచేశారు. చిన్ననటులూ, కాస్త పెద్దవేషాలు వేస్తున్న వాళ్ళూ, పేరులోకి వస్తున్న వాళ్లూ వీళ్లంతా ఆ సన్మాన సంఘసభ్యులు. పెద్ద నటుడని ఊరేగించారు. బహిరంగ సభలో నిలబెట్టి మాట్లాడించారు. పత్రాలు చదివారు. దండలు వేశారు. పదిమందీ ఒకరకంగానే పొగిడారు. రాత్రి పెద్దవిందు. ఆ విందుకు వీళ్ళంతా వచ్చారు. అసలు విషయం అక్కడ బయటపెట్టారు. "అబ్బాయ్, పెద్దనటుడూ -- నువ్వు బాగా ఆర్జించేస్తున్నావు. పేరు తెచ్చేసుకుంటున్నావు. ఆ పన్లు ఇంక నువ్వాపాలి. మాకు ఛాన్సులు రావటం లేదు. అందరికీ నువ్వే దేవుడవయ్యావు. నువ్వు నటించటమన్నా మానుకో -- లేదా మా చేతుల్లోనన్నా చావు". అన్నారు.




'మనసు తెలుసుకో'

పెద్దనటుడు రవంతేనా భయపడక, "నటనకు ఉద్వాసన చెప్పటం కంటే, మీ చేతుల్లో చావటం మేలు" అన్నాడు.

"ఐతే విషపు గ్లాసు తీసుకురండి" అన్నారు వాళ్ళు. అందరికీ పాలు తీసుకొచ్చారు. విషం కలిపిన పాలు పెద్ద నటుడికిచ్చారు తాగమని. "అబ్బాయ్‌లూ, ఇది నిజంగా విషం కలిపిన పాలేనా?! ఆ సంగతి మీకు బాగా తెలుసునా? అసలెవరయినా రుచిచూచి నాకివ్వ రాదూ!" అన్నాడు.

"నువ్వే చూసుకో!" అని నవ్వారు వాళ్ళంతా.

"మీరంతా తాగరూ?" అని అడిగాడు.

"తర్వాత తాగుతాం -- నీ చావు చూసి".

టేబులునిండా వాళ్ళ గ్లాసులున్నాయి. పెద్దనటుడి గ్లాసు అతని చేతిలో వుంది. అతను ఇట్లా చెప్పటం ప్రారంభించాడు.: "నా జీవితం అంతా నటనకే అంకితం చేసుకున్నాను. భగవంతుని కృపవల్ల మంచి పేరు తెచ్చుకున్నాను" అని ఆగి, 'ఎవరిది?'' అని పైకి చూశాడు. అందరూ పైకి చూశారు -- ఒక్కసారిగా, పెద్దనటుడు వెంటనే తన గ్లాసు ఆ గ్లాసుల మధ్య పెట్టేసి, మరోగ్లాసు తీసుకున్నాడు. ఈ సంగతి ఎవరికీ తెలీదు. 'భగవంతుడు నన్ను ఆశీర్వదిస్తున్నాడు...." అన్నాడు పైకి చూస్తూ. "నాలాగే వీళ్ళందరినీ కూడా పెద్ద నటుల్ని చెయ్యి" అని గ్లాసు నోట పెట్టుకుని, నిదానంగా పాలు త్రాగి, ప్రాణం విడిచేముందు కొట్టుకున్నట్టు కొట్టుకుని, కుర్చీలో పడిపోయాడు. "చచ్చాడ్రా" అన్నారంతా.

"తీసుకెళ్ళి వాళ్ళింట్లో పారేయండి" అన్నారు. కొందరు అతన్ని మోసుకుని వెళ్ళి కార్లో పడేశారు. కారు వాళ్ళ ఇంటికి జేరింది. అతన్ని గుమ్మంలో పడేసి వాళ్ళు తిరిగి వెళ్ళిపోయారు. ఆ వెంటనే ఆ పెద్దనటుడు లేచి, పోలీసువాళ్ళకు ఫోనిచ్చి -- వాళ్ళను రావించి -- వీళ్ళను పట్టించాడు. దీని నీతి ఏమన పరులకు హాని చేయగోరువారు తామే చెడిపోవుదురు. అందువలన ఓలలనా -- సారీ, మగవార్లూ -- నన్నేమన్నా చెయ్యబోతే మీకే ఎదురు తిరుగుతుంది." అన్నాడు రత్న.



"ఊరికేనండి మీరు బలేవారే! చిన్న సస్పెన్సు .... అంతే" అన్నాడు విశ్వాస్.

"ఐనా నేను సినిమా తియ్యను" అన్నాడు రత్నా.

"చాలు పోదురూ బోడిబడాయి. మీరూ మీ హాస్యాలూ, కట్టి పెడుదురూ, ఊరికే" అన్నాను నేను.

"హాస్యం కాదోయ్ సత్యం. హాస్యం ఆడదానికి నేనేం బావమరిదినా, కనీసం కన్న తండ్రినా".

"ఐతే మీరు తియ్యరా?" అన్నాము ఇద్దరమూ యుగళ గీతంలా.

"తీస్తాను కాని.... నా... ప్రేమదేవత భాగ్యరాశి, ఆరాధ్య దైవం... వెన్నెల పులుగు.... కన్నుల పంట... ఈడూ... జోడూ.... కోయిల, కాకి, పురుగు..." అంటూ వర్ణించుకుపోసాగాడు రత్నా.

"ఆపండి రత్నగారూ -- అర్థమైంది. ఆమెను మీకు కట్టబెట్టే ఏర్పాటు మాది. ముహూర్తం వచ్చేదాకానన్నా ఆగండి." అన్నాను.

"తారా.... ప్రేమసితారా.... నీ కోసమయిన సినిమా తీస్తాను. వీళ్ళకోసం కాకపోయినా నాకోసం కాకపోయినా, అని! 'ఏమంటారు?' అన్నాడు మామూలు ధోరణిలో.

"ఏమీ అనం, చప్పున తీయించండి"

"మరికథో?.... చూడండి... కథ నిండా పాటలూ, మాటలూ, డాన్సులూ, డాన్సుప్లాట్సు, మ్యూజిక్కూ ఇవన్నీ ఉండాలి. సినిమా అంతా నాదారే ఉండాలి. రేప్పొద్దున్నేరండే. కథరాసి వుంచుతా" అన్నాడు మేమిద్దరం లేచి బయట పడ్డాం.

"వీడు సినిమా తియ్యడు. నాది పూచీ" అన్నాను.

'నీ మొహం, ఊరుకోవయ్యా -- వాడే తీస్తాడు' అన్నాడు విశ్వాస్.

పొద్దున్నే లేచివెళ్ళి 'గుడ్‌మార్నింగ్" అన్నాం.

"వచ్చారా. రండీ... ఇదిగో కథ" అని పాతిక కాయితాలు ముందు పారేసీ, బాతురూముకు పోయాడు. విశ్వాస్ కథ అంతా చదివి -- "భలేఘటం... తెలివైన వాడే. ఎటొచ్చీ తారాపిచ్చి. మంచి కథే రాశేడు. కొంపదీసి హిట్టయేట్టుంది"! అన్నాడు.

"రత్నాగారు తెలివైన వారు కాదని ఎవరన్నారు?" అన్నాను నేను వస్తున్న రత్నాను చూసి.

"ఏం గురువులూ, ఎట్లా వుంది కథ?" అన్నాడు రత్నా.

"మోత . ఐదేసి వందరోజులు ఆడాలి".

"తారను బుక్ చేసి, షూటింగ్ చెయ్యండి డబ్బులిస్తాను" అంటూ రత్నా లేచాడు.

ఇక్కడ స్టోరీని కాస్త 'స్కిప్' చేస్తాను లేదా డిసాల్వ్ చేస్తాను.

ఎంచేతంటే, ఎండింగ్ వచ్చేస్తోంది కదూ -- డిటెయిల్స్ తగ్గాలి" అన్నాడు మహాశయుడు.

"తొందరగా కానీండి. బరువైన సీను వెనక ఆస్పెంలా ఇదో గోల" అన్నాడు కుమారరత్నం.

"సినిమా తయారైంది -- నేనే డైరెక్టు చేశాను. అంటే నా పేరు వేశారు. అంతా వాళ్లే చేశారు. 'వాళ్లే' ఎవరూ-- ఆమే -- తారామణే, ఆమె ఆడించినట్టల్లా రత్నా ఆడాడు -- రత్నా ఆటకు విశ్వాస్ తాళం వేశాడు. నేను తలూపాను. అయినా నా పేరు పాడవుతుంది ఒద్దన్నాను.

'నీ తలకాయ -- ఫస్టు పిక్చరు ఫ్లాప్ కాక ఇంకేమవుతుంది -- చెయ్యనీ' అని విశ్వాస్ నా

పేరు వేయించాడు. ఆ చిత్రరాజం విడుదలయిన రెండో రోజున ఒక ఊళ్ళో తెర చింపారు -- ఇంకో ఊళ్ళో థియేటరు వాళ్లను తంతామన్నారు. మొత్తానికి త్రిదినోత్సవం సల్పుకున్న చిత్రం అది. మీరు తెలుసుకోవలసిన నీతులు చాలా ఉన్నై, ముఖ్యమైనది -- తార మోహంలోపడి, కథ మీరే రాయరాదు" అన్నాడు మహాశయుడు.

"ఐతే, ఇంతకూ రత్నాకు తారదక్కిందా? వారిద్దరికీ వివాహం ఐందా? రత్నా ఏమవుతాడు?" అని ప్రశ్నించాడు ధనవంతుడు.

"తార చిత్రం పూర్తి చేసి తన డబ్బు చక్కా తీసుకుని గోవిందామని ఆఖరికి ప్రొడక్షన్ అతన్నిపెళ్లి చేసుకుంది.రత్నా పిచ్చెత్తుతా డనుకున్నాం. కాని ఎత్తలేదు -- 'దంపినమ్మకు బొక్కిందే కూలి' అని ఖర్చుకాగా మిగిలిన డబ్బులు పెట్టి సైకిలు షాపు పెట్టుకున్నాడు. చిత్రం పూర్తయ్యేసరికి -- ఒక డొక్కుకారూ, అక్షరాలు రాలిపోయిన కంపెనీ బోర్డూ -- ఒక డొక్కు కుర్చీ -- మిగిలాయి. వీటితోపాటు కొందరు మనుషుల్తో పరిచయం. ఖాళీ ఫిల్ము డబ్బాలో రెండూ, తార మరిచి పోయిన చిత్రం లోని చీరా -- అప్పులు చేసే విధానమూ, అప్పు లాళ్లను తిప్పే విధానమూ, లేనిదానికి కొంత ఫోజూ, సినిమా పాటల పుస్తకం ఒకటీ -- ఆర్నెల్ల అప్పూ మొదలైనవి లాభించాయి. ఈ లాభములనే 'చిత్రలాభము'లని ఊపిరి పీల్చాడు మహాశయుడు.

ధనవంతుడు కాఫీ తెప్పించాడు, కుమార రత్నం తండ్రిచాటున సిగరెట్టు కాల్చడానికని, మంచినీళ్ళ మిషతో బయటకు వెళ్ళాడు.

మహాశయుడు మంచి నీళ్లు పుచ్చుకున్నాడు - ధనవంతుడు. కుమారరత్నం ఉప్పునీళ్లయినా పుచ్చుకోలేదు.

"మంచితీర్థం పుచ్చుకోరూ ?" అన్నాడు మహాశయుడు.

"నో, థాంక్స్"అన్నాడు కుమారరత్నం.

"థాంక్స్" అన్నాడు మహాశయుడు.

"తర్వాతేముంది ? అతనేమయాడు? నువ్వూ, అదెవరో ఆ విశ్వనాథం కలుసుకున్నారా ? ఆ సినిమా మాఊరు రాలేదా ? ఆ మిగిలిన వస్తువులను రత్నా ఏం చేస్తున్నాడు ?" అని గుక్కతిప్పుకోకుండా అడిగాడు ధనవంత్. మహాశయుడు నవ్వి- "ఇవన్నీ మీరు వెండితెరల మీద చూచి ఆనందించవలసినవే, వెండితెరలు ఎక్కడా లేవుకాబట్టి, గుడ్డతెరమీదయినా చూసి తీరాల్సిందే. వెండితెరంటే జ్ఞాపకం వచ్చింది - వొద్దులెండి. మీరు నన్నేమన్నా డైరక్టరుగా తీసుకోవాలా, రావాలా ? "అన్నాడు దిగులుగా.

"చెప్పవయ్యా చూద్దాం" అన్నాడు ధన వంతుడు.

"ఏమిటి చూసేది, సినిమా ! ఐతే, ఇప్పుడు మీరు చిత్రలాభము విన్నారు. అట్లాగే చిత్రభేదం అనే మరొకభాగం చెబుతాను. సావధానంగా ఆలకింతురు గాక !" అని మహాశయుడు ఆరంభించాడు.

## చిత్రభేదము

"తర్వాత నేనుపడ్డ అవస్థలన్నీ ఇన్నీ అన్నీ కాదు. సినిమాలో తప్పిపోయిన పుత్రునికోసం ఆ తల్లి నా అంత కష్టపడివుండదు. విడిచి పెట్టేసిన తన భర్త కోసం ఆ భార్య నా అంత అవస్థపడి వుండదు. మాంత్రికుడెత్తుకుపోయిన రాజకుమారి, నా అంత దుర్భర పరిస్థితులు అనుభవించి ఉండదు. సరేగానీండి - రిలీఫ్‌కోసం చిన్న హాస్యం చెప్తాను వినండి. ఒకసారేం జరిగిందంటే, నేను ఒక షూటింగు చూడటానికి వెళ్ళాను. ఊరికే అక్కడెవరితోనో పనివుండి వెళ్ళేసరికి షూటింగ్ జరుగుతోంది. ఒక వయస్సు మళ్ళినాయన, ఏం జరిగిందో మరి, ట్రైట్‌క్లోజులో హెవీడైలాగు చెప్తూ ఏడుస్తున్నాడు ఆ డైలాగులున్నాయండీ - వెరీ హెవీ! ఎంతమంది కూలీలను తీసుకొచ్చి మోయమన్నా మొయ్యలేరన్నమాట ! అటువంటిది. ఆ ఒక్కడూ ఏం మోస్తాడు చెప్పండి. సరే, షాట్ ఐపోయింది. 'బ్రహ్మండం,ప్రపంచం, లోకం, ఉలగం' అన్నారంతా. నాకో విట్టు తట్టింది. ఆ డైరెక్టరును పక్కకు పిలిచి, చెవిలో విట్టుచెప్పా! ఏమిటంటే - అతను అంతబాగా ఏడిశాడు అంటే కారణం, యాక్టింగ్‌కాదు -- ఆ డైలాగులు మొయ్యలేక. అంచేత, ఏడుపు రావాలంటే ఇకమీదట గ్లిజరిన్‌లు అనవసరం - అటువంటి బరువు డైలాగులేచాలు." అన్నాను. నిజానికి అతనికి నవ్వొచ్చింది. కాని నవ్వితేఎట్లా ? నా జోకుకు నవ్వితే నామోషి అందుకని నవ్వకుండా, 'ఏడిశావులే' అని గావును ఏదో ఏడిశాడు. ఎట్లా వుందంటారు మన విట్టు ?.... నవ్వరేం...సరే - మీకు జోకు అర్థం కాలేదు, లేకపోతే బాగు లేదంటారా? ఐతే కామెడీ దెబ్బతిన్నదన్న మాటే...సరే, అసలు స్టోరీకి వద్దాం, ఏం చెబుతున్నానూ - నా శాడ్‌సాంగ్ సిట్యుయేషన్ను కదూ!

ఇహ అక్కడి నుంచి పాండీబజారు పట్టాను లెండి. పాండీ బజారంటే మీకు తెలీదు గావును- కూరలమ్మేది కూరల బజారు. చేపలమ్మేది చేపల బజారులాగ పాండీలమ్మేది పాండీబజారు కాదు. అది దాని పేరు, అసలు సినిమాల్లోకి జేరాలని మద్రాసు వచ్చిన వాళ్లంతా ముందుగా ఈ బజార్లోని చెట్ల క్రింద జేరతారు. నాకు చాలా మంది చెప్పారు-అట్లా చేరకుండా ఎవరూ పెద్దనటులు కాలేరుట! అటువంటి మహత్తరమైన సెంటిమెంటుగల బజారు! ఈ బజారెప్పుడూ కలకల్లాడుతూ ఉంటుందని, ఇక్కడ వర్తకం బాగా సాగుతూందని చాలామందికి నమ్మకం. అక్కడికొచ్చే జనంలోని చాలామంది సినిమాల బాపతే !

అయిందా, ఈ బజారులో చేరినవాళ్లల్లో ఎవరైనా నటులైపోతే ఇహ బజారురారు. ఎంచేతంటే, వాళ్లకు టైము ఉండదు. పైగా - అక్కడి కొచ్చేవాళ్లను 'వీళ్ళకేంపని - పాండీబజార్లో దేకడమే' అని కూడ అంటారుట! పన్లకోసం వచ్చిన వాళ్లూ, పన్లులేనివాళ్లూ, అసలు కొందరు పన్లుండి - అంటే ఎవర్నినైనా కలుసుకోవాలంటే, సాధారణంగా ఇక్కడ దొరకవచ్చును అనే నమ్మకంతో - మరికొందరు పన్లుపోయినవాళ్లు - ఇట్లా వస్తూ వుంటారు. సరి - నేనూ అక్కడ జేరేవాడిని, చేరిన దగ్గర్నుంచీ 'వాడిలా, వీడిలా' అని బాతాఖానీ. 'వాడండీ డైరెక్టరూ' అని ఒకడంటే, 'వాడి మొహం' అని రెండో వాడు. ఎవరిష్టం వాళ్ళదనుకోండి.

అంతకు పూర్వం వేషాలకోసం నా చుట్టూ తిరిగిన వాళ్ళంతా నేను కనిపిస్తే 'బాక్‌షాట్' తీసుకోమంటున్నారు! కనీసం నాకో నమస్కారం పారేసినవాడు ఒక్కడూ కనిపించలేదు. ఓ సారి, ఒకడు గుడ్‌మార్నింగ్ కొట్టాడు. నేను గంపెడంత మొహం చేసుకొని తిరిగి సాల్యూట్ చేసి వాడి కేసి చూశాను- చూస్తే అది నాకు సాల్యూట్ చెయ్యటం కాదు - నుదురు గోక్కుంటున్నాడు! డబ్బులుంటే



ఏ హోటల్లోనో తినేవాడిని, లేకపోతే ఎవరింటికో పోయేవాడిని, ఏదీ లేకపోతే ప్రశస్తమైన కార్పొరేషన్ వాటర్ పుచ్చుకొనేవాడిని. సాధారణంగా రాత్రులు ఆరుబయట నిద్రపోయేవాడిని. ఎందుకంటే, బాహాటంగా బాగా గాలి రావాలని! అదేగా మరి మన భోజనం! సాయంత్రం పూట పార్కులో కూచునే వాడిని. ప్రతి పిక్చరూ ఫ్లాప్ కథలనే యనుకునే వాడిని. ఎవడో కనిపించి-'ఫలానా పిక్చరు బ్రహ్మాండం సుమా' అనంటే 'ఏడిసింది. పోదు... ఏవరేజ్‌ట' అనేవాడిని.

"లేదు భాయ్-టాప్ కలెక్షన్సుట... రికార్డులు బ్రేకులట" అని అతను అనేవాడు.

"నేనొకటి చెబుతా విను. ఇదంతా ఆరంభ శూరత్వం. ఏది...ఇదినాలోవారమేగా- ఆగుఎంత వరకూ నిలబడుతుందోచూడు," అనేవాడిని.

"లేదు-హిట్టేట-వందరోజులూ గ్యారంటీట".

"లాగుతార్లే-దానికేం."

"లేదయ్యా-థియేటరువాళ్ళు అంతవరకు మరో పిక్చర్ వేసుకోం," అని చెబుతున్నారుట."

"అబ్బాయ్ - నేనోటి చెబుతావిను. ఏదో ఒకటి ఉండాలి! ఏదో... చూడ్డానికి నలుగురు తారలు కనిపిస్తున్నారు-నాలుగు డ్యాన్సులు, నాలుగు పాటలూ బాగున్నాయి. ఏదో నలుగురూ చూస్తున్నారు ఇదో సక్సెసా?"

ఇట్లా మాట్లాడేవాడిని. అంతేకాని ఒప్పుకునే వాడి కాదు.

ఒక సాయంత్రం పార్కు బెంచీమీద కూచున్నాను ఎవరో వచ్చి 'నమస్కారం డైరెక్టరుగారూ' అన్నాడు నాకు ప్రాణం లేచి వచ్చింది. ఎన్నాళ్ళకు విన్నానీ మాట! నవ్వుతూ 'నమస్కారం' అన్నాను. నా ప్రక్కన కూచోపెట్టుకుందాం అనిపించి, అంతలోనే డైరెక్టరు పోజుకొట్టి అతని వేపు చూసాను. నన్ను డిస్టర్బ్ చెయ్యకన్నట్టు. "నన్ను మీరెరగరు, అంటే ఎరుగుదురులెండి. నా పేరు ఫలానా. నేను, మీరు పిక్చరుతీస్తున్న రోజుల్లో మీ చుట్టూ తొంభై ఆరుసార్లు తిరిగాను. నేను తిరగటంకాదు - మీరే తిప్పారు. చివరకు వేషం ఇవ్వనేలేదు. పైగా 'నెక్ట్సపిక్చర్లో ఇస్తాలేవయ్యా' అని కసిరారు" అన్నాడతను.

"ఐతే ఇప్పుడు నన్ను ఖూనీచేస్తావా ఏమిటి ?" అన్నాను నేను భయపడి .

"నేను ఖూనీచెయ్యనులెండి నాకు వేరే పనుంది, చెప్పొచ్చేదేమిటంటే మీకు నెక్ట్స్ పిక్చరు వస్తుందేమోనని రోజూ ఎదురు చూస్తున్నాను. ప్రతి దేవుడికి మొక్కుతున్నాను మీ దుంపతెగా ఇంత వరకూ మీకు రావటమేలేదు. కాని ఇవాళ దేవుడు నాపై కనికరించాడు. ఏమిటంటే మాఊరి నుంచి ఒకడబ్బున్న ఆసామి దిగాడు. 'సినిమా తియ్యాలంటే ఎటుపోవాలి?' అని నన్ను అడిగాడు. మాటా, మాటావచ్చాక తెలిసింది మాఊరేనని అన్నాడతను. అతను సినిమా తీస్తానంటున్నాడు. జేబులో చిల్లరడబ్బులు బాగా కనిపించాయి లెండి. "పేరుండక్కర్లేదు - తెలిస్తే చాలు - డైరెక్టరన్నాకావాలి"అన్నాడు. ఇంకేం మీరున్నారు అనుకున్నాను. అంచేత మీరు అక్కడ ట్రై చెయ్యండి-



ప్రముఖ హాస్య నటుడు, నిర్మాత, దర్శకుడు శ్రీ పద్మనాభం రాసుకున్న ఆత్మకథ వచ్చే సంచిక నుండి 'హాసం' పాఠకుల కోసం ధారావాహికంగా....

ఐతే నేను చెప్పానని మాత్రం చెప్పకండి. సమయం వస్తే నేనూ ఓ మాట వేస్తాననుకోండీ! హాస్యం కాదు. కొంపదీసి మీకు డైరెక్షన్ ఛాన్స్ తగిలిందా, నాకు వేషం గ్యారంటీ. ఏమంటారు?" అన్నాడు ఫలానా.

నాకు ఆశకలిగింది. నా ప్రక్కనే కూచోమని ఫలానాకు చోటిచ్చాను.

'రేపు ఉదయం నేనొచ్చి తీసుకెళ్ళి ఇల్లు చూపిస్తాను మీరెక్కడుంటారు?" అని అడిగాడు. నేను ఆలోచిస్తూ ఉంటే అతనే అన్నాడు.

"ఓపని చెయ్యండి - పాండీ బజార్లోనే ఇట్నుంచి లెక్కట్టుకుంటూ వెళ్ళి పదకొండో నెంబరు చెట్టుకింద నుంచోండి. పదకొండు నా లక్కీ నంబరు. నేనొచ్చి పికప్ చేస్తాను - అదే. నడకకే లెండి."

"సరే"అన్నాను.

అతను వెళ్ళిపోయాడు. నాకు అనుమానం వేసింది. ఒకసారి అనుభవం అయింది. చాలదా అనుకున్నాను, వీడు కూడా అటువంటివాడే పొగైతే? మరో ఫ్లాప్ పిక్చర్ తియ్యాలి. పిక్చర్ దెబ్బతిన్నదంటే నానుంచే అని అందరూ అంటారు గాని, అసలు సంగతి ఎవరూ ఆలోచించరు. ఏమో, ఒకవేళ నిజమేనేమో. దేవుడు మేలుచేస్తే ఈ చిత్రం హిట్టవరాదా?-సరే. చేతికొచ్చిన ఛాన్సు జారవిడవడం ఎందుకు అనుకున్నాను.

నా సామాన్లు ఒకరింట ఉన్నాయి. నా జోళ్ళు మరొకరింట - నా పడక ఇంకోరి అరుగుమీద, ఒక అడ్రసంటూలేదు. సరే, పొద్దున్న వీడెవడో మళ్ళీ ఇక్కడికి రమ్మంటున్నాడు. ఇప్పుడు పడక కోసం పోలేమని అంతదూరం ఎందుకు పోవటం? పోయి పొద్దున్నే లేచి మళ్ళీ పోలేమని ఇక్కడికే రావాలి, అంచాత, ఈ రాత్రికి ఈపార్కు బెంచిలోనే మకాంచేద్దాం అనుకున్నాను.

అనుకున్నానో లేదో ఆకలి వేసింది. జేబులో చిల్లుకానీ లేదు. జేబులో చిల్లుకానీ లేదు. ఐనా ఎందుకేనా మంచిది చూద్దాం అని జేబులో చెయ్యిపెట్టాను. ఒక చిల్లుకానీ దొరికింది! ఈ రాత్రి భోంచెయ్యాలంటే కనీసం పదణాలుండాలి. లేదా టీ తాగటానికి బేడేనా ఉండాలి. ఏం చెయ్యటానికి పాలుపోలేదు. నా కెదురుగా ఓ రూపాయినోటు కనిపించింది. నేలమీద చట్టున లేచివెళ్ళి తీసాను. **(-ఇంకా వుంది)**





# రాంపండు లీలలు

## రాంపండూ - ప్రకృతి ఆహారమూ

**"అచలపతీ, పద మైలారం వెళ్లాలి. ఈ రాంపండు గాడికి మళ్లీ ఏదో ముప్పు వచ్చిందట."**

**"అంటే వీణాపాణి గారితో పెళ్లి జరిగే అవకాశాలు మళ్లీ సన్నగిల్లాయంటారా?"**

**"అబ్బే, అదేం కాదులే. వాడి పాలిట వీణాపాణి ఫ్రెండు లావణ్య అనే ఓ అమ్మాయి వాడి పాలిట దాపురించి ప్రాణం తీస్తోందట... రేదర్ తీయిస్తోందట. వెళ్తేనే పూర్తి వివరాలు తెలుస్తాయి" అన్నాడు అనంత్.**

అనంత్ బస చేసిన హోటల్‌కి వచ్చి రాంపండు భోరుమన్నాడు. వాడు ప్రస్తుతం వీణాపాణి ఇంట్లో పేయింగ్ గెస్టుగా ఉన్నాడట. ఏదో ఒకలా నెట్టుకొస్తూండగా వీణాపాణి క్లాసు మేట్ లావణ్య గెస్టుగా వచ్చి తల తినేస్తోందట.

"ఎవరిది? నీదా? అయితే ఆవిడకి తినడానికి పెద్దేం దొరకదులే!"

"ఒరే కుళ్లు జోకులేయకు. అసలే ఆకలేసి రంకెలేస్తున్నాను. ఇలాటి జోకులేస్తే రక్కుతాను జాగ్రత్త" అన్నాడు రాంపండు ఆక్రోశంతో.

"ఏం? మీ పేయింగ్ హోస్టుగారు సరిగ్గా అన్నం పెట్టరా?"

"పాపం పెట్టేదిరా. ఇదిగో ఈ లావణ్య వచ్చి మొత్తమంతా చెడగొట్టేసింది. అసలు తిండితినే విధానం ఇది కాదంటూ మొదలెట్టింది. పిండి పదార్థాలుట, కొవ్వు పదార్థాలుట. అరిగేవిట, అరగనివట - ఒకటి కాదనుకో, పది రకాల ఆంక్షలు. ప్రకృతిలో ఏ రూపంలో ఎలా దొరుకుతాయో, అలాగే తినాలిట. వండకూడదట."

"బాబోయ్. అంటే కోడిని అలాగే తినేయాలా? అది ఒప్పుకుంటుందా? అరిచి గోల చేయదూ?" సందేహించాడు అనంత్.




"చాల్లే. కోడిట, కోడి. కోడి కాదు పకోడి కూడా తినడానికి లేదు. ఆయిల్‌లో డీప్ ఫ్రై చేసినది తినకూడదట. కొలెస్టరాలో, మరోటో ఎక్కువయి పోతుందిట."

"అంటే శుద్ధ శాకాహారమా?"

"పరమ శాకాహారం. ఆహారం ఏమిట్లే, మన హాహాకారమే అనుకో. లావణ్య ముఖ్యంగా నన్ను టార్గెట్ చేసింది. నేను తిండిపోతునట, ఎక్కువ తింటానట, తినకూడనది తింటానట. తినకూడని విధంగా తింటానట... ఒకటి కాదనుకో..." అని వాపోయాడు రాంపండు.

అనంత్‌కి జాలివేసింది. రాంపండు తిండి విషయంలో భీంపండు అన్నమాట నిజమే కానీ, బొత్తిగా ఇలా వాడి కడుపుకొట్టడం అన్యాయం అనిపించింది. బొత్తిగా వేర్లూ, దుంపలు తిని బతకమంటే ఈ బకాసురుడు బతకాలా? చావాలా? అసలు వీణాపాణి ఎందుకు ఊరుకుంటోంది? అదే అడిగాడు రాంపండుని.

"అదేరా నాకూ అర్థం కాదు. ఆ లావణ్య ఏం చెబితే అది వేదం తనకి. కుక్కను చూపించి పంది అనమంటే వరాహం అనే రకం. ఎంత క్లాసుమేటు అయినా అంత ఆరాధనా? ఆ మాటకొస్తే మనమూ క్లాసుమేట్సమే. నువ్వేమైనా మేధావివి నేను అనుకుంటున్నానా?"

"అనుకోవా!?"

"నువ్వు మాట్లాడిన ప్రతీ మాట ఆణిముత్యమని భ్రమపడతానా?"

"పడవా!?"

"... కానీ ఈ వీణాపాణి ఉందే, లావణ్య అంటే నడిచే విజ్ఞాన సర్వస్వం అని అభిప్రాయం పెట్టేసుకుని కూర్చుంది. తను చెప్పిన దగ్గర్నుంచి కనబడ్డ ప్రతీ కూరగాయనీ శంకిస్తోంది. దీనిలో ఏ దోషగుణం ఉందోనని! ప్రతీదాన్నీ కేలరీల్లోనే తూచి తోసిపారేస్తోంది. ఈ లావణ్య వచ్చిన పదిహేను రోజుల్లోనే జీవితం నరకం చేసేసిందనుకో!" రాంపండు గొల్లుమన్నాడు.

"ఇన్ని బాధలు పడుతూ నువ్వు వాళ్లింట్లో పేయింగ్ గెస్టుగా

ఉండడం ఎందుకురా? హాయిగా బయట రూమ్ తీసుకుని ఉండు'' అని అనంత్ ఓదార్చబోయాడు.



“ఆపాటి తెలివితేటలు నాకు లేవనుకోకు. ఇప్పటికే రెండు మూడుసార్లు మేం ఇద్దరం పోట్లాడుకోవడం, నేను ఊరొదిలి వెళ్లిపోవడంతో వీణాపాణికి డౌటు వచ్చేసింది. మా ఇద్దరికీ పొసుగుతుందా లేదానని, అందువల్లనే ఈ పేయింగ్‌గెస్టు ఏర్పాటు. పెళ్లికి ముందు ప్రొబేషనరీ పీరియడ్‌లాటిదనుకో ఈ వ్యవహారం! నాలో ఏ లోపం కనబడినా గుడ్‌బై చెప్పేస్తుందన్నమాట! అందుకే ఎలాగోలా సర్దుకుందామని చూస్తున్నాను.”

“అయితే సద్దుకో. నన్ను రమ్మని చంపడం దేనికి?” అనంత్ చికాకు పడ్డాడు.

“అలా విసుక్కోకురా. ఓ నెల్లాళ్లకో, రెణ్నెళ్లకో అయితే సర్దుకుందును. ఈ లావణ్య సంగతి చూస్తూ ఉంటే పెళ్లి మాట తలపెట్టడం లేదు. పెళ్లి చేసుకోవడం ప్రకృతి సహజం కాదంటుందేమోనని నా భయం. ఒకవేళ దీని సంగతి తెలియక ఎవడైనా పెళ్లి చేసుకున్నా నాలుగు రోజుల్లో సన్యాసుల్లో కలిసిపోవడం ఖాయం. అందువల్ల ఆవిడ మా ఇంట్లో పెర్మనెంట్‌గా సెటిలయిపోవడం తప్పదని నా అంచనా. అసలిప్పటికే వీణాపాణి అంటోంది - మనం ఇల్లు కట్టుకున్నప్పుడు లావణ్యకని సెపరేట్‌గా రూమ్ కట్టాలండి'' అని.”

“చచ్చావ్ పో”.

“అందుకే నాకేదైనా మృతసంజీవని అమర్చి పెట్టమని అచలపతినడుగు. అందుకే నిన్ను పిలిచాను''.

అనంత్ అచలపతి కేసి చూశాడు కానీ అచలపతి పెదవి విరిచేశాడు. రాంపండు బెంబేలు పడ్డాడు. 'అచలపతీ, కంగారేమీ లేదు. పరిస్థితి జాగ్రత్తగా స్టడీ చేసాకనే మంచి ఐడియా చెప్పు. ఇన్నాళ్లు ఓర్చుకున్నవాణ్ని, ఇంకో వారం ఓర్చుకుంటానులే. అంతేగానీ నన్ను తిండిమాలిన వాణ్ని చేయకు'' అని బతిమాలాడు.

ఆవేళ రాత్రి వీణాపాణి ఇంట్లోనే భోజనం. దాన్ని భోజనం అనడానికి అనంత్‌కి మనసు ఒప్పలేదు. పచ్చి కాబేజీ ఆకులు, పసుపునీళ్లలో పచ్చి బఠానీలు, చితక్కొట్టిన వేర్లూ ఇవన్నీ కలిపితే లంచ్‌కానీ, డిన్నర్‌కానీ అవదని అతని అభిప్రాయం. రోజూ అంతేట. అంతేకాదు లావణ్య గురించి రాంపండు చెప్పినది అక్షరాలా నిజం. లావణ్య దృష్టిలో రాంపండు ఓ తిండిపోతు రామన్న. మొరటుమనిషి. నోట్లో పెట్టుకున్నది ఎలా నమలాలో కూడా తెలియని శుంఠ. రోజుకు పదిసార్లు ఈ మాటలు వింటే అర్జునుడికి కూడా కృష్ణుడి సారథ్యం మీద అపనమ్మకం కలిగేది. ఇక వీణాపాణి అనగా ఎంత? ఆమె దృష్టిలో రాంపండు నానాటికీ దిగజారిపోయినట్టు స్పష్టంగా కనబడుతోంది. పెళ్లి అయిన తర్వాత భర్తను మార్చగలనని అందరూ ఆడపిల్లలు దురభిప్రాయ పడినట్లే ఆమె కూడా దురభిప్రాయ పడడం వల్ల ఎంగేజ్‌మెంట్ కాన్సిల్ చేయకుండా ఊరుకుందని అనంత్ అభిప్రాయం.

రెండు మూడు రోజుల్లోనే వారందరూ ఒక తిరనాళ్లకు వెళ్లే సందర్భం పడింది. కార్లో మూడు గంటల ప్రయాణం. పొద్దున్న బయలుదేరుతూండగా రాంపండు వచ్చి గుసగుసలాడేడు - “బ్రహ్మాండమైన లంచ్ ఏర్పాటు చేసానులే. వెళ్లేదాకా లంచ్ బాస్కెట్ తెరిచి చూడకు. వాసన బయటకు వస్తే ఆ లావణ్య పసిగట్టేస్తుంది.'

“ఏం? చికెన్, ఫిష్ గట్రా ఉన్నాయా?”

“బ్రహ్మాండంగా. ఇది వద్దంటే తిరనాళ్లలో తినడానికి ఏమీ దొరకదుగా. ఉలవలూ, వేర్లూ, మూలికలు పెట్టమంటే అక్కడ హోటల్‌వాడు పిచ్చాసుపత్రికి అప్పగిస్తాడు. అందరూ గతిలేక ఇది తినాల్సిందే! ఎలా వుంది ఐడియా?”

ఐడియావరకు బాగానే వుంది. కానీ వాళ్లు అడంగుచేరి తినబోయేసరికి

ఆ బాస్కెట్ కనబడలేదు. "పెట్టడం మర్చిపోయానేమో' అని గొణిగాడు రాంపండు. "పోన్లెండి. అదీ మంచిదే. ఓ పూట ఉపవాసం ఉంటే కడుపుకి చాలా మంచిది" అంది వీణాపాణి. అనంత్ కొరకొరా చూసాడు ఆమెకేసి. కాబోయే మొగుడి కడుపు కాలుతుంటే అనాల్సిన మాటలివేనా అని, బ్రహ్మ సృష్టిలో ఇంతకంటె దారుణమైన వాళ్లుంటారా అన్న అనుమానం వచ్చిందతనికి. అంతలోనే సందేహం తీరిపోయింది.

"ఉపవాసం అనేది శరీరాన్ని క్షాళన చేస్తుంది. రక్తాన్ని శుద్ధి చేస్తుంది. ఉపవాసం ఉన్న రోజు ధ్యానం, ప్రార్థనలో గడిపితే శరీరంతోబాటు మనసు కూడా కడగబడి, మకిలి తుడిచి వేయబడుతుంది. రాంపండు గారూ, ఇది మీకు అనుకోకుండా వచ్చిన అవకాశం. లంచ్ లేదుకదాని తిరనాళ్లలో జీళ్లు గట్రా తినకుండా, చుట్టూ పల్లెపడుచుల్ని చూడకుండా మనస్సు దేవుడి మీద లగ్నం చేసి..." లావణ్య ఉపవాసం ఎంతసేపు సాగేదో కానీ అచలపతి బస్సు దిగి వారి వద్దకు వచ్చాడు.



"సర్, ఒక చిన్నమాట" అని అనంత్‌ను పక్కకు పిలిచి "లంచ్‌బాస్కెట్ కారు డిక్కీలోంచి తీసేసింది నేనే సర్! మీకు కలిగిన అసౌకర్యానికి మన్నించ గోర్తున్నాను." అన్నాడు.

యజమానిని ఆకలితో మాడ్చి చంపే కార్యక్రమానికి ఆమోదముద్ర వేయలేక అనంత్ విలవిలలాడేడు. - "అదేం పనయ్యా, ప్రాణాలు పోయేట్టున్నాయి. ఇంకో గంటలో నాకు వేరేదైనా ఏర్పాటు చేయకపోతే నువ్వు వేరే యజమానిని వెతుక్కోవలసినదే".

"సర్, ఇవాళ పొద్దున్న రాంపండుగారు లంచ్‌ను వర్ణించే విధానం చూస్తే నలుగురి తిండి ఆయన ఒక్కడే కబళించేటట్టు కనబడ్డారు. లావణ్యాగారి ఎదురుగా అలా తింటే ఆవిడ నోరు మూసుకోదని, ఏవో కామెంట్స్ చేసి వీణాపాణిగారి మనసు విరిచేస్తుందని అనిపించింది. రాంపండుగారి వైవాహిక భవిష్యత్తు దృష్ట్యా మీరీ త్యాగం...."

అనంత్ ఏకీభవించక తప్పింది కాదు. "యశోదకు బాలకృష్ణుడి నోట్లో భూగోళం కనబడ్డట్టు పొద్దున్న రాంపండు నోట్లో బకాసురుడి ఫోటో కనబడింది కానీ నేను పోల్చుకోలేక పోయాను. నువ్వు బాగానే గుర్తుపట్టావ్. కానీ నువ్వో పాయింట్ మిస్ చేస్తున్నావ్. ఆకలి ఎంతోమంది చేత ఎన్నో నేరాలు చేయిస్తుంది. మరి రాంపండు చేత ఏం చేయిస్తుందో! రాంపండు ఒక్కడే అన్నమాటేమిటి?

ఈ ఆడవాళ్లిద్దరూ కూడా మలమల మాడరూ? ఆకులూ, అలములైనా తినాలి కదా!"

"సర్, ఆడవాళ్ల విషయం నాకు బాగా తెలుసు. నేను ఇదివరకు పనిచేసిన ఇంట్లో యజమానురాలు వేళకు భోజనం లేటయినా ఏమీ అనేది కాదు. కానీ మధ్యాహ్నం నిద్రలేచేసరికి కాఫీ లేకపోతే మాత్రం దుంప తెంపేసేది. మనిషి మనిషిలా ఉండేది కాదు. ఆ సూత్రం మీదనే ఇవాళ ప్రోగ్రాం ప్లాను చేశాను. ఇంకో రెండు గంటల్లో వాళ్లు కార్లో బయలుదేరతారు. ఇంకా చూడవలసినవి ఉన్నాయంటూ మీరు వెనకనే దిగడిపోండి" అని చెప్పాడు అచలపతి.

రెండు గంటల తర్వాత ఆడవాళ్లని వెంట బెట్టుకుని రాంపండు కార్లో బయలుదేరాడు. తిరనాళ్లలో దుమ్మూ, ధూళీ, జనం తొక్కిడి, ఎండ వాళ్లని చికాకు పెట్టేశాయి. కబుర్లు చెప్పుకునే మూడ్ కూడా పోయి, బ్యాక్‌సీట్లో ఫ్రెండ్సిద్దరికీ కునుకు కూడా పట్టింది. అంతలో చిన్న జర్కుతో కారు ఆగింది. ముందుగా మేల్కొన్నది లావణ్య. కళ్లు తెరిచి చుట్టూ చూస్తే నిర్మానుష్యంగా ఉంది.

"కారెందుకు ఆపేరు?" అంది ధాటీగా...

తిరనాళ్లలో జీళ్లు తిననీయలేదనీ, ఆడవాళ్ల కేసి తలతిప్పనీయలేదని రాంపండు అసలే మహాచిరాకుగా ఉన్నాడు. "నేను ఆపలేదు. అదే ఆగింది." అన్నాడు దాన్ని దాచుకోకుండా.

"ఎందుకు?"

"ఎందుకో నాకేం తెలుసు? దాన్నే అడగండి. దాన్లో కూడా మూలికల పెట్రోలు పోసారేమో. నీరసించిపోయి ఆగిపోయినట్టుంది." అన్నాడు కసిగా.

"చేతకానివాళ్లు తగుదునమ్మా అని స్టీరింగు పట్టుకోకూడదు. మీరు దిగండి. నేను చూస్తాను' అంది లావణ్య విసవిసా కారు దిగివచ్చి.

అప్పుడే మెలకువ వచ్చిన వీణాపాణి ఆ మాటలకు నొచ్చుకుంది. 'ఏమిటి లావణ్యా? కారన్నాక ఏవో ట్రబుల్స్ వస్తూనే ఉంటాయి. ఏది నోటికొస్తే అది అనేయడమేనా?" అంది.

లావణ్య సమర్థించుకోబోయింది. "బావుంది. మధ్యాహ్నం నిద్రలేవగానే కాఫీ పడకపోతే నాకు మహాచిరాకు వస్తుంది. ఎక్కడా హోటల్ కూడా లేదు.

## జస్ట్ ఫర్ ఫన్

## మర్యాదస్థుల పిల్ల

అదో చిన్న ఊరు. అప్పుడే ఆగిన రైల్లోంచి ఓ అందమైన అమ్మాయి లగేజితో దిగింది. అప్పటికి టైము రాత్రి పదకొండు గంటలు దాటింది.

ఆమె అక్కడే పడుకొని నిద్రపోతున్న ఓ రైల్వే పోర్టర్‌ను నిద్రలేపింది.

"ఈ ఊళ్ళో ఏదైనా మంచి హోటలుందా!" అడిగిందామె పోర్టర్‌ను.

"లేదండి" అన్నాడు నిద్రమత్తులోనే పోర్టర్.

"పోనీ ఏదైనా రెస్టారెంట్ ఉందా!" అడిగిందామె.

"లేదండి" నిద్రలోనే జోగుతూ జవాబిచ్చాడా పోర్టర్.



"అరె! నేనీ రాత్రి ఎక్కడ గడపాలి అయితే" ఆందోళనగా అందామె.

"మీకు అభ్యంతరం లేకపోతే మా స్టేషన్ మాస్టర్‌తో కలిసి రూమ్‌లో పడుకోండి. ఏర్పాటు చేస్తాను" అన్నాడో పోర్టర్ హుషారుగా మత్తు వదల్చుకుని.

"ఏమిటి నీ ఉద్దేశం! నేను మర్యాదస్థుల యింటి ఆడపిల్లను తెలుసా?" అందామె కోపంగా.

"మా స్టేషన్ మాస్టర్ కూడా మర్యాదస్థుల యింటి ఆడపిల్లేనండి" అన్నాడు పోర్టర్ తాపీగా.

-కోనే నాగవెంకట ఆంజనేయులు, ఉక్కునగరం

పోయి, పోయి ఇక్కడ ఆపేడు మీ రాంపండు. పైగా మూలికల మీద జోకులొకటి!"

"ఆ మాటకొస్తే నా పరిస్థితీ అంతే. ఇప్పుడు అర్జంటుగా కాఫీ పడాలి. అంతమాత్రం చేత..." అంటూనే "బాబోయ్, ఇది హైవే కూడా కాదు. అసలు ఇటువైపు వెహికల్స్ ఏవీ వచ్చేట్టు లేవు. దగ్గర్లో ఇళ్లేమీ లేవు. ఇదేంటండీ పోయి, పోయి ఇక్కడ ఆ పేరు?" అంది లావణ్య అడుగుజాడల్లో నడిచే వీణాపాణి.

లావణ్య అరగంటసేపు కారులో రకరకాల వైర్లన్నీ పీకి చూసి ఫైనల్‌గా పెట్రోలు లేదని తేల్చింది. పోయించమని అచలపతికి చెప్పానే అంటాడు రాంపండు. పొద్దున్న లంచ్‌బాస్కెట్‌లాగానే ఇదీ మర్చిపోయుంటావ్ అంటుంది లావణ్య. వీణ్నికట్టుకుంటే నిన్ను నట్టడవిలో నీళ్లు లేకుండా చంపుతాడని వీణాపాణిని బెదిరించింది. వీణాపాణి ఎదురుతిరిగింది - పిల్లల్ని వెనకేసుకొచ్చే తల్లిలా. రాంపండు అంత నేరం, ఘోరం ఏమీ చేయలేదని వాదించింది.

దెబ్బకి రాంపండు కరిగిపోయాడు. 'ఉండండి. మీరు ఆవేశపడకండి. అదిగో అక్కడ ఒక ఇల్లు కనబడుతోంది. అతన్ని అడిగి మీకు కాఫీలు ఏర్పాటు చేస్తాను. దగ్గర్లో పెట్రోలు బంక్ ఏదైనా ఉందేమో కనుక్కుని డబ్బాలో పట్టించుకుని వస్తాను" అని హామీ ఇచ్చి ఆ ఇంటికి చేరాడు.

తలుపు మూడోసారి తట్టాకనే ఓ భారీమనిషి తలుపు తెరిచాడు. రాంపండు నోరు తెరిచి 'ఎక్స్‌క్యూజ్..." అనబోయేంతలో "నువ్వేనా తలుపు బాదుతున్నది. ఇంకోసారి బాది చూడు. ఏం చేస్తానో చూద్దువు గాని" అన్నాడు.

మాట వినకపోతే తన్నేట్టున్నాడని భయం వేసి రాంపండు చెయ్యి ఎత్తుతూండగానే అతను వాక్యం పూర్తి చేశాడు. "... చెయ్యి విరిచేస్తాను" అని.

గొంతు తగ్గించి అతను తిట్టిన తిట్ల వల్ల తెలిసిందేమిటంటే అతని భార్య చంటి పిల్లవాణ్ని ఇతని సంరక్షణలో పెట్టేసి తిరనాళ్లకు వెళ్లింది. ఆ పిల్లరాక్షసుడు ఓ పట్టాన పడుక్కోలేదు. పైగా ఏడుపు. అతికష్టం మీద వాణ్ని పడుక్కోబెడుతూండగానే రాంపండు వచ్చి తలుపు తట్టాడు. పిల్లవాడు ఎక్కడ లేస్తాడోనన్న భయం. వచ్చి రాంపండుని విరుచుకు తినేయాలన్న కోరిక. ఈ రెండింటి మధ్యలో నలిగిపోయాడు ఆ భారీమనిషి. పిల్లవాడు కాస్త కళ్లు అలా మూయగానే ఇలా వచ్చి రాంపండు పనిపట్టాడు.

కాఫీ పెట్టి ఇమ్మని అడిగే ధైర్యం లేక, "ఇక్కడ పెట్రోలు బంక్' అని రాంపండు అనబోతూండగానే "లేదు. ఉండి ఉంటే నిన్ను పెట్రోలు పోసి తగలెట్టి ఉందును. గట్టిగా ఊపిరి కూడా పీల్చకుండా ఇక్కణ్నుంచి చెక్కేయ్. లేకపోతే...' ఆ తర్వాత అన్నది గుసగుసల వల్ల తెలియలేదు. కానీ ఆ ప్రణాళిక తనకు ఉపకరించేది మాత్రం కాదని రాంపండుకి అర్థం అయింది.

వెనక్కి తిరిగివచ్చేసరికి ఆడవాళ్ల మధ్య పోట్లాట తారస్థాయికి చేరుకుంది. రాంపండు లాటి వాణ్ని కట్టుకోబోతున్న

అమ్మాయి తన ఫ్రెండని చెప్పుకోవడం నామోషీ అంటోంది లావణ్య. లావణ్య చదివిన స్కూల్లో చదివానని చెప్పుకోడం డబల్ నామోషీ అంటోంది వీణాపాణి. ఎలాగోలా ఈ అడవిలోంచి బయటపడితే ఈ జన్మలో గానీ, వచ్చే జన్మలోగానీ మీ ఇద్దరి మొహం చూడనని ప్రతిజ్ఞ పట్టింది లావణ్య. లావణ్య జీవాత్మ కలిసిన పరమాత్మలో తాను ఛస్తే లీనమవనంది వీణాపాణి.

అంతలో టాక్సీ ఆగిన చప్పుడు వినబడింది. పెట్రోలు డబ్బాతో అనంత్ దిగాడు. "అచలపతి మర్చిపోయాడట. సారీ చెప్పి నాతో పెట్రోలు పంపించాడు. ఈ రూటయితే షార్ట్‌కట్ అని నీకు చెప్పినది కూడా అతనేటగా! వెతుక్కుంటూ వచ్చాను" అన్నాడు అనంత్.

"పెట్రోలుతో బాటు కాస్త కాఫీ కూడా పంపించి వుండాల్సింది. కారుతో బాటు పాసింజర్లు కూడా చల్లబడ్డేవారు" అన్నాడు రాంపండు కార్లో పెట్రోలు పోసుకుంటూ...

రాంపండు నుండి సేకరించిన సమాచారమే ఆయుధంగా అనంత్ వెళ్లి ఆ భారీమనిషి ఇంటి తలుపు తట్టాడు. ఈసారి అతి వేగంగా రెస్పాన్సు వచ్చింది. "మళ్లీ వచ్చావురా... ఇంకా బుద్ధి రాలేదూ...." అంటూ దూకుడుగా వచ్చిన భారీమనిషి అనంత్‌ను చూసి తెల్లబోయాడు. అతను ధాటీగా మాట్లాడిన విధం చూసి మరింత తెల్లబోయాడు.

"ఇదిగో. నాలుగు కప్పుల కాఫీ తయారుచేసి ఇయ్యి. త్వరగా. టైము లేదు" అన్నాడు అనంత్. భారీమనిషి నోరు విప్పబోయేంతలో "...లేకపోతే ఈ సీనారేకుడబ్బా మీద ఇదిగో, ఈ కర్రపెట్టి వాయిస్తా. దెబ్బకి మీ పిల్లాడు లేచి ఏడుపు లంకించుకుంటాడు." అని బెదిరించాడు. భారీమనిషి భారీ పిల్లి అయిపోయాడు. పది నిమిషాలు గడవకుండా నలుగురూ కాఫీలు తాగడం, కారు ఎక్కడం జరిగింది.

మైలారం చేరగానే సంఘటనలు చకచకా జరిగిపోయేయి. లావణ్య మాట నిలబెట్టుకుంది. కారు దిగుతూనే ఫేడౌటు అయిపోయింది. కానీ ఆమె నిష్క్రమణ వల్ల రాంపండు లాభపడలేదనే చెప్పాలి. లావణ్యతో వాదించినప్పుడు రాంపండుని వెనకేసుకు వచ్చినా, అనంత్ కాఫీ ఏర్పాటు చేసిన తీరు చూసి వీణాపాణి ముచ్చటపడింది. అనంత్‌ను భోజనానికి ఆహ్వానించి, ఆ ఆహ్వానం రాంపండు ద్వారానే పంపింది.

"ఈసారి చికెన్, ఫిష్ ఉంటాయా?" అని అడిగాడు అనంత్ హుషారుగా.

"మటన్ మాత్రం తప్పకుండా ఉంది. బక్‌రాది"

"ఎవరా బకరా?"

"ఇంకెవరు నేనే? వీణాపాణి స్పష్టంగా చెప్పింది. తన లెవెల్‌కి నేను తగనట! పెళ్లంటూ చేసుకుంటే నీలాటి డాషింగ్ ఫెలోనో చేసుకుంటుందట! లంచ్ అయ్యాక తనే ప్రపోజ్ చేస్తుందిట!" అన్నాడు రాంపండు ఏడుపు మొహం పెట్టి.

అనంత్ మూర్ఛపోయాడు!

**-ఎమ్బీయస్ ప్రసాద్**

**(పిజి ఉడ్‌హౌస్ రాసిన 'జీవ్స్ అండ్ ది ఓల్డ్ స్కూల్ ఛమ్' కథ ఆధారంగా)**

అలనాటి ఆణిముత్యాల
గురించి నేటి తరానికి అనువైన
శైలిలో తెలిపే

క్లాసిక్స్ రీటోల్డ్

# నవ్వుటద్దాలు

-ఆచార్య తిరుమల

## గృహ సాహిత్యం

**గ్రాసం ఎవరిదైనా ఫర్వాలేదు. వాసం మాత్రం మనదై వుండాలన్నారు పెద్దలు. అంటే - ఎవరు పెట్టిన తిండైనా తినొచ్చు గానీ ఎవరింట్లో పడితే వారింట్లో వుండటానికి వీల్లేదు కాబట్టి ఉండే యిల్లు మాత్రం తనదై వుండాలని, దాని వల్ల చాలా యిబ్బందులు తొలిగిపోతాయని పెద్దల హితవు. అసలు కూడు, గూడు, గుడ్డ లేకుండా మనిషికి బతుకే లేదు గదా! ఆ మూడూ అత్యవసరాలు కదా! చాలా మందికి వీటి సాధనే జీవితం. అందులోనే వాళ్ల జీవితం కూడా ముగిసిపోతుంది. కూడు, గూడు ఏ జీవికీ తప్పవు. ఇంక మనిషి సంగతి వేరే చెప్పాలా? మనకి గృహ సాహిత్యం చాలా వుంది. దానికి సంబంధించి న చమత్కారం కూడా చాలా వుంది.**

గృహ ప్రాధాన్యాన్ని చాటి చెప్పే ఎన్నెన్నో మాటలున్నాయి. ఇల్లు - ఇల్లాలు అన్నారు. ఇల్లు చూస్తే ఇల్లాలిని చూడక్కర్లేదన్నారు. పుట్టిల్లు - మెట్టినిల్లు, అని ఆడదానికి రెండిళ్ళు చెప్పి, మగాడికి పెళ్లవ్వగానే, 'ఓ యింటివాడయ్యా' డన్నారు. ఎవరినైనా సరే 'ఇంటి పేరేమిట'ని అడుగుతారు. ఏదైనా మంచి చెప్పినా, చేసినా ఆప్యాయంగా 'నీ ఇల్లు బంగారం గానూ' - అంటారు. ఇలా ఎన్నెన్నో చెప్పుకోవచ్చు; మనుషులకే ఏమిటి - ఆఖరుకి గ్రహాలకి కూడా గదులు కడతారు గదా జ్యోతిష్కులు. ఇల్లు లేని వారికి గుళ్లు - గోపురాలూ ఉండనే వున్నాయి గదా! అసలు కోవెల అంటేనే దేవుడి యిల్లు అని అర్థం. అది అందరిదీ కదా!

ఇంత అత్యవసరమైన ఇల్లు చాలా మందికి బందిఖానా లాగా. ఇల్లు గాక గుదిబండ లాగ కనిపించటం విడ్డూరం. చిలకమర్తి లక్ష్మీనరసింహం గారు మన స్వాతంత్ర్య సంగ్రామ దినాల్లో "చెరశాలల్ పృథు చంద్రశాలలె యగున్" అని బందిఖానాల్ని కూడా చంద్రకాంతశిలా సౌధాల్లా భావించి దేశభక్తిని ప్రబోధించటమే కాకుండా-

**"భరత ఖండంబె యొక గొప్ప బందెఖాన**
**అందులో నున్న ఖయిదీలు హిందు జనులు**
**ఒక్క గది నుండి మార్చి వేరొక్క గదిని**
**బెట్టుటే గాక చెరయంచు వేరె గలదె?**

అని ధైర్యం చెప్పారు. ఎవరి భావాలెలా వున్నా ఇల్లు యిల్లే. అయితే, ఏ యిల్లు బాగుంటుందని ప్రశ్నిస్తే ఒక సంస్కృత కవి అత్తారిల్లే మంచిదంటున్నాడు. అతని శ్లోకం చూడండి:-

**అసారే ఖలు సంసారే సారం శ్వశుర మందిరమ్**
**హిమాలయే హరశ్శేతే హరిశ్శేతే మహోదధౌ!!**

అంటే- నిస్సారమైన సంసారంలో అత్తవారిల్లే సారవంతమైనది కాబట్టే శివుడు హిమాలయం మీద, నారాయణుడు సముద్రం మీద మకాం పెట్టారన్నాడు. శివునికి హిమాలయం, నారాయణుడికి సముద్రం అత్తారిళ్లు గదా! (పార్వతి హిమవంతుడి కూతురు. లక్ష్మి సముద్రంలో పుట్టింది).




ఇంచుమించు ఇలాంటి చమత్కారాన్నే ఒక తెలుగు కవి మరోలా చెప్పాడు. సంస్కృత కవి కంటె ఓ అడుగు ముందుకు వేసి, శివకేశవులతో బాటు సూర్యచంద్రుల్ని కూడా కలిపి - యిలా చమత్కరించాడు. చూడండి:-

**శివుడద్రిని శయనించుట,**
**రవిచంద్రులు మింటనుంట, రాజీ వాక్ష్యం**
**డవిరళముగ శేషునిపై**
**పవళించుట నల్లి బాధ పడలేక సుమీ!**

ఈ పద్యంలో శివకేశవులు - సూర్యచంద్రులు అలా అక్కడే వుండటానికి కారణం - నల్లి బాధ పడలేకట! ఇది ఎవ్వరూ ఊహించని చమత్కారం

కదూ!

నాకు మరో జోక్ గుర్తొస్తూ వుంది. నిరుద్యోగి అయిన రవితో అతని స్నేహితుడు తేజ - "నీకు ఉద్యోగం వచ్చేవరకు మీ మామగారింట్లో వుండిపో. కొన్నాళ్ళపాటు గౌరవంగానే చూస్తారు" అన్నాడు. దానికి రవి యిబ్బందిగా మొహం పెట్టి - "మొదట్లో నేనూ అదే అనుకున్నాను. కానీ మా మామగారు తన మామగారింట్లో ఉంటున్నాడే" అన్నాడు. పాపం! ఆ స్నేహితుడు అవాక్కయి పోయాడు.

నల్లి బాధ పడలేక పురాణ పురుషులలా తమ పక్కలేర్పాటు చేసుకున్నా ఒకడు మాత్రం నల్లి బాధ నుండి తప్పించుకుని తన స్నేహితునితో-



ఓ ఇంటివాడివి కమ్మని అంటే... ఓ మంటవాడివి కమ్మని అనే అర్థం! తప్పేముంది అందులో

"మంచానికి నల్లులెక్కువై నిద్రపట్టటం లేదంటే మందు కొట్టమని సలహా యిచ్చావుగా - థాంక్స్‌రా. ఇప్పుడు బలేగా నిద్రపడు తోంది. 'మందు' కొట్టి పడుకుంటే నల్లులు కుట్టినా అసలు తెలియడమే లేదు" అన్నాడట! ఆ ప్రబుద్ధుడు మందుకి అర్థం మార్చేశాడు. ఏదోలెండి. మొత్తం మీద బాధ తప్పింది.

'ఇల్లు కట్టి చూడు - పెళ్లి చేసి చూడు' అని మనకో సామెత వుంది. అవి కష్టసాధ్యమైన విషయాలని భావన. వాటిని సాధించటమంటే అది జాతకంలో కూడా రాసిపెట్టి వుండాలంటారు. కొంతమంది ఎక్కడపడితే అక్కడ, ఎలా పడితే అలా వుంటారు. కొంతమంది 'ఇల్లే కదా స్వర్గసీమ' అనిపిస్తారు. కొందరు ఇంటినే నరకం చేసి చూపిస్తారు. నానా గలీజుగా, రోతగా వుంటారు. శ్రీనాథ మహాకవి ఒక పురోహితుని యిల్లు చూసి,, వొళ్లు మండిపోయి-

**దోసెడు కొంపలో, బసుల త్రొక్కిడి మంచము దూడ రేణమున్**
**బాసిన వంటకంబు పసిబాలుర శౌచము విస్తరాకులున్**
**మాసిన గుడ్డలుకు దలకు మాసిన ముండలు వంట కుండలున్**
**రాసెడు కట్టెలుం దలపరాదు పురోహితులింటి కృత్యముల్!!**

అని తిట్టి పోశాడు. అది సొంత యిల్లైనా, అద్దె కొంపైనా మనముంటున్న యింటిని పరిశుభ్రంగా, కన్నుల పండువుగా దిద్దితీర్చుకోవాలి. మనింటి మీదెవరూ జోకులు వేయకుండా చూసుకోవాలి.

ఇల్లు కట్టి చూడు - అన్నప్పుడు నాకో జోక్ గుర్తొస్తుంది. ఒక పాఠశాల భవనమేదో కట్టాలని సంకల్పించి రాళ్లపల్లి వారు, ఇసుకపల్లి వారు, తాపీ ధర్మారావు గారు కలిసి కాసు బ్రహ్మానందరెడ్డి గారి దగ్గరకు వెళ్లి తమ సంకల్పం చెప్పారట. రెడ్డిగారది విని నవ్వుతూ "రాళ్లు మీ దగ్గరే వున్నాయి, ఇసుక మీ దగ్గరే వుంది. తాపీ మీ దగ్గరే వుంది - నా దగ్గరకెందుకొచ్చారయ్యా - భవనం కట్టుకోండి" అనగానే - "చిత్తం. అన్నీ మాదగ్గరే వున్నాయి. కానీ 'కాసు' మా దగ్గరలేదండి'' అని బదులు చెప్పగానే - "అసాధ్యులయ్యా మీ''రని రెడ్డిగారు నవ్వేసి తర్వాత సహాయ మందించారట.

ఎంత బాగుందని చెప్పుకుంటున్నా అద్దె యిల్లు అద్దె యిల్లే; సొంత యిల్లు సొంత యిల్లే. సొంతింట్లో వుంటే సుఖశాంతులు, సౌకర్యాలు పరాయి ఇళ్లల్లో, ఆ యిళ్ల యజమానులెంత మంచి వాళ్లయినా, ఉండవు. పరాశ్రయం కష్టంగానే వుంటుందనే కఠోర సత్యాన్ని పూర్వకవి ఒకడు ఇలా చమత్కరిస్తూ చెప్పాడు.

**శిరసా ధార్య మాణోపి**
**సోమః సౌమ్యేన శంభునా**
**తథాపి కృశతాం యాతి**
**కష్టం ఖలు పరాశ్రయః!!**

అంటే - పరమ శాంతుడైన శివుడు తన తలమీద పెట్టుకున్నా చంద్రుడు రోజూ క్షీణిస్తూనే ఉన్నాడు. పరుల్ని ఆశ్రయించి వుండటం కష్టమే కదా! అని అర్థం.

ఎలా వున్నా - చీమలు పెట్టిన పుట్టల్లో పాముల్లా కాకుండా, కాకిగూడుల్లో కోయిళ్లలా వున్నా బాగానే ఉంటుంది. గృహాలు బాగుంటే గ్రహాలు కూడా బాగానే ఉంటాయి.





"దద్దమ్మల్లో కూడా కొంతమంది తెలివైన వాళ్ళుండే ఛాన్స్ లేకపోలేదు తెలుసా...!?"

"మరే... మగాళ్ళలో బ్రహ్మచారులున్నట్టు..."

"యుద్ధానికి భయపడి పారిపోయే వాడిని ఏమంటారో తెలుసా...!?"

"తెలుసు.... పిరికివాడు అని అంటారు".

"తప్పు.... పిరికివాడనరు..."

"మరింకేం అంటారు?"

"బ్రహ్మచారి అని అంటారు".



" రూపాయికి చిల్లు పెట్టి ఇస్తావేం?"

"మరి నువ్వు టిక్కెట్టుకి చిల్లు పెట్టి ఇవ్వలే....!?"



"నాలుగు నిమిషాల్లో నలభై ఇడ్లీలు తిని పోటీలో మొదటి బహుమతి తెచ్చుకున్నావట గదా?"

"తెచ్చుకున్నాలే గానీ దయచేసి ఈ సంగతి మా ఆవిడకు చెప్పకురా..."

"ఎందుకు?"

"చెబితే ... అన్నం పెట్టదురా..."



"నేను వర్క్ చేస్తుంటే జనాలు నోరు తెరుచుకుని అలా ఉండి పోతారు తెలుసా."

"చాల్లేరా... బడాయి... నువ్వు దంతవైద్యుడివని డైరెక్ట్‌గా చెప్పొచ్చుగా.."



"ఒక్క మనిషికి ఒక్క రోజులో యిన్ని తప్పులు చేయటం అసలు ఎలా సాధ్యం?"

"ఏం చెయ్యను ...!? నేను తొందరగా నిద్ర లేచిపోతాను. మరి....!?"



"నాయనమ్మ కళ్ళకు అద్దాలు కావాలేమో..."

"ఎందుకురా... బాగానే కనపడుతున్నట్టున్నాయిగా.."

"అదికాదు నాన్నా వాషింగ్ మిషన్ నీ ప్యాంట్లు ఉతకటం చూసి టీవీలో బాక్సింగ్ మ్యాచ్ చూస్తున్నాననుకుంటోంది."



"నువ్వు ముద్దాయిగా నా ముందు నిలబడటం యిది అయిదోసారి. అందుకని నీకు వంద రూపాయలు ఎక్స్‌ట్రా జరిమానాగా విధిస్తున్నాను."

"చాలా అన్యాయం సార్.... రెగ్యులర్ కష్టమర్‌కి డిస్కౌంట్ యివ్వకపోగా ఎక్స్‌ట్రా పెనాల్టీ ఏమీ బాగాలేదు సార్."



"నేను పుట్టినప్పుడు గాల్లోకి ఇరవై ఒక్కసార్లు తుపాకీ పేల్చారట. ఆ విషయాన్ని ఇప్పటికీ మా వూళ్ళో చెప్పుకుంటారు తెలుసా."

"అన్నిసార్లు గురి తప్పితే చెప్పుకోరేంటి మరి...!?"






"నువ్వెందుకు ఇక్కడ తగలబడ్డావ్? ".

"దేవుడు ప్రత్యక్షమైతే నగల సంగతి కాస్త చూసుకుందామని..." .



"పెళ్లి రోజుని జీవితంలో మరపురాని రోజు అని అంటారెందుకు?"

"కష్టాలన్నీ ఆ రోజే ఆరంభమవుతాయి కనక."



"ఏమిటి కూలీలంతా గోల చేస్తున్నారెందుకు?"

"దున్నే వాడిదే భూమి అన్నట్లు కట్టే వాడిదే ఇల్లు అని ఎందుకు ఉండకూడదు అని గొడవ చేస్తున్నారండీ."



"1947వ సంవత్సరంలో ఏం జరిగిందో తెలుసా?"

"నిన్న రాత్రి జరిగిందే నాకు గుర్తుండి చావదురా... ఇక 1947లో ఏం జరిగిందో ఎలా గుర్తుంటుంది...!?"



"మీ చిన్నతమ్ముడు ఎందుకురా అలా గుక్కపెట్టి ఏడుస్తున్నాడు?"

"డాబా మెట్ల మీంచి నడవకుండా కిందకి వచ్చాడు లే... అదీ బడాయి..."

# లలిత సంగీతం



## ఏలా యీ మధుమాసము



ప్రముఖ గాయకుడు,
స్వరకర్త లలిత సంగీత
విద్వాంసుడు, వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.

ఫోన్ నెం. 040-7402993

ప॥ ఏలా యీ మధుమాసము
ఇంకేదీ ప్రణయ విలాసము ॥ఏలా॥

1. చ॥ నీ చూపులు వెన్నెలలై సాగక
నీ నవ్వులు వీణియలై మ్రోగక
మసక చీకటులు ముసిరిన నాకా
మల్లెపూల దరహాసము ॥ఏలా॥

2. చ॥ కోరికలన్నీ కోరకమ్ములై
భావనలే శంపావల్లరులై
సురభిళించినా నీవులేనిచో
శూన్యము హృదయాకాశము ॥ఏలా॥

3. చ॥ అకులూకల కోకిలలూ నాలో
తెలియరాని బాధల రగిలించెను
నీ కమ్మని పిలుపే వినలేచని
నాకేదీ ఉల్లాసము ॥ఏలా॥

| | | |
|---|---|---|
| రచన | : | డా॥ సి.నారాయణరెడ్డి |
| గానం, సంగీతం | : | ఎం.చిత్తరంజన్ |
| రాగం | : | దర్బారీ కానడ (హిందుస్తానిరాగం) |
| ఆరోహణ | : | స రి గ మ రి మ ప ద ని స |
| అవరోహణ | : | స ద ని ప మ ప గ మ రి స |

-షడ్జమము, చతుశృతి రిషభం, సాధారణ గాంధారం, శుద్ధమధ్యమం. పంచమం, శుద్ధదైవతం, కైశికి నిషాదం - యీ రాగంలోని స్వరాలు.

ఈ స్వరాలు ఆరోహణలోను, అవరోహణలోను పైన చూపిన విధంగా వక్ర సంచారంతో రాగస్వరూపాన్ని వెల్లడి చేస్తాయి. హిందుస్తాని సంగీతంలో యిది సుప్రసిద్ధమైన రాగం. మొగల్ చక్రవర్తి అక్బర్ ఆస్థానంలో విద్వాంసుడైన తాన్‌సేన్ యీ రాగాన్ని రూపొందించినట్లుగా చెబుతారు. భక్తి రసానికి, విరహానికి ఎక్కువగా దీనిని ఉపయోగించడం పరిపాటి. హిందుస్తాని శాస్త్రీయ సంగీతంలో ఉద్దండ పండితులైన విష్ణుదిగంబర్ పలూస్కర్ దర్బారీ కానడ రాగం యొక్క ప్రత్యేకత, విశిష్టత, రాజ దర్బారులో పాడే రాగంగా అందులోని హుందాతనము, దర్పము వ్యక్తమయ్యే విధంగా రాగంలోని గాంధార, దైవతస్వరాల గమకాలను సైతం పలికించే పద్ధతిని వారి శిష్యులైన సుప్రసిద్ధ విద్వాంసులు వినాయక్‌రావ్ పట్వర్ధన్, నారాయణ్ రావ్‌వ్యాస్ మున్నగువారికి బోధించేవారుట. 1973లో హైదరాబాదులోని రవీంద్రభారతి వేదికపై వారి గురువుగారి శతజయంతి ఉత్సవాలలో పాల్గొనడానికి వచ్చి స్వరార్చనగావించారు. ఆ సందర్భం గురువుగారు తెలిపిన రాగవైశిష్ట్యం గురించి వారిరువురూ సభలో మాట్లాడి, ఆ తరువాత దర్బారీరాగాన్ని ఒక గంట సేపు అద్భుతంగా ఆలపించారు. అప్పటికే 70 సంవత్సరాల పై చిలుకు వయస్సున్న వారిరువురి గానం అందరినీ సమ్మోహ పరచింది. కార్యక్రమానికి హాజరయిన విద్వాంసులకు, కళాకారులకు ఆరాగం పాడే విధానం ఎంతో స్ఫూర్తిదాయకమైంది. లలిత సంగీతంలో కూడా యీ రాగం చాలా ప్రచారాన్ని పొందింది. చిత్రరంగంలో కూడా హింది, తెలుగు, తమిళం మొదలగు అనేక భాషలలో దర్బారీ కానడలో ఎన్నో మధురమైన బాణీలు వెలువడ్డాయి. ఆకాశవాణిలో కూడా లలిత గీతాలకు పలువురు స్వరకర్తలు యీ రాగాన్ని వినియోగించారు. "ఏలా యీ మధుమాసము" అనే యీ గీతం సుప్రసిద్ధ కవి డా॥ సి.నారాయణరెడ్డి గారి కలం నుంచి జాలువారింది. నవరసాలలో రసరాజంగా పేరొందిన శృంగారంలో సంభోగ, విప్రలంభ

ప॥ ; సామగామ రిసా నిరిసస ధానీ | సానీ రిరి సా; ; సా ॥
. ఏ . . . లా. యీ . . . మధు | మా . . స ము . . ఇం ॥

సమరిమా; ; పదా మపా | మపనిసాపపా గామారిసా ॥
కే . . దీ . . ప్రణయవి | లా . . . . . స ము . . . ॥ ఏలా ॥

1.చ॥ ; పదామపాగారి; మా | పాపాదా; దని సనిసా పపా ॥
. ప్రే. చూ. పులు. వె | న్నెలలై. సా . . . . గక ॥

; మపానిని సాసా రిససని | పాపనిసరి నిసాసాసా ॥
. ప్రే. న. వ్వులు వే . . . | . రియలై. మెరు. గక ॥

; పపానిసారి రిరిరిరి | సా సరిగమా రి సాసరినిస ॥
. మన క పా. కటులు | . ముసిరిన నా. తా . . . ॥

; నిరినిసా పానిమాపా | మపనిసా, పా గామారి సా ॥
. మ. ల్లెపూ. ల ద రి | హా . . . . స ము . . . ॥ ఏలా ॥

2.చ॥ ; సరిమమా మపామమపదప | దమమపమగగరిరిసాసా; ॥
. కో. రిక ల . . న్నీ . . | . . తో. . రిక . . మ్మలై. ॥

; సరిమమామారి, రిమా | పా, మపాసని దానిపా; ॥
. భా. వన తే . . శం. | పా . . వ . . ల్లరులై. ॥

; పపానిసారిరి రిరి | సాసరి గమ రిసాసాసా; ॥
. సురభి శీ. చి నా. | . న. పు. వే. నిచో. ॥

; నిరి నిసా పానిమాపా | మప నిసా, పా గామారి సా ॥
. చూ. న్నము హృదయా . | కా . . . . శ ము . . . ॥ ఏలా ॥

3.చ॥ ; నిసారి, ; రిసా రిపా | గామారిసా రిస నిసరిస సా ॥
. అళులూ. కల కో. | కి ల లూ. నా . . . . . ॥

; ససారి రిమపమరిమాపా | పామా సాసా దానిపాపా ॥
. తెలియరా . . . . నిలూ. | ధల రిగి లిం. చెను ॥

; పనిసరి రిసా, సరి | గా; గామా రి; సాసా ॥
. నీ. క. మ్మని. పిలు | పే. విన నో. చెలి ॥

; పమాపని రిసానిదా | దాని దానీ సా; ; పమ ॥
. నా. కే. దీ. . . | ల్లా . . స ము . . నా. ॥

పాసానిసరిసనిపా; పమ | మపనిసా, పా గామారిసా ॥ ఏలా ॥
కే. దీ . . . . . . . . | ల్లా . . . స ము . . .

శృంగారాలనేవి రెండున్నాయి. విప్రలంభం లేక వియోగ శృంగారాన్ని వివరించే మనోహర గీతం యీ 'ఏలా యీ మధుమాసము'. ప్రేయసి నవ్వుల వెన్నెలలు, ఆమె కన్నుల కాంతుల మెరుపుతీగలు దూరమైనప్పుడు ప్రణయ విలాసవిరహితమైన మనస్సుకు మధుమాసం ఎందుకూ కొరగానిదిగా అనిపించడం సహజం. ప్రకృతిలోని రమణీయ రవళులు, కమనీయ కాంతులు మనసును పరవశింప చేయవు. ఉల్లాసం కలిగించవు. విరహియైన వ్యక్తి మనసును స్పష్టంగా చిత్రీకరించారు సినారె యీ గీతంలో. ఈ పాటతో స్వరకర్తగా 1954లో నా సంగీతయాత్ర ప్రారంభించాను.



## చందా పొడిగింపు

హాసం తొలిసంచిక నుండీ చందాకట్టిన వారి చందా 16-30 సెప్టెంబరు, 2002 సంచికతో ముగుస్తోంది. వెంటనే చందా పొడిగించ ప్రార్థన. పత్రిక మధ్యలో ఏ గ్యాప్ లేకుండా అందాలంటే ఇది తప్పనిసరి. పోస్టల్ కన్సెషన్ సౌకర్యం తాజా సంచికలకు మాత్రమే లభ్యమవుతుంది. అందువల్ల సెప్టెంబరు 20 తర్వాత రెన్యూ చేయించిన వారికి విడిగా ఎక్కువ ఖర్చుతో పంపవలసి వస్తుంది. పాఠకులు ఈ విషయాన్ని గమనించి వెంటనే స్పందిస్తారని ఆశిస్తున్నాం.

-ఎడిటర్



## దర్బారీ కానడరాగం ఆధారంగా కొన్ని చిత్రగీతాలు

### తెలుగు

| | పాట | చిత్రం | గానం | సంగీతం |
|---|---|---|---|---|
| 1. | పావనగుణరామాహరే | భక్తపోతన | చిత్తూరు నాగయ్య | చిత్తూరు నాగయ్య |
| 2. | నమోభూతనాథా | సత్యహరిశ్చంద్ర | ఘంటసాల, ఎస్.వరలక్ష్మి | పెండ్యాల |
| 3. | శివశంకరీ శివానందలహరి | జగదేకవీరుని కథ | ఘంటసాల | పెండ్యాల |
| 4. | శ్రీనగజాతనయం సహృదయం (హరికథలో పల్లవి మాత్రం) | వాగ్దానం | ఘంటసాల | పెండ్యాల |
| 5. | ఆనతికావలెనా - గానానికి సమయము రావలెనా | అమరసందేశం | ఎ.ఎం.రాజా | ప్రసాదరావు అండ్ పార్టీ |

### హిందీ

| | | | | |
|---|---|---|---|---|
| 1. | ఓ దునియాకే రఖ్‌వాలే | బైజూబావ్‌రా | రఫీ | నౌషాద్ |
| 2. | మొహబ్బత్‌కి ఝూటీ కహానీపే రోయే | మొగలేఆజమ్ | లత | నౌషాద్ |
| 3. | లపక్ ఝపక్ తూ ఆరే బదర్‌వా ఆరేబదర్‌వా | బూట్‌పాలిష్ | మన్నాదే | శంకర్‌జైకిషన్ |
| 4. | ఝనక్ ఝనక్ పాయల్ బాజే టైటిల్ సాంగ్ | ఝనక్ ఝనక్ పాయల్ బాజే | ఉస్తాద్ అమీర్‌ఖాన్ | వసంత్‌దేశాయ్ |

## మహామేధావి రాంబాబు!



**నండూరి పార్థసారథిగారు సృష్టించిన విలక్షణ హాస్యపాత్ర రాంబాబు! రాంబాబు ఓ 20 ఏళ్ల కాలేజీ కుర్రవాడు. 'సుజనమిత్ర' అనే లార్జెస్ట్ సర్క్యులేటెడ్ డెయిలీ ఫ్రమ్ చింతల్‌బస్తీ (సర్క్యులేషన్ 2 వేల కాపీలు)లో పార్ట్‌టైము ఉద్యోగం. తన అరకొర తెలివితేటలతోనే తను మహామేధావిననుకుంటాడు రాంబాబు. ఇంగ్లీషు, తెలుగు సరిగా రాక కొంత, 'స్వేచ్ఛా'ను వాదాల వల్ల కొంత, కుతర్కం వల్ల కొంత, అమాయకత్వం, అజ్ఞానం, అతితెలివి వల్ల కొంత - రకరకాలుగా తనకు తెలియకుండానే బోల్డంత హాస్యాన్ని పంచాడు రాంబాబు. 'హాసం' రెండవసంచిక (16-31 అక్టోబరు, 2001)లో సమీక్షించిన 'రాంబాబు డైరీ' (మొదటిభాగం) ద్వారా రాంబాబు 'హాసం' పాఠకులకు పరిచితుడే. 'రాంబాబు డైరీ' (రెండవభాగం)లో తప్పుడింగ్లీషు ద్వారా వెదజల్లిన కొన్ని ముత్యాలు :**

★ టీ షర్టు చూసి "ఈజిట్ ఫర్ జెంట్స్ ఆర్ లేడీస్?" అని షాపు వాడిని అడిగితే "దటీజ్ యూనీ సెక్స్" అని చెప్పాడువాడు. మగవాళ్ళకా, ఆడవాళ్ళకా అని అడుగుతుంటే సెక్సు ప్రసక్తి తీసుకురావడం అసభ్యం, అసందర్భం అని ఝాడించి వదిలి పెడదామనుకున్నాను.

★ స్టార్‌డస్ట్, డెబొనీర్‌లాంటి ఎడల్టరీ మేగజైన్స్ (ఎడల్ట్ మేగజైన్స్ అనబోయి)

★ ఐవిల్ కవరప్ ఎవ్విరిథింగ్ (న్యూస్ కవర్ చేస్తానన్న భావంతో)

★ అసలే ఈ రిజర్వేషన్లతోనే చస్తుంటే కొందరు నాయకులు దేశీయ పరిశ్రమలలో విదేశీపెట్టుబడులను ఆహ్వానించే విషయంలో తమకు రిజర్వేషన్లున్నాయంటున్నారు. కొందరు రిజర్వేషన్లపై రిజర్వేషన్లున్నాయంటున్నారు.

★ ఇంటికి దగ్గర్లో కాల్పులు జరుపుతున్నారు. హోరుతో నిన్న రాత్రంతా ఒకటే 'సౌండ్' స్లీప్.

★ షాపు కెళితే సేల్స్‌మన్ 'దీజ్ ఆర్ షర్టింగ్స్‌అండ్ దీజ్ ఆర్ ఆల్ సూటింగ్స్' అని చూపించబోయాడు. "యూసీ... ఐ డోంట్ వేర్ సూట్స్ అండ్ కోట్స్. ఐ వేర్ ఓన్లీ షర్ట్స్ అండ్ పాంట్స్. సో ఐడోంట్ వాంట్ ఎనీ సూటింగ్స్ ఆర్ కోటింగ్స్. షర్టింగ్స్ అండ్ పాంటింగ్స్ ఆర్ ఎనఫ్ ఫర్‌మి" అన్నాను.



★ ఇంకోడొచ్చి "యూ వాంట్ ఎ పెయిర్ ఆఫ్ ట్రౌజర్స్?" అన్నాడు. "ఐ డోంట్ వాంట్ ఎ పెయిర్. వన్ ఈజ్ ఎనఫ్ ఫర్‌మి" అని చెప్పేశా!

★ "నో సర్ అయాం స్టిల్ డిజప్పాయింటెడ్". ( నాట్ అపాయింటెడ్ ఎట్ అనబోయి)

★ "ఇటీజ్ నాట్ మై జాబ్ టు క్లియర్ డౌట్స్ ఆఫ్ ఎవ్విరి టామ్, డిక్ అండ్ హరీశ్. అతను తప్పురాస్తే హౌ ఐయామ్ రెస్పాన్సిబుల్? అయాం ఆబ్సల్యూట్లీ ఇర్రెస్పాన్సిబుల్" అని గర్జించాను.

★ పెయింటిస్టులు (పెయింటర్స్ అనబోయి)

అలాగే తెలుగు రాక పుట్టించిన హాస్యానికి కొన్ని మచ్చుతునకలు - వచ్చే సంచికలో




| | |
|---|---|
| చిత్రం | : ముఝ్‌సే దోస్తీ కరోగే! |
| రచన | : ఆనంద్ బక్షీ |
| సంగీతం | : రాహుల్ శర్మ |
| గానం | : లతా మంగేష్కర్, సోనూ నిగమ్ |
| అభినయం | : రాణీ ముఖర్జీ, హృతిక్‌రోషన్ |

# జానే దిల్ మేఁ కబ్‌సే హై తూ



అ: జానే దిల్ మేఁ కబ్‌సే హై తూ జబ్‌సే మైఁ హూఁ తబ్‌సే హై తూ
ముఝ్‌కో మేరే రబ్ కీ కసమ్ యారా రబ్‌సే పహలే హై తూ (2)
ఆ: ॥జానే దిల్ మేఁ॥
చ/అ: రాహీ చలేఁనా చలేఁ, చల్‌తే హైఁ యే రాస్‌తే
ఆవో చలో, రుక్‌గయీఁ రస్తే మేఁ కిస్ వాస్‌తే
ఆ: మైఁ తో ఖడీ హూఁ యహీఁ
యార్ మిలా జబ్‌సే హై తూ — అ: ॥జానే దిల్ మేఁ॥
చ/ఆ: నాదాన్ హో జాతే హైఁ, అన్‌జాన్ హో జాతే హైఁ
ఎక్ దూస్‌రే పే చలో కుర్బాన్ హో జాతే హైఁ
అ: తూ హై జహాఁ మై వహాఁ
ముఝ్‌కో ప్యారా సబ్‌సే హై తూ — ఆ: ॥జానే దిల్ మేఁ॥

హృతిక్‌రోషన్ నటించిన గత రెండు చిత్రాలు 'ఆప్ ముఝే అచ్ఛే లగ్‌నే లగే', 'న తుమ్ జానో న హమ్' అంత బాగా ఆడకపోయినా అతని తదుపరి చిత్రం 'ముఝ్‌సే దోస్తీ కరోగే!'కు క్రేజ్ ఏర్పడిందంటే దానికి ఒక ముఖ్యకారణం ఉంది. అదేమిటంటే ఇది యష్ చోప్రా నిర్మించిన చిత్రం.

హృతిక్‌రోషన్ టాలెంట్‌ని మనం విస్మరించలేక పోయినా యష్‌చోప్రా తన చిత్రాలను నిర్మించటంలో, ప్రమోట్ చేయటంలో తీసుకునే శ్రద్ధ ఈ చిత్రానికి ప్లస్ పాయింట్ అయింది. ఇక యష్‌చోప్రా చిత్రాలలో సంగీతానికి ఉండే ప్రాధాన్యత గురించి ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు.

ఈ చిత్రానికి సంగీతం అందించినది నూతన సంగీతదర్శకుడు రాహుల్‌శర్మ. ఈయన ఎవరో కాదు - ప్రముఖ సంతూర్ విద్వాంసుడు పండిట్ శివ్‌కుమార్ శర్మ కుమారుడు. పండిట్ శివ్‌కుమార్‌శర్మ, పండిట్ హరిప్రసాద్ చౌరాసియా కలిసి శివ్ - హరి గా యష్‌చోప్రా తీసిన 'సిల్‌సిలా', 'చాంద్‌నీ', 'లమ్హే', 'డర్' చిత్రాలకు సంగీతం అందించారు. రాహుల్‌శర్మ 'చాంద్‌నీ', 'లమ్హే', 'డర్' చిత్రాలకు శివ్ - హరి కి సహాయకుడిగా పనిచేసారు. అప్పటి నుంచి ఆయనకు సంగీత దర్శకుడిగా ఆఫర్లు వచ్చినా ఆయన 'ముఝ్‌సే దోస్తీ కరోగే!' చిత్రాన్నే ఎంచుకోవడానికి కారణం ఇది యష్‌చోప్రా చిత్రం కావడమే. తన తండ్రిలా సినిమాలకు అడపాదడపా కాకుండా తరచూ సంగీత దర్శకత్వం వహించాలనుకుంటున్నానని అంటారాయన. గత జూన్‌లో పియానిస్ట్ రిచర్డ్ క్లేడర్‌మన్‌తో కలిసి సంతూర్, పియానోల ఫ్యూషన్‌తో తన తొలి ఆల్బమ్‌ను విడుదల చేసారు ఆయన. ఇందులో బీటిల్స్ నంబర్ 'నార్వేజియన్ వుడ్' కవర్ వెర్షన్ కూడా ఉంది.

ఈ చిత్రంలోని పాటలన్నీ స్వర్గీయ ఆనంద్ బక్షీ వ్రాసినవే. ఈ పాటలు వింటే ఆయన లేని లోటు తీరదు అని ఖచ్చితంగా అనిపిస్తుంది. గత సంవత్సరం వచ్చిన 'కభీ ఖుషీ కభీ గమ్' తర్వాత లతామంగేష్కర్ పాడిన మెయిన్‌స్ట్రీమ్ చిత్రం ఇదే. ఈ సంవత్సరం ప్రథమార్థంలో వచ్చిన ఆర్ట్ ఫిల్మ్ 'లాల్ సలామ్'లో తమ్ముడు హృదయ్‌నాథ్ మంగేష్కర్ సంగీతంలో పాడినాచిత్రం కమర్షియల్‌గా హిట్ కాకపోవటంతో సంగీతం ప్రజాదరణ పొందలేదు. గత సంవత్సరం ఎ.ఆర్. రహమాన్ సంగీతంలో వచ్చిన 'జుబేదా', 'వన్ టూ కా ఫోర్', 'లగాన్' చిత్రాలలో చక్కని మెలొడి పాటలను బహుచక్కగా పాడిన లతా ఈ చిత్రంలో యువతరాన్ని ఆకట్టుకునే పాటలను అంతే చక్కగా పాడారు.

ఈ చిత్రానికి నూతన దర్శకుడు కునాల్ కోహ్లీ దర్శకత్వం వహించారు. ఈయన గతంలో టీవీలో 'చలో సినిమా' కార్యక్రమంలో సినిమా సమీక్షలు అందించేవారు. ఆ కార్యక్రమంతోపాటు 'క్యాసీన్ హై', 'గెలాక్సీజీ' కార్యక్రమాలకు ఆయన దర్శకత్వం వహించేవారు. ఇవేగాక ఆయన రాజశ్రీ సంస్థ వారు రూపొందించిన 'యే హై ప్రేమ్' మ్యూజిక్ వీడియోకి కూడా దర్శకత్వం వహించారు. అబ్బాస్, ప్రీతి జంగ్యానీ నటించిన ఆ వీడియో ఆయనకి ఎంతో పేరు తెచ్చిపెట్టింది. ఇప్పుడు ఈ చిత్రం ద్వారా ఆయన వెండితెరకు పరిచయమయ్యారు.

'యాదేఁ', 'కభీ ఖుషీ కభీ గమ్'లో కలిసి నటించి ఈ తరం జంటగా పేరు తెచ్చుకున్న హృతిక్‌రోషన్, కరీనా కపూర్‌తో పాటు రాణీముఖర్జీ కూడా ఈ చిత్రంలో నటించింది. చిత్రకథ ప్రకారం హృతిక్, కరీనా, రాణి చిన్ననాటి స్నేహితులు. హృతిక్ కుటుంబం అతని చిన్నతనంలోనే లండన్ వెళ్ళిపోతుంది. వెళ్ళేటపుడు హృతిక్ కరీనాకు ఈ-మెయిల్స్ పంపిస్తానని చెప్తాడు (అప్పట్లో ఈ - మెయిల్స్ ఉండేవా అని అడగకూడదు మరి). అతని ఈ - మెయిల్స్‌కి సమాధానం ఇవ్వటానికి ఆసక్తి లేదని కరీనా చెప్పటంతో రాణి కరీనా పేరుతో వాటికి సమాధానం ఇస్తుంది. ఇలా 15 ఏళ్లు గడిచాక హృతిక్ ఇండియా తిరిగివస్తాడు. తన ఈ - మెయిల్స్‌కు ఇన్నాళ్ళూ సమాధానం ఇచ్చినది కరీనా అనే అభిప్రాయంలో ఆమెను ప్రేమిస్తాడు హృతిక్. రాణి మౌనంగా తప్పుకుంటుంది. కానీ ఆ ఈ - మెయిల్స్ పంపినది రాణి అని తెలిశాక హృతిక్ ఆమెని ప్రేమిస్తాడు. రాణి మొదట ఒప్పుకోకపోయినా అతని ప్రేమలోని నిజాయితీకి కరిగిపోయి అతణ్ని ప్రేమిస్తుంది. ఇంతలో కరీనా తండ్రి మరణించడంతో ఆమెను పెళ్లిచేసుకోమని హృతిక్‌ను ఒప్పిస్తుంది రాణి. ఇలా కథ ఎన్నో మలుపులు తిరుగుతుంది. కథ వింటుంటే గతంలో వచ్చిన అనేక చిత్రాలు గుర్తుకువస్తాయి. కానీ కునాల్ కోహ్లీ దర్శకత్వం, హృతిక్ నటన ఈ చిత్రాన్ని తనదైన స్థానంలో నిలబెట్టాయని చెప్పవచ్చు.

'వన్ టూ కా ఫోర్'లో 'ఖామోషియాఁ గున్ గునానే లగీఁ' వంటి అందమైన పాటను పాడిన లతా, సోనూనిగమ్ పాడిన పాట 'జానే దిల్ మేఁ కబ్‌సే హై తూ'. హృతిక్, రాణి నిజానికి తమ మనసులు ఎప్పుడో కలిశాయని తెలుసుకున్నప్పుడు పాడే పాట యిది.

హిందీలో ఏదైనా ప్రశ్నకు ముందు 'జానే' జోడిస్తే తనలో తాను ప్రశ్నించుకుంటున్నట్టు అర్థం. ఉదాహరణకి 'జానే కహాఁ గయే వో దిన్' అంటే ' ఆ రోజులు ఎక్కడికి పోయాయో' అని తనలో తాను అనుకుంటున్నట్టు. 'జానే దిల్ మేఁ కబ్‌సే హై తూ' అంటే 'మనసులో ఎప్పటి నుంచి ఉన్నావో నీవు' అని. 'జబ్ సే మైఁ హూఁ' అంటే 'నేను ఉన్నప్పటి నుంచి' అని. 'రబ్' అంటే దైవం. 'కసమ్' అంటే ఒట్టు.



'యారా' అంటే 'నేస్తమా' అని. 'రబ్‌సే పహలే' అంటే 'దైవం కన్నా ముందు' అని.

'నా మదిలో ఎప్పటి నుంచి ఉన్నావో నీవు
నా ఉనికి ఉన్నప్పటి నుంచి ఉన్నావు నీవు
నా దైవం మీద ఒట్టు
నేస్తమా, దైవం కన్నా ఎక్కువ నీవు'

ప్రతి మనిషికి తన జీవితభాగస్వామి ఇలా ఉండాలనే ఊహలు ఉంటాయి. ఆ విధంగా ఆ వ్యక్తి ప్రతిరూపం మనసులో ముద్రించుకుపోతుంది. ఒక్కోసారి ఆ వ్యక్తి తారసపడినా గుర్తించటంలో పొరపాటు జరుగుతుంది. గుర్తించాక తాను యుగాల నుంచి వెతుకుతున్నది ఈ వ్యక్తికోసమే కదా అనిపిస్తుంది. అదే విషయం ఇక్కడ ఎంతో భావయుక్తంగా చెప్పారు రచయిత ఆనంద్‌బక్షీ. ఆ ప్రేమికులిద్దరూ దైవం కన్నా ఎక్కువగా ఒకరిని ఒకరు ఆరాధిస్తున్నారు.

'రాహీ' అంటే బాటసారి. బహువచనానికి కూడా 'రాహీ' అనే అంటారు. 'చల్‌నా' అంటే నడవటం. 'రస్తా' అన్నా 'రాస్‌తా' అన్నా బాట, దారి. 'రుక్‌నా' అంటే ఆగటం. 'కిస్ వాస్‌తే' అంటే 'దేనికోసం' అని. 'ఖడీ హూఁ' అంటే 'నిలబడి ఉన్నాను' అని. 'జబ్‌సే తూ మిలా హై' అంటే 'నిన్ను కనుగొన్నప్పటి నుంచి' అని.

అ: బాటసారులు నడిచినా లేకున్నా ఉంటాయీ బాటలు
పద పయనం సాగిద్దాం దారిలో ఆగావెందుకు
ఆ: నేను వేచి ఉన్నాను ఇక్కడే
నేస్తమా నిను కనుగొన్నప్పటి నుంచి

దేవుడు ప్రతివ్యక్తికి ఒక తోడుని ముందే నిర్ణయిస్తాడని అంటారు. ఆ వ్యక్తులు ఒకరినొకరు కలుసుకోవడమే తరువాయి. ఇదే భావం ఇక్కడ బాట, బాటసారి ఉపమానాలతో చక్కగా చెప్పారు రచయిత. 'పద కలిసి నడుద్దాం, ఆగావెందుకు?' అని అతను అంటే 'నేను ఆగలేదు. నా మనసులో ఉన్నది నీవే అని గుర్తించినప్పటి నుంచి నీకోసం వేచి ఉన్నాను' అని చెప్పటంలో ఆమె అతన్ని ఎప్పటి నుంచో ప్రేమిస్తోందని, అతను ఆమెను ఆలస్యంగా కనుగొన్నాడనే విషయం ఎంత బాగా ఇమిడిపోయిందో గమనిస్తే ఆనంద్‌బక్షీ లాంటి రచయితను కోల్పోవటం ఎంత విచారకరం అనిపిస్తుంది.

'నాదాన్' అంటే ఏమీ తెలియనివారు, అమాయకులు. 'అన్‌జాన్' అంటే ఒకరికొకరు తెలియని వారు. 'కుర్బాన్' అంటే 'త్యాగం చేయటం'. 'ప్యారా' ఇష్టమైనది.

ఆ: ప్రేమంటే తెలియనట్టు, ఒకరికొకరం తెలియనట్టు
ప్రేమలో పడి ఒకరికోసం ఒకరం జీవిద్దాం
అ: నువ్వెక్కడుంటే నేనక్కడే
నాకు అందరికన్నా ఇష్టమైనది నువ్వు

ఇన్నాళ్ళూ తన ప్రేమను మనసులో దాచుకుంది ఆమె. అతను ఆమెను కనుగొనటంలో పొరపాటు చేసి ఆమెని చేరుకున్నాడు. అలా కాకుండా వారు ఒకరినొకరు తొలిసారి కలుసుకున్నట్టుగా తొలిప్రేమలోని ఆనందాన్ని అందుకోవాలని ఆమె ఆశ. ఆమెని విడిచి ఉండలేనంత ఇష్టం అతనిది.

ఈ చిత్రంలో లతా ఉదిత్‌నారాయణ్‌తో కలిసి పాడిన 'అన్‌దేఖీ అన్‌జానీ సీ ' పాట కూడా హిట్టే. ఎన్ని తరాలు మారినా లతా గానం భారతీయులను ఇంకా మంత్రముగ్ధులను చేస్తూనే ఉంది.

-పి.వి. సత్యనారాయణ రాజు.

**1994 లో 'మేడ్ ఇన్ ఇండియా'తో ఒక్కసారి ఊపందుకున్న ఇండీపాప్ 'వివా' గ్రూప్ ఆవిర్భావంతో పరాకాష్టకు చేరుకుందనవచ్చు. చానెల్ 'వి' దేశవ్యాప్తంగా జరిపిన టాలెంట్ సెర్చ్‌లో ఎంపిక చేసిన ఐదుగురు అమ్మాయిలతో ఈ గ్రూపు ఏర్పడింది. వీరిని సెలక్టు చేసినవారు కూడా సామాన్యులు కారు - సందీప్ చౌతా, శుభా ముద్గల్, సుష్మారెడ్డి, మనీష్ మల్‌హోత్రా జడ్జీలుగా ఉన్నారంటేనే అర్థం చేసుకోవచ్చు ఈ గ్రూపు సత్తా ఎటువంటిదో! మరి ఈ గ్రూపు సభ్యులెవరో తెలుసా?**



యువ గాయనీమణులు నేహా, మహువా, అనూష్కా, ప్రాతీచీ, సీమా

1. మహువా కామత్ (పుణె) - వయసు 20 - పుట్టినతేదీ మార్చి 6 - హిందుస్తానీ శాస్త్రీయ సంగీతం నేర్చుకుంది. బి.కామ్. రెండో సంవత్సరం చదువుతూ ఈ సంగీతం నేర్చుకోవడానికి ఓ ఏడాది చదువు పక్కన పెట్టింది.

అభిమాన సంగీతకారులు -ఎలానిస్ మారిసెట్, క్రాన్ బెరీస్, ట్రేసీ చాప్‌మన్, డిడో,

2. సీమా రామ్‌చందాని(పుణె) - వయసు 22 - పుట్టినతేదీ అక్టోబరు 28 -

స్కూలు సైకాలజీలో పోస్టు గ్రాడ్యుయేట్ డిప్లమో హోల్డర్, చిన్నపిల్లలలో సృజనాత్మక పెంపొందించడానికి వర్క్‌షాపులు నిర్వహిస్తుంది. సంగీతాభిమానుల ఇంట్లో పుట్టినందువలన, శాస్త్రీయంగా అభ్యసించకపోయినా, చిన్నప్పటి నుండీ అనేక వాయిద్యాలు వాయించగలిగేది. పుణెలో లోకల్ బ్యాండ్‌లో పాల్గొని అనేక షోలు ఇచ్చింది.

అభిమాన సంగీతకారులు - కిషోర్‌కుమార్, లెడ్ జెప్లిన్, స్టింగ్, స్టీలీ డాన్, బీటిల్స్, యూ2, లతోబాటు అబిదా పర్వీన్, నుస్రత్ ఫతే అలీ ఖాన్ వంటి సూఫీ గాయకులు కూడా!

3. అనూష్కా మన్‌చందా (ఢిల్లీ) - వయసు 18 - పుట్టినతేదీ ఫిబ్రవరి 11

చదువుతున్న 12 వ తరగతి పరీక్షలు పక్కన బెట్టి ఈ పోటీలో పాల్గొంది. ఢిల్లీ ఆడిషన్‌లో సెలక్టు అయింది కానీ మైనారిటీ తీరలేదు కాబట్టి గ్రూపులో చేరకూడదన్నారు. అదృష్టం బావుండి గోవాలో ఫిబ్రవరి 11 న ఫైనల్ జరిగేనాటికి సరిగ్గా 18 నిండాయి. సంగీతంలో శిక్షణ పొందలేదు. కానీ పియానో, గిటార్, డ్రమ్స్ వాయించగలదు.

అభిమాన సంగీతం - పెరల్ జామ్, మెటాలికా స్టయిల్, టెక్నో, ట్రాన్స్

4. ప్రాతీచీ మహాపాత్రా (ముంబయ్) - వయసు 24 - పుట్టినతేదీ జనవరి 25

కామర్స్‌లో డిగ్రీ సంపాదించుకుని, ఫేషన్ టెక్నాలజీ ఇన్‌స్టిట్యూట్‌లో నిట్‌వేర్ డిజైన్‌లలో డిప్లొమా తెచ్చుకుని పాంతలూన్స్ కంపెనీలో పనిచేస్తూ వి చానెల్ యాడ్ గురించి విని అప్లయ్ చేసింది. ఆరుసంవత్సరాలపాటు హిందూస్తానీ శాస్త్రీయసంగీతం నేర్చుకున్న ప్రాతీచీకి చక్కటి వాయిస్ ఉంది.

5. నేహా భాసిన్ (ఢిల్లీ) - వయసు 19 - పుట్టినతేదీ నవంబరు 18

సోషియాలజీ ఆనర్సులో రెండో సంవత్సరం చేస్తోంది. తండ్రి అశోక్ భాసిన్ హైకోర్టులో లాయరు. అక్క, తమ్ముడు వున్నారు. పాటలు రాయడం, డాన్సింగు చేయడం హాబీలు. తల్లి పాట అంటే నేహాకు చాలా ఇష్టం. మేరియా క్యారీ పాటల ప్రభావం తనపై ఉందంటుంది.

వీరి డెబ్యూ ఆల్బమ్ 'వివా' (టైమ్స్ మ్యూజిక్ - 65 రూ.లు) హాట్ కేక్స్‌లా అమ్ముడుపోతోంది. తొలి సింగిల్ 'హమ్ నయే గీత్ సునాయే' అద్భుతంగా ఉందంటున్నారు విమర్శకులు. ఆ పాటకు సంగీతం సమకూర్చినది - శంకర్, ఎహ్‌సాన్, లాయ్. ఇది కాక మిగతా ఏడు ట్రాక్స్‌కు సంగీతం



# విజయవిహారం చేస్తున్న వివా

ఇచ్చినవారిలో - రాజూ సింగ్, సందీప్ చౌతా, జతిన్-లలిత్ ఉన్నారు.

ఈ ఆల్బమ్‌కు ఒక గంభీరత సమకూరినది జావేద్ అఖ్తర్ గీతాల వల్లన అంటే అతిశయోక్తి కాదు. యువతరం ఆశలు, ఆశయాలు ప్రతిబింబించేట్లా రాయాలనే ఉద్దేశ్యంతోనే వివాకు పాటలు సమకూర్చానని ఒక ఇంటర్వ్యూలో అన్నారాయన. 'పాటలు పాడే ఆ అయిదుగురు అమ్మాయిలను కలిసి, మాట్లాడాక వారి నోటి వెంట ఎలాటి గీతాలు వస్తే సబబుగా ఉంటుందో అలాగే రాసాను. ఉదాహరణకి - 'ముఝే జిందగీ మే దోస్త్ చాహియే, దేవ్‌తా నహీ, ముఝే ప్యార్ కిసీ కో కర్నా హై, పూజ్‌నా నహీ' అని అన్నానంటే అది ఈ నాటి యువతి భావాలను చాటిచెబుతోందని అర్థం. పాతకాలం వాళ్లలా 'పతియే ప్రత్యక్షదైవం' అనే బాపతు కాదు ఈ తరం. కొత్త తరం అంటే ఆధునికత ఉంటూనే అర్థవంతంగా ఉండాలని నా భావన' అన్నారాయన.

- కమ్యూనికేటర్ ఫీచర్స్

"వివా" ఆల్బమ్‌లో ఓ చక్కటి ప్రబోధగీతం -

## జాగో జరా

రచన - జావేద్ అఖ్తర్

సంగీతం - సులేమాన్, సలీమ్ మర్చంట్

కోయీ యే కహ్ రహా హై ఆజ్ హమ్‌సే
న హార్ మాన్‌నా కిసీ సితమ్ సే
హర్ ఏక్ బంధన్ ఆజ్ తోడ్ దో తుమ్
ఛుడాలో అప్‌నా హాథ్ ఆజ్ గమ్ సే
జాగో జరా, జాగో జరా
సవేరా హో గయా
సదియోం పురానీ హై జో యే కహానీ
తుమ్హే ఇసే హై బదల్‌నా,
తోడో జంజీరే, బదలో తక్‌దీరే
భూలూ మజబూరియా
క్యోం యే బేబసీ హై? 2
తుమ్హే అబ్ హై సంభల్‌నా
కి అబ్ జో భీ హో, జో దిల్ మే హై బోలో
యూహి రహో బేజుబాన్ ॥జాగో జరా॥
పురానీ సబ్ రీతే
న తుమ్‌సే కభీ జీతే
లౌటే నా జమానా ఫిర్ కల్ కా
నయే జో రాస్తే హై, తుమ్హారే వాస్తే హై
తుమ్హారీ హై మంజిలే
యే దునియా హై సారీ, తుమ్హారీ హై తుమ్హారీ
తుమ్ హై దునియా కీ హో మల్‌కా
జమీన్ కే నజారే, గగన్ కే సితారే
సునో సునో క్యా కహే ॥జాగో జరా॥

# ...అందుకే ఇళయరాజాగారి ట్యూన్స్‌లా ఉన్నాయి... - చక్రి



'ఔను... వాళ్ళిద్దరూ ఇష్టపడ్డారు!' ఇప్పుడు మ్యూజిక్ ఛార్ట్స్‌లో కొన్నాళ్ళుగా కదలకుండా ఒకే ప్లేస్‌లో వుంది. ఆరేళ్ళ విరామం తర్వాత మళ్ళీ సినిమా చేసిన వంశీకి మ్యూజిక్ మీద మంచి పట్టువుందని తెలియని తెలుగువాడు ఉండడు. సంగీత దర్శకుడు కూడా అయిన వంశీకి ఇళయరాజాతో వున్న సాన్నిహిత్యం గురించి కూడా ప్రత్యేకంగా చెప్పనవసరంలేదు. వీరిద్దరి కాంబినేషన్‌లో అన్నీ హిట్సే. ఇళయరాజాని తన మనసులో అణువణువునా నింపేసుకున్న వంశీ 'ఔను వాళ్ళిద్దరూ ఇష్టపడ్డారు' సినిమాకి చక్రితో మ్యూజిక్ చేయించుకున్నారు. ఈ సినిమా మ్యూజిక్ గురించి మ్యూజిక్ సర్కిల్స్‌లో డిస్కషన్ జరుగుతున్న సందర్భంగా 'చక్రి'తో 'హాసం' జరిపిన చిన్న డిస్కషన్...:



బాలు చక్రి వంశీ



☆ **ఇళయరాజాతో చేయడానికి అలవాటుపడ్డ వంశీ గారు అసలు మీ దగ్గరకి ఎలా వచ్చారు. అసలు మీ ఎంపిక ఎలా జరిగింది?**

❑ 'బాచి', 'ఇట్లు శ్రావణి సుబ్రహ్మణ్యం' పాటలు నచ్చి జెమినీ కిరణ్, వల్లూరి పల్లి రమేష్‌లు పిలిచి తమ సినిమాకి మ్యూజిక్ డైరెక్షన్ చేయమని అడిగారు. ఆ సినిమాకి వంశీగారు డైరెక్టరని అప్పుడే తెలిసింది.

'వంశీగారు ఇళయరాజా గారితో తప్ప బైటివాళ్ళతో చేయలేదు. అందుకే కష్టపడి చేసి బాగా మెప్పించాలి' అని వాళ్ళు చెప్పారు.

ఆ తర్వాతనే వంశీగారితో పరిచయం జరిగింది. అప్పటికే పూరిజగన్నాథ్ నా గురించి వంశీగారికి చెప్పారు. ఒక సిట్టింగ్ అయ్యేవరకు నేనెలా మ్యూజిక్ చేస్తానో వంశీగారికి తెలీదు.



☆ మీరు వంశీగారికి వినిపించిన ఫస్ట్ ట్యూన్ ఏది?

❐ జెమిని టీవీలో ఉగాది రోజున సినిమా గురించి 'ప్రోమో' వేయాలని చెప్పి బిట్‌సాంగ్ చేయమన్నారు నిర్మాతలు. ఆ ప్రకారం 'నాలో నేను లేనే లేను' బిట్‌సాంగ్ తయారుచేసి వంశీగారికి వినిపించాను. ఆయన కూడా ఏవో ఐడియాలు ఇచ్చారు. చివరికి ఇదే 'ఓకే' చేసారు.

☆ **ఈ సినిమాకి మొత్తం ఎన్ని ట్యూన్స్ సిద్ధం చేసుకున్నారు?**

❐ దాదాపు నెలరోజుల మ్యూజిక్ సిట్టింగ్స్‌వేసి 50 ట్యూన్స్ అనుకున్నాం. బిట్‌సాంగ్స్‌తో కలిపి అందులో పదకొండు ట్యూన్స్ ఫైనల్‌గా సెలెక్ట్ చేయడం జరిగింది.

☆ **ఈ పాటల్లో చాలా చోట్ల ఇళయరాజా చేసినట్టుగా అనిపిస్తుంది. అలా చేయమని వంశీగారు చెప్పారా?**

❐ నేను ఇళయరాజాగారికి వీరాభిమానిని. నేనే ఇన్‌స్పైర్ అయ్యి ఆయన స్టయిల్‌లో ఈ పాటలు చేసాను. వంశీగారేమో మొత్తం అలా వద్దు, ఆర్కెస్ట్రయిజేషన్‌లో నీ స్టయిల్ వుండాలని చెప్పారు. కానీ ఆ పాటలకి ఇళయరాజాగారి స్టయిల్‌లో బీజియమ్స్ వాడితేనే బాగుంటుందనిపించింది. అందుకే ట్యూన్స్‌లో రిథమ్ ప్యాటర్న్స్, కోరస్ బిట్స్ ఆయనలాగే చేసాను. అందుకేనేమో ఈ పాటలు ఇళయరాజా గారు చేసినట్టుగా అనిపిస్తున్నాయనుకోవచ్చు.

☆ **వంశీగారు కూడా మ్యూజిక్ డైరెక్టరే కదా. ఆయన్ని ఎలా ఇంప్రెస్ చేయగలిగారు?**



❐ ఈ తరంవాళ్లు యాక్సెప్ట్ చేసే కమర్షియాల్టీ నా మ్యూజిక్‌లో వుందని వంశీగారు గమనించారు. పామరుడికి ఏం కావాలో చక్రికి తెలుసు అని అంటుంటారాయన. అందుకే ఆయన సంగీత దర్శకుడైనా కూడా నా సంగీతాన్ని ఇష్టపడ్డారు.

☆ **ఈ సినిమా మ్యూజిక్ విషయంలో వంశీగారి లోని ఇళయరాజా బాగా ఉపయోగపడ్డారా లేక మీలోని ఇళయరాజా అభిమానం ఎక్కువ ఉపయోగపడిందా?**

❐ సాంగ్ ఓకే చేస్తున్నప్పుడు వంశీగారిలోని ఇళయరాజా పనిచేసి వుంటారు. నేను ట్యూన్ సిద్ధం చేసుకుంటున్నప్పుడు, పాట రికార్డ్ చేస్తున్నప్పుడు ప్రతిక్షణం నాలోని ఇళయరాజా పనిచేసి వుంటారు.

☆ **'వెన్నెల్లో హాయ్ హాయ్' పాటలో 'మే నెల్లో ఎండ హాయ్, ఆగస్ట్‌లో వాన హాయ్, జనవరిలో మంచు హాయ్' అని ప్రస్తావించారు. మీరు కూడా పాటల రచయితే కదా. మే నెలలో ఎండ, ఆగస్ట్‌లో వాన, జనవరిలో మంచు హాయిగా ఉండడాన్ని మీరెలా సమర్థిస్తారు?**

❐ కొన్ని పళ్ళు ఆ సీజన్సులోనే దొరుకుతుంటాయి. ఏ సీజన్‌లో వాటిని అప్పుడే ఎంజాయ్ చేయాలి. ఉదాహరణకి ఉసిరికాయలు వేసవిలోనే దొరుకుతాయి. అప్పుడు తింటేనే ఎంజాయ్‌మెంట్!. ఆ విధంగా ఎండాకాలంలో ఎండని, వానాకాలంలో వానని ఎంజాయ్ చేయమని ఆ పాటలో చెప్పడం జరిగింది.

☆ **'రా రమ్మని రారా రమ్మని' పాట వేరే సినిమాకి తయారుచేసిన ట్యూన్ అట నిజమేనా?**

❐ నిజమే. ఓ సినిమాకోసం వేరే రచయిత రాసిన పాటకి అల్లిన ట్యూన్ ఇది. తర్వాత ఆ ప్రాజెక్ట్ కుదర్లేదు. ఆ ట్యూన్ వంశీగారికి వినిపిస్తే బాగా నచ్చిందాయనకి.

☆ **'బాలూ గారితో పాడించాలన్నది నా కోరిక అదెప్పుడు తీరుతుందో' అని ఎన్నోసార్లు ఎన్నో ఇంటర్వ్యూలలో చెప్పిన మీరు ఆయనతో పాడించిన తర్వాత మీ అనుభవాలను ఇప్పటి వరకు ఎవరితోనూ పంచుకోకపోవటానికి కారణం?**

❐ ఈ సినిమా రిలీజయిన తర్వాత నన్నెవరు కలిశారు చెప్పటానికి!?

☆ **ఇప్పుడు మేం కలిశాంగా... చెప్పొచ్చుగా..?**

❐ వంశీగారి చలవతో బాలుగారితో పాడించాలనే నా కోరిక నెరవేరింది. బిట్ సాంగ్స్‌లో ఆయనకి మాత్రమే సాధ్యమైన కొన్ని ఎక్స్‌ప్రెషన్స్ ఇచ్చారు. వాటివల్ల పాటకే అందం వచ్చింది. బాలుగారు చాలా బిజీగా వుండటంతో ఎక్కువగా ఆయనతో మాట్లాడ లేక పోయాను.

☆ **మీ వర్కింగ్ స్టయిల్‌ని వంశీగారు మార్చేసారని చెప్పారు కదా... ఇప్పటికీ అది కంటిన్యూ చేస్తున్నారా?**

❐ కాలేజ్ ఏజ్‌లో నేను రాత్రిళ్ళే ఎక్కువ చదివేవాడిని, అలాగే రాత్రిళ్ళే మ్యూజిక్ ఎక్కువ ప్రాక్టీస్ చేసేవాణ్ణి. దాంతో రాత్రిళ్ళు వర్క్ చేయడం ఎక్కువ అలవాటు అయి పోయింది.

వంశీగారు పరిచయం కాకముందు ఉదయం 11గం॥ నుంచి రాత్రి 2గం॥ వరకూ పనిచేసే వాడిని. ఆయన నన్ను పూర్తిగా మార్చేసారు. ఇప్పుడు నన్నెవరూ వేలెత్తి చూపలేరు. ఇప్పుడు ఉదయం ఏడుగంటలకైనా నేను పనిచేయడానికి రెడీ.

☆ **ఇళయరాజాగారి పాటల్లో మీకు బాగా నచ్చినవి?**

❐ ఆయనవి అన్నీ నచ్చుతాయి.

☆ **మరి వంశీగారికి ఆయన చేసిన పాటల్లో నచ్చినవి?**

❐ 'అన్వేషణ'లో 'ఎదలో లయ' పాట.

— శ్రీ విక్రమ్

# రాజా ఆడియో రివ్యూ




విడుదల : ఆదిత్య
వెల : రూ.40/-

ఉదయ్‌కిరణ్, రిచా జంటగా యస్.వి.ఎస్. వరప్రసాద్ దర్శకత్వంలో ఎస్.పి.క్రియేషన్స్ పతాకంపై నిర్మాత ఎన్.సూర్య ప్రకాశరావు నిర్మించిన 'హోలీ' సినిమా ఆడియో క్యాసెట్ విడుదలయింది. ఆర్.పి. పట్నాయక్ ఈ చిత్రానికి సంగీత దర్శకుడు కాగా ఇందులోని పాటలన్నిటినీ కులశేఖర్ రాశారు.

తొలిగీతం - 'ఔనని అంటావో మరికాదని అంటావో' పాటని ఆర్.పి.పట్నాయక్ పాడేరు. తనలోని ప్రేమని తెలుపుతూ - ఎదుట వ్యక్తికి తనపై ప్రేమ ఉందో లేదో తెలుసుకునే ప్రయత్నంలో సాహిత్యపరంగా రకరకాల ఎక్స్‌ప్రెషన్లను పాటలో జొప్పించడమనే ప్రక్రియ వివిధ రీతులతో వచ్చేసింది. మళ్ళీ కొత్తగా ఏదైనా చెప్పాలనుకునే రచయితకు పూర్వకవుల ప్రయోగాలు అడుగడుగునా అడ్డు తగుల్తూ ఉంటాయి. ఈ పాట కోసం కులశేఖర్ ఎంత హోమ్ వర్క్ చేశాడో ఏమోగానీ పాట సాహిత్యం చూస్తే ఆ అడ్డను అతిసునాయాసంగా అధిగమించాడనిపిస్తుంది. 'ఎలా చెప్పనమ్మనాలోని ప్రేమని' అనే వాక్యానికి జతపడిన ట్యూను క్యాచీగా ఉంది. కవితా కృష్ణమూర్తి, కెకె పాడిన 'ఆడపిల్లలు... అరె లేడి పిల్లలు' పాటలో పల్లవి ఎంత హుషారుగా ఉందో చరణాలకు కూర్చిన ట్యూన్ అంత మెలోడియస్‌గా ఉంది. 'హంస నడక నేర్చుకున్న చేప పిల్లలు' అనే ఎక్స్‌ప్రెషన్ బావుంది.

కెకె, సాధనా సర్గమ్ పాడిన 'ఓ చెలియా నా చెలియా నేలకు వచ్చిన దేవకన్యవా' పాట గురించి చెప్పుకోవలసింది చాలానే ఉంది. పాట టేకాఫ్ ఇటీవల విడుదలైన 'జయం' సినిమాలోని 'వీరివీరిగుమ్మడి పండు వీరి పేరేమి' పాట టేకాఫ్‌ని గుర్తు చేస్తుంది. ఈ ట్యూన్ కూడా పట్నాయక్‌దే కనుక ఇంతవరకు నో ప్రాబ్లెమ్. పల్లవిలో గల 'ఓ చెలియా నా చెలియా నేలకు వచ్చిన దేవ కన్యవా ఓ సఖియా నా సఖియా పున్నమి వెన్నెల కాంతి రేఖవా' అనే వాక్యాల దగ్గర జతపడిన ట్యూన్ వినగానే ఇటీవల విడుదలయిన 'కనులు మూసినా నీవాయె' చిత్రం కోసం సంగీత దర్శకుడు చక్రి చేసిన 'తొలకరివా చిరుసడివా' అనే లైను గుర్తొస్తుంది. నిజానికి ఇలాంటి సిట్యుయేషన్ సక్సెస్‌లో ఉన్న ఏ సంగీత దర్శకుడికైనా ఇబ్బందే. ఇదే విషయమై 'హాసం' ఫోన్ చేసి అడిగితే - 'కనులు మూసినా నీవాయె' ఆడియో రిలీజయే రోజుకి 'హోలీ' లోని ఈ పాట చిత్రీకరణ కూడా అయిపోయింది. ఎవ్వరూ వెనక్కి రాలేని పరిస్థితి' అంటూ జవాబిచ్చారు ఆర్.పి.పట్నాయక్. ఇక ఈ పాటలోని చరణాలను పాడు కుంటూ 'ఓ చెలియా నా చెలియా' అనే పల్లవిని కాకుండా 'నువ్వు - నేను' సినిమాలోని 'ప్రియతమా ఓ ప్రియతమా' అనే పాటను కూడా అందుకోవచ్చు.

ఆర్.పి.పట్నాయక్, సాధనా సర్గమ్ పాడిన 'నీ మనసు నాకు తెలుసు' అనే పాటకి ఆయుః ప్రమాణం ఎక్కువ. పట్నాయక్ తన ఆల్‌టైమ్ హిట్స్ లోకి చేర్చుకోదగ్గ పాట యిది. సినిమాకి ఒక్కపాటయినా ఇలాంటిదొక ఉండేట్టు చూసుకుంటే చాలు. అది విమర్శల వానకి గొడుగులా పనికొస్తుంది. సునీతారావు పాడిన 'ఛమకు చమతళుకులదీ ప్రేమా' పాట ఓ వెరయిటీ ట్యూన్. 'ఆనందం' సినిమాలోని 'ఒక మెరుపు మెరిసె నయనంలో' (సంగీతం దేవిశ్రీ ప్రసాద్, గానం సునీతారావు) అనే పాటకి ఈ పాటకి ఎంతో వ్యత్యాసం వున్నా చరణాల ఎత్తుగడలో ఉన్న చిన్న పోలిక ఆ పాటని గుర్తు చేస్తుంది. ఆ మాత్రం కూడా గుర్తు రాకుండా చేయటం అంత కష్టమైన విషయమేం కాదు. ఈ విషయంలో పట్నాయక్ కొంచెం జాగ్రత్త వడి ఉండాల్సింది. ముందు పేరాల్లో మనవి చేసినట్టు - సక్సెలు పెరిగి ఎత్తుకు ఎరుగుతున్న కొద్దీ ఒద్దనుకున్నా సరే గమనించే వారి సంఖ్య పెరుగుతూ ఉంటుంది.

'లైఫ్ ఈజ్ బ్యూటీఫుల్' అనే పాటను ఉదయకిరణ్ పాడటం వల్ల సెపరేట్ క్రేజు వచ్చింది. అయితే ఉదయ్‌కిరణ్‌తో పాటు పట్నాయక్‌కి కుడిభుజం అని చెప్పుకోదగిన అనూప్‌కూడా గొంతు కలపడం వలన కొంతమంది శ్రోతలవైపునుండి ఉదయ్‌కిరణ్‌కి సోలో క్రెడిట్స్ దక్కే అవకాశాలు తక్కువ.

'చింతామణి సిగ్గుపడింది, ఊరంతా చిన్నపోయింది' పాట పట్నాయక్ మార్క్ ఫోక్‌సాంగ్. ఈ పాటను పట్నాయక్, సునీల్ పాడేరు. ఇలాంటి పాటల విషయంలో గాత్ర ధర్మంతో సహా పట్నాయక్ స్పెషల్ మార్కులు కొట్టేస్తాడు. కనుక ఆయన గురించి ప్రత్యేకించి చెప్పనవసరం లేదు. ట్యూన్‌కి టోన్ నప్పకపోయినా సరే పాడే పద్ధతిలో 'సునీల్ మార్క్ ఇంటోనేషన్' పాటకు జీవన్‌టోన్‌లా ప్రత్యేక బలాన్ని చేకూర్చింది.

**రచన: సాయి శ్రీహర్ష** **1** **గానం : చక్రి**

హాయ్ హాయ్ (2)
ప: వెన్నెల్లో హాయ్‌హాయ్ మల్లెల్లో హాయ్‌హాయ్ వరాలజల్లే కురిసే
తప్పెట్లో హాయ్‌హాయ్ ట్రంపెట్లో హాయ్‌హాయ్ ఇవాళ మనసేమురిసే
మేనెల్లో ఎండ హాయ్ ఆగష్టులో వాన హాయ్
జనవర్లో మంచు హాయ్ హాయ్‌రామా
హాయిగుంటే చాలునండీ వేయిమాటలెందుకండి ॥వెన్నెల్లో॥
చ: కనుల ఎదుట కలల ఫలము నిలిచినది తందానా సుధ చిందేనా
కనులు కననీ వనిత ఎవరో మనకు ఇక తెలిసేనా మది మురిసేనా
తనను ఇక ఎల్లాగైనా కళ్ళారా నే చూడాలీ
పగలు మరి కల్లోనైనా ఎల్లోరాతో ఆడాలి
మధుర లలనా మదన కొలనా కమల వదనా అమల సదనా
వదల తరమా మదికి వశమా చిలిపితనమా చిత్రమైన బంధమాయె అంతలోన
అంతులేని చింతనా అంతమంటు ఉన్నదేనా ॥వెన్నెల్లో॥
చ: గదిని సగము పంచుకుంది ఎవరు అనుకోవాలీ ఏం కావాలీ
మదిని బరువూ పెంచుకుంటూ ఎవరికేం చెప్పాలీ ఏం చేయాలీ
అసలు తను ఎల్లా ఉందో ఏం చేస్తుందో ఏమోలే
స్నేహలు మనిషైనా కూడా మనకేముందీ మామూలే
కళలు తెలుసా ఏమో బహుశా కవిత మనిషా కలలహంస
మనసు కొంచెం తెలుసుకుందీ కలిసిపోయే మనిషిలాగ
మంచి పద్ధతంటు ఉంది
మదిని లాగుతున్నదీ ఎంత ఎంత వింతగున్నదీ ॥వెన్నెల్లో॥

**రచన: చంద్రబోస్** **2** **గానం : యస్.పి.బాలు, కౌసల్య**

ఆ: రా రమ్మని రారా రమ్మని (2) రామచిలుక పిలిచెను ఈ వేళ
అ: అల్లరి వెల్లువగా చల్లని పల్లవిగా మల్లెల పల్లకిగా రానా
ఉక్కిరి బిక్కిరిగా మిక్కిలి మక్కువగా చుక్కల పక్కలకుగొని పోనా
ఆ: లే లెమ్మని లేలే లెమ్మని లేతగాలి తాకెను ఈ వేళ
మాటలకందని ఊసులతో మనసే నిండిన దోసిలితో
అ: ప్రేమించుకోనా ప్రతిజన్మలో కొత్త జన్మందుకోనా నీ ప్రేమలో
ఆ: విహరించనా నీ హృదయాలయంలో ॥రా రామ్మని॥
చ/అ: పెదాల్లో ప్రథమ పదము నువ్వే ఎదల్లో తరగని గని నువ్వే
ఆ: జగంలో అసలు వరము నువ్వే జనాల్లో సిసలు దొరవు నువ్వే
అ: అణువణువున నాలో నువ్వే అమృతమే చిలికావే
ఆ: అడుగడుగున నాతో నువ్వే అద్భుతమే చూపావే
అ: నిజంలో నువ్వు నిదర్లో నువ్వు సదా నావెంట వుండగా



**రచన: సాయి శ్రీహర్ష** **9** **గానం : ఎస్.పి.బాలు, కౌసల్య**

ప/ఆ: పొగడమాకు అతిగా చేసేయమాకు పొగడపూల లతగా
రాసినావు చాలా ఆరాతలంత నేను ఎదిగిపోలా
నువ్వనేవచ్చింది నా నోట చనువుగా పిలుపులో తడబాటు
ఆ మాట పలుకగా తెలుసుకొంటి పొరపాటు
అ: నువ్వు అంటు పిలుపు నాకెంతో నువ్వు దగ్గరైన తలపు
పరిచయాల మలుపు దాచేసుకున్న మాటలన్నీ తెలుపు
చిగురులే వేసెను ఈ కొమ్మ హాయిలుగ పువ్వులై పూసెను
ఈ జాబు చదవగ ఊహలేవో ఉదయించె ॥నువ్వు॥

**రచన: సాయి శ్రీహర్ష** **10** **గానం : ఎస్.పి. బాలు, కౌసల్య**

ప/ఆ: మదినిండుగ మంచితనం అది మమతల మంచితనం
ఒలికించిన తియ్యదనం తలవంచని నిండుదనం
చిగురించే నయనం ఫలియించే పయనం ఇక నీతో జీవనం
అ: నువు పంచిన చల్లదనం సిరిమల్లియ తెల్లదనం
సిరసొంచెను వెచ్చదనం పులకించెను పచ్చదనం
వికసించె కిరణం విరబూసే తరుణం చిందించే చందనం

**రచన: భాస్కరభట్ల రవికుమార్** **11** **గానం : రవివర్మ**

ప: నూజివీడూ సోనియా ఆడుదామా దాండియా (2)
బుంగమూతి పిల్లా నేనాగలేను మల్లా చెరువుల్లో చేపపిల్లా
నా మరదలు పిల్లా ॥బుంగమూతి॥ ॥నూజివీడూ॥
చ: హంసలా నువ్ పోతావుంటే
గుండె గుల్లయ్ పోయే పిల్లా (2)
నడుము భలే నడక భలే ముద్దులగుమ్మా పుత్తడిబొమ్మా
స్టయిల్ భలే స్మయిలు భలే చక్కెరచుమ్మా చప్పున ఇమ్మా
బంగాళాఖాతంలో వాయుగుండమై నేనూ వస్తను పిల్లో
తీరం దాటాకా ఆగమన్న ॥నూజివీడూ॥
ఆగలేను అత్తరు పిల్లో
చ: కొంటెగానువ్ చూశావంటే
కొంపమునిగిపోదా మల్లా (2)
దరికిరావే దొరికిపోవే పోకిరిపిల్లా మాపటికల్లా
మెరుపులాగా మెరిసిపోయే అల్లరిపిల్లా తొక్కుడుబిళ్ళా
నువ్వే సయ్యంటే ఆకసాన్ని ప్యాక్‌చేసి తెస్తనెపిల్లా
రాములోరి గుడికాడా తాళిబొట్టు
నీకు నేను కడతా పిల్లా ॥నూజివీడూ॥



**రచన: చంద్రబోస్** **1&6** **గానం: శాలిని, శ్రీనివాస్**

కో: వావ్‌యాయియే వాహాయాయియే(2)
ఉవ్వా ఉవ్వా ఉవ్వా ఉవ్వా..
అ: మెరీ జాన్ మెరీజాన్ సండేక సండే అనా (4)
ఆ: వెయి రాజా వెయ్ నీచెయ్యి నాపై వెయ్యి
చెయి రాజా చెయ్ నువ్వు చెయ్యాలన్నది చెయ్యి
చీకటి ఆటకు సైసై నా చీరా రైకకు బైబై
కో: భజన్ భజన్ ఇది ప్రేమ భజనరోయ్
భజన్ భజన్ నడిజామ్ భజన్ రోయ్ భజన్ భజన్
అ: సై రాణీసై నీ సరసకు వస్తాసై
ఇంటికి తలుపులు మూయ్ మూయ్
నీ ఒంటికి తలుపులు తియ్ తియ్ కో : ॥భజన్॥ ॥మేరీ॥
అ: చిమ చిమ చిమ చిరాకు సోకులు చిక్కించుకో
ఘుమ ఘుమ ఘుమ గులాబి గుత్తులు గుప్పించుకో
ఆ: భగభగ భగభగ బలంగ కౌగిలి బిగించుకో
అ: దడ దడ దడ దడ దడెక్కు దరువులు దరించుకో
ఆ: అయ్యెయ్యో కుక్కిమంచం చెయ్యమంది మోసమే
అబ్బబ్బో నాకు మొలచె మూతి మీద మీసం
అ: నవ్వొక చిలక నే గోరువంక - నీదే పలక -నేనే గిలక
తీసేయ్ తడిక పరిచెయ్ పడక -
పెధాలు మెలికవేస్తా కో: ॥భజన్॥ ఆ:॥వెయ్॥
ఆ: విరహాన్నే ఉరేసి - కులుకుల్ని కుదేసి - పన్నీరే చల్లిపోరా పక్కల్లో పడేసి
అ: మాటల్తో ఎగేసి ముద్దుల్తో దిగేసి నావాటా గుంజుకుంటా వాటంగా దిగేసి
ఆ: నువ్వొక చిలక నేగోరువంక మెచ్చాగనక వచ్చావెనక
అత్తకు కొడకా తత్తర పడక చచ్చేదాకా ఇచ్చేయ్ చురక కో: ॥భజన్ ॥
ఆ: వెయి రాజా వెయ్ నీ చెయ్యి నాపై వెయ్యి
అ: సై రాణీ సై నీ సరసకు వస్తా సైసై
ఆ: చీకటి ఆటకు సైసై నా చీరా రైకకు బైబై కో : ॥మేరిజాన్॥

**రచన: చంద్రబోస్** **2** **గానం: మనో, మాతంగి**

అ: నామీద ప్రేమ వుందని చాటుతున్నది నువ్వా..... మరినేనా
ఆ: ఊరంతా ఈ వదంతి రేపుతున్నది నువ్వా.. మరి నేనా
అ: నాకూ నీకూ లవ్వంటూ లోకమన్నది
ఆ: నువ్వు వేరు నేను వేరు ఎవ్వరన్నది? అ: ॥నామీద॥
అ: నా షర్టు బటన్‌లోన జుట్టును నువ్వు చిక్కుపెట్టి అయ్యో వదిలేయ్ అన్నావ్
ఆ: నొ నొ నొ నాకంటే నలుసు పడితే -



గూబ గుయ్యనగా బాదేస్తా దెయ్యాన్నే వదలిస్తా!
శ్రీరాముని సాక్ష్యంగా ॥వచ్చా వచ్చా॥
ఆ: అరెరెరే.. తళుకా.. బెళుకా కులుకా.. అయ్యో..
తిరగిటతోం తిరగిటతోం..
ఏంటి నువ్వు.. నాకు నువ్వు సరిసమానమా
అ: ఏయ్.... నేనో నువ్వో నువ్వో నేనో
నువ్వూ నేను చూసుకుందాం
ఆ: రంకేస్తా నిన్ను రక్కేస్తా ॥వచ్చా వచ్చా॥
అ: రెడీయా....? రెడీయా....?
ఆ: వగలాడీ.. చూస్కో నాదాడీ
అ: కమాన్ ॥వచ్చావచ్చా॥

**రచన: చంద్రబోస్** **5** **గానం: దేవన్, టిప్పు, మాతంగి**

థర్టీ సిక్స్ థర్టీ ఫోర్ థర్టీ సిక్స్ బాగుందే
24 కారెట్ బంగారం ఊగిందే
నే పెన్ను - నువ్వు పేపర్ కథ రాయకుండా వదలనులే
పగలయినా రాత్రయినా
కథ తేల్చకుండా కదలనులే నేనే నేనే నేనే
పూట పూట కొక పడుచుపిల్ల బెడ్ మేటునే
నీ బ్యూటికే లవ్ రిమోట్‌నే ॥నే పెన్ను॥
థర్టీ సిక్స్ థర్టీ ఫోర్ థర్టీ సిక్స్ బాగుందే
24 కారెట్ బంగారం ఊగిందే
మగసిరిగలవానికి తరుణులు చెల్లు చెల్లు
నీ డ్రస్సు నువ్వే విప్పేసుకోవే
ఆ ప్లేసులో నన్నే కప్పేసుకోవే
ఇండియా కార్లకు కుడిపక్క స్టీరింగ్
అమెరికా కార్లకు ఎడమపక్క స్టీరింగ్
రెంటిని నడిపే ఒడుపుందే
ఒంటిని నలిపే ఉడుకుందే
మగసిరి గలవానికి తరుణులు చెల్లు చెల్లు ॥నే పెన్ను॥
శిఖరాలలోనా ఎవరెస్టు ఇష్టం
ప్రియురాళ్ళలోనా ఎత్తంటే ఇష్టం
సుఖాలలో నేర్పిస్తా సరికొత్త సిస్టం
క్షణాలలో తీరుస్తా నీ ఒంటి కష్టం
ఫారిన్ హరికథ వినిపిస్తా ఇండియన్ రసికత చూపిస్తా
మగసిరి గలవానికి తరుణులు చెల్లు చెల్లు ॥నే పెన్ను॥

రచన: భాస్కరభట్ల రవికుమార్ **6** గానం : చక్రి, కౌసల్య

ప/అ: సీతకొక చిలుక సోయగాల చినుక ముద్దు ముద్దుగున్నవే నువ్వు
ఓసి కన్నెగోపిక తుళ్ళి తుళ్ళి పడక కొంగు ముడివేసుకో నువ్వు
ఆ: కొనికా కెమెరాలో బందిలే అవుదామా కొల్లేటి సరసుల్లో స్నానాలే చేద్దామా
ఇ: జింగిచక హొ జింగి జింగిచక ॥సీతకొక॥
చ/అ: ఓ రెక్కలు తొడిగి రివ్వున ఎగిరి నింగిని చూసేద్దామా
జాబిలమ్మను చేరి జోల పాడేద్దామా
ఆ: చేపలనడిగి మొప్పలు తెచ్చి ఈతలు కొట్టేదాము సాగరాలే దాటి సాటి లేరందాము
అ: మొదటి చూపుకే అలలా పుట్టుకొచ్చు ఈ ప్రేమా
ఆ: చివరి వరకు ఊపిరిగా తోడు ఉండదా ప్రేమా
అ: ఓ... పంచెవన్నెల చిలక రెక్కపై పచ్చ తోరణం ప్రేమ
ఆ: తామరాకుపై నీటి బొట్టులా తళుకు మంటది ప్రేమా ॥సీతాకొక॥
చ/అ: ఓ... వాన జల్లులో దోసిలి పట్టి గజగజ వణికేద్దామా
పడవల బొమ్మలు చేసీ చిటుకున వదిలేద్దామా
ఆ: చిరుతల వేగం అరువుకు అడిగి గబగబ ఉరికేద్దాము
ఊరులన్ని తిరిగి జోరు చూపిద్దామూ
అ: రెండు గుండెల నడుమా రాయబారమీ ప్రేమ
ఆ: నిండు కుండలా ఎపుడూ తొణికిపోదు ఈ ప్రేమా
అ: ఓ... ఓ... కోనసీమలో కొబ్బరాకుల ముద్దుగుంటది ప్రేమా
ఆ: అరకు లోయలో చలిపిగాలిలా కమ్ముకుంటదీ ప్రేమా ॥సీతకొక॥

రచన: సాయి శ్రీహర్ష **7** గానం : కౌసల్య

ఏమి ఈ భాగ్యమో నేస్తమా (2) నీవే నిండగా ఆ ఎండే పండగా
ఈ వేసవే కోమలం శీతలం ఆ చల్లని చంద్రుని మండలం
ఈ మందిరం సుందరం నందనం ఆ అంబరం సంబరం సంగమం
ఏమి ఈ భాగ్యమో నేస్తమా

రచన: సాయి శ్రీహర్ష **8** గానం : ఎస్.పి.బాలు, కౌసల్య

ప/ఆ: ఎన్నెన్నో వర్ణాలు అన్నింట్లో అందాలు (2) ఒకటైతె మిగిలేది తెలుపేనండి
నలుపేమో నాకిష్టం మీ మనసు మీ ఇష్టం నాకోసం మీ ఇష్టం వదలద్దండి
మీ మది తొందర చేసే బాటను వీడక మీరు సాగిపోండికా
ఇదే ఇదే నా మాటగా పదేపదే నా పాటగా ॥ఎన్నెన్నో॥
అ: నేనంటు ప్రత్యేకం నాదంటు ఓలోకం పడలేను ఏ జోక్యం అంతేనండి
బాగుంది మీ టేస్టు నాకెంతో నచ్చేట్టు మనసెంతో మెచ్చేట్టు మీ మీదొట్టు
అందుకే నే దిగివచ్చా వంచని నా తల వంచా స్నేహభావమా (2)
కలానిజం నీకోసమే అనుక్షణం ఉల్లాసమే ॥నేనంటు॥



ఆ: యిదేగా ప్రేమపండుగ ॥రా రమ్మని॥
చ/ఆ: ఫలించే పడుచు ఫలము నీకే జిగించే కౌగిలి గిలి నీకే
అ: సుమించే సరస కవిత నీకే శ్రమించే చిలిపిచొరవ నీకే
ఆ: ఎదిగొచ్చిన పరువం నీకే ఏదైనా నీకొరకే
అ: నువు మెచ్చిన ప్రతిదీ నీకే నా యాతన నీకెరుకే
ఆ: సమస్తం నీకు సకాలంలోన స్వయానా నేను పంచనా
అ: సుఖిస్తాను నీ పంచన ॥రా రమ్మని॥

రచన : సాయి శ్రీహర్ష **3** గానం : యస్.పి.బాలు, కౌసల్య

ప/ఆ: ఓ నేస్తమా వేసవె వచ్చెలె కోపమల్లె, ఓ శాపమల్లె
నీరు నింపానులే నిండుగా అన్నీ నిండగా
ఎంతో పొదుపుగా వాడదాం ఎండే పండగై పాడదాం
అ: ఆ స్వర్గమే నేలపై ఇల్లుగా చేసినారు వేంచేసినారు
దాన్ని చూడాలిగా చక్కగా మెరిసే చుక్కగా
మీ చేతలో అద్భుతం ఉంది చేతిలో అమృతం

రచన: సీతారామశాస్త్రి **4** గానం : సందీప్, కౌసల్య

ప/అ: నాలో నేనూ లేనే లేనూ ఆ: ఎపుడో నేనూ నువ్వయ్యానూ
అడగక ముందే అందిన వరమా అలజడి పెంచే తొలి కలవరమా
ప్రేమా ప్రేమా యిది నీ మహిమా (2)
ఆ: మొన్నా నిన్నా తెలియదె అసలూ (2)
మదిలోన మొదలైన ఈ గుసగుసలు ఏం తోచనీకుంది తీయని దిగులు
రమ్మని పిలిచే కోయిలస్వరమా కమ్మని కలలే కోరిన వరమా
ఎందాక సాగాలి ఈ పయనాలు ఏచోట ఆగాలి నా పాదాలు ॥నాలో నేనూ॥
అ: ఎన్నో విన్నా జంటల కథలు (2)
నను తాకనేలేదు ఆ మధురిమలూ కదిలించనే లేదూ కలలూ అలలూ
గత జన్మలో తీరని ఋణమా నా జంటగా చేరిన ప్రేమా
నా ప్రాణమే నిన్ను పిలిచిందేమో నా శ్వాసతో నిన్ను పెంచిందేమో ॥నాలో నేనూ॥

రచన: సాయి శ్రీహర్ష **5** గానం : కౌసల్య

ప: ప్రేమగెలుపు ఇది ఏమి మలుపు ప్రేమారవిందముల మనసుపిలుపు
వలరాజు బాణముల వలపు పిలుపు
ఆ ఉత్తరాలతో ఆగలేక ఈ ఉత్తరాతలో దాగలేక
ఇక చెరలు వీడవా... తెరలు తియ్యవా... (2)
తల్లడిల్లిన నన్ను చూడవా
తెల్లనైన సిరివెన్నెల జల్లున మనసే జల్లని పల్లవించవా



గది వీడిపోవు నీ జాడలే... అణగారిపోవు నా ఆశలే...!
నువు దూరమైతే ఇలా... నయనాలు సాగేదెలా...?
పలుకాడవే... చెలీ! ॥విరహమే లేక॥

రచన: చంద్రబోస్ **4** గానం: సుజాత,నిత్యశ్రీ, కమల్‌హాసన్

ఆ : ఆ...ఆ...ఆఆ..ఆ...
అ: వచ్చా వచ్చా మళ్ళీ నేనే వచ్చా!
వజ్రం లాంటి వల్లభుడికై వచ్చా!
నాలో కలనే నాతో తీసుకెళ్ళవచ్చా ॥వచ్చా॥
ఆ: ఏయ్... పోపోవే రాకాసీ ఢాకినీ శాకినీ పారిపోవే...
రామునికి మైథిలిని నేనేలే...
శంఖిణీ... లంఖిణీ... జారుకోవే
జలగకూ ఆదిశేషు జోడి కాదే...
కాఫీటీలో వాటా అంటే కోటా ఇస్తానే
నా కాపురంలో వాటా అంటే... కత్తిరిస్తానే
అరె... ముదనష్టపు వాళ్ళంతా తాకేందుకు
నా మొగుడు మున్సిపాలిటీ పంపూమరి...
వచ్చా వచ్చా మళ్ళీ నేనే వచ్చా
నాలో కలనే నాతో తీసుకెళ్ళవచ్చా ॥వచ్చా॥
ధింతకిటధినంతోతకిట సగమరిగ సనిదనిసప
మాకూ కూడెం స్వరాలు తెల్సు...
అ : ఆ..అ...అ...ఓ...ఓ...ఏ...ఏ...ష్..ష్..(2) ఆ : అక్కడ
అయినా ఏంటి? ........ ఏంటి? అయినా ఏంటి? ఏంటి... ఏంటి?
అ: మాట్లాడకే మాట్లాడవే
ఆ: అది అక్కడ చెప్పండి
అ: పోట్లాడకే... పోట్లాడకే...
కొంచెం అందంగా ఎందుకు పుట్టానో...?
నిత్యం నేను పడ్డపాట్లూ...
సింగం ఒక్కపక్క... టైగర్ మరుపక్క
సెంటర్లో నేనేగా మేక
ఆ: అరె... నా ప్రాణాలిచ్చైనా నీ శీలం రక్షిస్తా...
నవ్వాలోయ్ శ్రీరామా...? ॥వచ్చా వచ్చా॥
ఆ: ఏ... ఏ... ఎస్కోవే... తీస్కోవే...
ఇక్కడే ఇప్పుడే చూస్కోవే!
నీ మక్కిలి విరుగునే కాస్కువే నే చుక్కామల్లి...
నువ్వు ఊసరవిల్లి పోటీ నాతోనా?

నలుసు మందు సోకుతోటే మనసే మాయం చేసావ్
అ: ఛీ ఛీ ఛీ కంటి నలుసు తీయబోతె కొంటె సైగ చేసెనెవరు నువ్వా మరినేనా
ఆ: లొంగదీసినది ఎవరు? అ: ఎవరు ఆ: నువ్వా నేనా
అ: లొంగిపోయినది ఎవరు ఆ: ఎవరు అ: నువ్వా నేనా
ఆ: చిలిపి చిలిపి గొడవలోంచి వలపు పుట్టెనే
అ: వలపనేది నిన్ను నన్ను ఒకటి చేసెనే
ఆ: నీమీద ప్రేమ వుందని చాటుతున్నది నువ్వా మరి నేనా
ఆ: హోటల్లో ఫోర్త్‌ఫ్లోరుకు లెఫ్ట్‌రైట్ కొట్టమంటే - లిఫ్ట్‌లో పోదాం అన్నావ్
అ: నొ నొ నొ నొ నొ నొ లంకంత లిఫ్ట్‌లోన - బోలెడంత చోటు వుంటే
నన్నే తగులుతూ నిలిచావ్
ఆ: ఛీ ఛీ ఛీ ఛీ ఛీ లిఫ్ట్ తలుపు తెరవకుండ
లిప్పు లిప్పు కలిపెనెవరు నువ్వా మరినేనా
ఆ: సరసమాడినది ఎవరు అ: ఎవరు ఆ: నువ్వా నేనా
అ: సహకరించినది ఎవరు ఆ: ఎవరు అ: నువ్వా నేనా
ఆ: నాకూ నీకూ లవ్వంటూ లోకమన్నది
అ: లోకమన్న మాటల్లో అర్థమున్నది
ఆ: నీమీద ప్రేమవుందని చాటుతున్నది నువ్వా మరినేనా
అ: ఏ... ఊరంతా ఈ వదంతి రేపుతున్నది నువ్వా మరినేనా
ఆ: నాకూ నీకూ లవ్వంటూ లోకమన్నది
అ: నువ్వు వేరు నేను వేరని ఎవ్వరన్నది - నామీద ప్రేమవుందని
చాటుతున్నది నువ్వా మరినేనా

రచన: భువనచంద్ర **3** గానం: కమల్‌హాసన్

అ: విరహమేలేక కవితలేరావు...
కవుల హృదయాలలో!
పూవురాలాకె పిందెపుడుతుంది...
ప్రకృతి పూదోటలో!
నన్ను కవినే చేస్తావో... ప్రేమ ఫలమై వస్తావో...
కలహాల ప్రేయసీ... ॥విరహమే లేక॥
నా చెలి నువ్వే నన్ను విడిపోతే...
హృదయమే సూన్యమాయే
కన్నులగంగె పొంగులువారీ... పానుపే ద్వీపమాయే...
ఒకనాడు నేను కృష్ణున్నైనా...
మనువాడినాక రామున్నేగా...!
ఓ సీతా... నువు చెబితే ఈ రాముడు నీ... కోసం నిప్పుల్లో స్నానించడా...
చూసినవన్నీ నిజమనుకుంటే బ్రతకనే లేము చెలియా!
తాడును చూసీ పామనుకుంటే... నిదుర పోలేము సఖియా...!

# వంశీ ఔను...వాళ్ళిద్దరూ ఇష్టపడ్డారు!

వల్లూరిపల్లి రమేష్    చక్రి

పాఠక పుస్తక ప్రియులకోసం
సినీ సంగీత విశ్లేషకుడు
**'రాజా'**
పర్యవేక్షణలో **'హాసం'** అందిస్తున్న
ప్రత్యేక కానుక ఇది.



వంశీ



సీతారామశాస్త్రి



చంద్రబోస్



భాస్కరభట్ల రవికుమార్



సాయిశ్రీహర్ష

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| సంగీతం | : చక్రి |
| పాటలు | : సిరివెన్నెల సీతారామశాస్త్రి<br>చంద్రబోస్, సాయిశ్రీహర్ష<br>భాస్కరభట్ల రవికుమార్, |
| కథ | : విశ్వనాథ్ |
| మాటలు | : శంకరమంచి పార్థసారధి |
| కెమెరా | : రాజేంద్రప్రసాద్.కె |
| ఎడిటింగ్ | : బుల్లిరెడ్డి |
| ఆర్ట్ | : సత్యనారాయణ |
| డాన్స్ | : స్వర్ణబాబు, శంకర్ |
| స్టిల్స్ | : రఘు |
| కో-డైరెక్టర్ | : మద్దిరాల |
| సమర్పణ | : ఆనంది ఆర్ట్ క్రియేషన్స్ |
| అసోసియేట్ డైరెక్టర్ | : ఎమ్.ఎస్. శ్రీనివాస్ |
| అసిస్టెంట్ డైరెక్టర్స్ | : పి. చిన్న, గోపిన కరుణాకర్ |
| మేకప్ | : సతీష్ |
| కాస్ట్యూమ్స్ | : గణపతి |
| ప్రొడక్షన్ మేనేజర్స్ | : రాజశేఖర్, కుమారస్వామి |
| అసిస్టెంట్ ప్రొడక్షన్ మేనేజర్స్ | : కొండా వెంకటేష్, కరుణాకర్ |
| నిర్మాత | : వల్లూరి పల్లి రమేష్ |

స్క్రీన్‌ప్లే - దర్శకత్వం : వంశీ



చక్రి

## తారాగణం

రవితేజ, కళ్యాణి, ప్రసన్న,
కోటశ్రీనివాసరావు, తనికెళ్ళభరణి,
ఎమ్మెస్ నారాయణ, మల్లిఖర్జునరావు,
జీవా, జయప్రకాష్ రెడ్డి, సూర్య, ఉత్తేజ్,
శివారెడ్డి, కృష్ణభగవాన్,
కొండవరపు లక్ష్మణరావు,
ద్రాక్షారామ సరోజ, గోధూరి మురళి,
సాయి, ఎన్.వి. సుబ్బారావు

హాసం   ఔను...వాళ్ళిద్దరూ ఇష్టపడ్డారు!   4    5   ఔను...వాళ్ళిద్దరూ ఇష్టపడ్డారు!   హాసం



ఎడిటర్ మోహన్

# పంచ5తంత్రం



ఎడిటర్ మోహన్
సమర్పించు

మహాలక్ష్మి ఇమేజింగ్
అండ్
ఎంటర్‌టైన్‌మెంట్స్ లిమిటెడ్

కె.యస్.రవికుమార్ దేవా ఆర్థర్ ఎ.విల్సన్

PRODUCED BY MAHALAXMI IMAGING AND ENTERTAINMENTS LTD

పాఠక పుస్తక ప్రియులకోసం
సినీ సంగీత విశ్లేషకుడు
**'రాజా'**
పర్యవేక్షణలో **'హాసం'** అందిస్తున్న
ప్రత్యేక కానుక ఇది.



భువనచంద్ర



చంద్రబోస్

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| కథ | : కమల్‌హాసన్ |
| మాటలు | : వెన్నెలకంటి |
| పాటలు | : చంద్రబోస్, భువనచంద్ర |
| సంగీతం | : దేవా |
| కళ | : సాబు సిరిల్ |
| ఫైట్స్ | : విక్రమ్ ధర్మా |
| డాన్స్ | : బృంద |
| కెమెరా | : ఆర్థర్. ఎ. విల్సన్ |
| పబ్లిసిటీ | : లంక భాస్కర్ |

స్క్రీన్‌ప్లే - దర్శకత్వం : కె.యస్. రవికుమార్

## తారాగణం

కమల్‌హాసన్,
సిమ్రాన్, రమ్యకృష్ణ, సంఘవి, దేవయాని,
జయరాం, రమేష్ అరవింద్,
కైకాల సత్యనారాయణ, నాగేష్,
విజయ్‌కుమార్, మణివణ్ణన్, శ్రీమాన్,
కె.యస్. రవికుమార్, యూగీ సేతు,
రమేష్‌ఖన్నా, ఊర్వశి, ఐశ్వర్య,
కోవైసరళ, డబ్బింగ్ జానకి, విద్య

# పుష్కరాలకి, మహానాడుకి వచ్చేంత జనం ఓ మ్యూజిక్ ప్రోగ్రామ్‌కి రావటమనేది ఫస్ట్‌టైమ్

## ఆర్పీ పట్నాయక్



**'జయం', 'శ్రీరామ్', 'అల్లరి రాముడు', 'హోలీ' హిట్ ఆల్బమ్స్‌తో తన స్థానం చెక్కుచెదరనిదని నిరూపించుకున్నారు యువ సంగీతదర్శకుడు ఆర్పీ పట్నాయక్. జూలై 20న వైజాగ్‌లో గ్రాండ్‌గా మ్యూజిక్ షో నిర్వహించిన పట్నాయక్‌ని తన సొంత స్టూడియో అయిన 'సంగీత్ ప్రాడిజీ'లో కలిసింది 'హాసం'. ఈ సందర్భంలో 'హాసం' ప్రశ్నలకు పట్నాయక్ తనదైన శైలిలో సమాధానాలిచ్చారు.**




☆ **ఆరులక్షల మంది హాజరైన ఆ మ్యూజిక్ షోని ఎలా ఆర్గనైజ్ చేయగలిగారు?**

❐ నిజం చెప్పాలంటే మేం లక్షన్నర మందిని ఎక్స్‌పెక్ట్ చేసాం. సెక్యూరిటీ ఏర్పాట్లు చేస్తున్న పోలీసులు కూడా అలాగే భావించారు. ఎందుకంటే 'విశాఖ ఉత్సవ్'కి వచ్చే ప్రజానీకం సంఖ్య దగ్గరి దగ్గరిగా అలాగే వుంటుందట. కానీ ఎవరూ ఊహించని విధంగా ఆరు లక్షల మంది వచ్చారు. దాంతో నిర్వహణ కొంచెం కష్టమైంది.

☆ **ఈ మ్యూజిక్ షో వైజాగ్‌లోనే చేయాలని ఎందుకనుకున్నారు. మీ ఏరియా అనా?**

❐ మా ఏరియాలో అదే పెద్ద సిటీ. నేను పోస్ట్ గ్రాడ్యుయేషన్ అక్కడే చేసాను. ఒకరకంగా అది నా సొంతవూరు లాంటిది.

☆ **ఈ ప్రోగ్రామ్‌ని సడన్‌గా ఎందుకు ఎరేంజ్ చేసారు?**

❐ సడన్‌గా కాదు. ఏడాది క్రితం నుంచి ఈ ప్రోగ్రాం చేయమని రియల్ ఎంటర్‌టైన్‌మెంట్ గ్రూప్ వారు అడుగుతున్నారు. ఎప్పటికైనా నేనా ప్రోగ్రామ్ చేయాలి. జనాలు కూడా బాగా ఎదురు చూస్తున్నారు. నావి ఎక్కువ సినిమాలు కూడా ఈ మధ్య రిలీజవడం కలిసొచ్చింది. ఈ ప్రోగ్రామ్ వల్ల ఆ సినిమాలకి కొంచెం పబ్లిసిటీ అవుతుందనే స్వార్థంకూడా వుంది.

☆ **ఈ కాన్సెప్ట్ ఎవరిది?**

❐ జి.కె. మోహన్ గారిది. స్టేజ్ డిజైనింగ్ దగ్గర్నుంచీ అంతా ఆయన ఆధ్వర్యంలో జరిగాయి.

స్క్రీన్ మీద హీరోలు రావడమనేది మాత్రం నా ఐడియా.

ఈ ప్రోగ్రామ్‌ని జెమినీ టీవీ, రియల్ ఎంటర్‌టైన్‌మెంట్ గ్రూప్ కలిసి నిర్వహించారు.

☆ **సాధారణంగా ఇటువంటి ప్రోగ్రామ్‌ని వేరే ఎవరైనా ఆర్గనైజ్ చేయాలంటే ఎంత ఖర్చవుతుంది?**

❐ కరెక్టుగా తెలీదుగానీ, ఆ ప్రోగ్రామ్‌కి 45 నుంచి 50 లక్షల వరకూ ఖర్చు అయ్యుండొచ్చని నా అంచనా. నాకైతే మాత్రం పారితోషికంగా లక్షరూపాయలిచ్చారు.

☆ **ఇది కమర్షియల్ షోనా?**

❐ కాదు. ఫ్రీ షో. మొదట కమర్షియల్ షోగానే ప్లాన్ చేసారు. అయితే నా పొటెన్షియాల్టీ ఏమిటో తెలీదు. అది తెలీకుండా ప్రోగ్రాం చేస్తే కేవలం డబ్బున్న వాళ్ళకే పరిమితమవుతుంది. పేదవాళ్ళు రాలేరు. పొటెన్షియాల్టీ తెలియాలంటే ఫ్రీ షో నే వుండాలి. ఫ్రీ షో అయితేనే వస్తానని చెప్పేసాను.

☆ **ఇంత భారీ ఎత్తున నిర్వహించిన ఈ కార్యక్రమానికి జెమినీ టీవీ చేసిన ప్రసారం తప్పితే, తక్కిన మీడియా సపోర్ట్ ఎక్కడా కనిపించలేదు. కారణం? సమన్వయ లోపం ఎక్కడుంది?**

❐ అది ఎందుకు జరిగిందో నాకూ తెలీదు. ఇది చాలా బిగ్గెస్ట్ ఈవెంట్. పుష్కరాలకి, మహానాడుకి వచ్చేంత జనం ఒక మ్యూజిక్ ప్రోగ్రామ్‌కి రావడమనేది ఫస్ట్‌టైమ్. ఇంత పెద్ద ఈవెంట్‌కి లోకల్ మేగజైన్స్ కూడా లోపలి పేజీల్లో చిన్నగా కవరేజ్ ఇచ్చాయి.



అది ఎందుకు జరిగిందో నాకూ తెలీదు. బహుశా వాళ్ళతో కమ్యూనికేషన్ ప్రాబ్లమ్ అయ్యుండొచ్చు.

☆ **మ్యూజిక్ షో జరగడం వైజాగ్‌లో ఫస్ట్ టైమా?**

❐ చాలా జరిగాయి. కానీ ఇంత హెవీ క్రౌడ్‌తో జరగడం ఫస్ట్‌టైమ్. ఈ ప్రోగ్రామ్ వల్ల ఇన్‌కమ్‌టాక్స్ రెయిడ్‌లు కూడా జరిగాయి (నవ్వేస్తూ)

☆ **ఈ స్టేజ్ షో ద్వారా మీరు తెలుసుకున్న దేమిటి?**

❐ నాకు చాలామంది అభిమానులున్నారని అర్థమైంది. నామీద వాళ్ళకెంత అభిమానమంటే ఏడుగంటలకి ప్రోగ్రామ్ ప్రారంభమవుతుందని తెలిసి కూడా నిలుచోడానికి స్థలం దొరకదని నాలుగ్గంటల నుంచే రెడీ అయిపోయారు. ఎనిమిదింపావుకి ప్రారంభమైన షో కోసం నాలుగు గంటలు నిలబడి ఎదురుచూసిన వారి అభిమానానికి పొంగిపోయాను. నా మీద ఇంత ఎక్స్‌పెక్టేషన్ వున్నందుకు చాలా ఆనందించాను. వాళ్ళ అభిమానాన్ని గుర్తెరిగి మసలుతాను. భవిష్యత్తులో స్టేజ్ షో చేస్తే ఇలాగే చేయాలనిపించింది.

☆ **మొత్తం షో లో ఎన్ని సాంగ్స్ పాడారు?**

❐ ఇరవై ఐదు పాడాము. అన్నీ నా సినిమాల్లోవే.

☆ **స్టేజ్‌కి దగ్గరే సముద్రం వుంది. ఆ హోరు వల్ల మీ షోకి ఇబ్బంది కలగకుండా సాంకేతిక పరంగా ఎలాంటి జాగ్రత్తలు తీసుకున్నారు?**

❐ సముద్రపు హోరు వల్ల 20 శాతం సౌండ్ కట్ అవుతుంది. దాన్ని డామినేట్‌చేసే సౌండ్ పెట్టుకోవాలి. అందుకనే 1,00,000 PMPO అవుట్‌పుట్‌తో సౌండ్ ఎరేంజ్ చేసాం. కాబట్టే రామకృష్ణా బీచ్‌లో ప్రోగ్రామ్ చేస్తే హుడా పార్క్ వరకూ నా సాంగ్స్ వినిపించాయి. రామకృష్ణా బీచ్ నుండి హుడాపార్క్‌కి రెండున్నర కిలోమీటర్ల దూరం వుంటుంది.

☆ **భవిష్యత్తులో కూడా ఇలాంటి ప్రోగ్రామ్స్ చేస్తారా?**

❐ కొంచెం టైమ్ తీసుకుని చేస్తాను. ఇమ్మీడియట్‌గా చేస్తే ఆ క్రేజ్ తగ్గిపోతుంది. ఈసారి విజయవాడ, తిరుపతి, కాకినాడ, రాజమండ్రి, హైదరాబాద్‌లో ఎక్కడో ఒకచోట బాగా టైమ్ తీసుకునే చేస్తాను.

☆ **ఇటీవలి కాలంలో మీరు చిన్న చిన్న అసంతృప్తులతో కూడిన వ్యాఖ్యలకు గురవు తున్నారు. ఎందుచేతనంటారు?**

❐ నామీద అసంతృప్తితో కూడిన వ్యాఖ్యానాలు రావడానికి చాలా కారణాలున్నాయి. మనం ఎదిగేకొద్దీ స్నేహితులతో పాటు శత్రువులు కూడా తయారవుతుంటారు. ఎదుగుదల చూడలేక ఈర్ష్య పడేవారుంటారు. నాకొచ్చే అన్ని సినిమాలు నేను చేయలేకపోవడం కూడా ఇందుకు కారణం కావచ్చు. నా కెపాసిటీకి ఎన్ని చేయగలనో అన్నే చేయగలనుగానీ, అంతకుమించి చేయలేను. అన్నీ ఒప్పుకుని వాళ్ళను ఇబ్బంది పెట్టడం నాకిష్టం లేదు. నేను ఒప్పుకోనివాళ్ళు అసంతృప్తికి గురవడం వాళ్ళ వెర్షన్‌లో కరెక్టే. నేను ఇళయరాజాని కాను. ఆయన ఎంతో గొప్ప డైరెక్టరు. ఆయనలాగా అన్‌ది స్పాట్ అన్నీ చేసేసి, రెండ్రోజుల్లో రీరికార్డింగ్ చేసేవారు. అంత టాలెంట్ నాకు లేదు.

☆ **ఒక సినిమా ఒప్పుకోవడానికి మీకు ప్రధానంగా కావాల్సినవి?**

❐ ప్రత్యేకంగా ఏమీ లేవు. కథలో మ్యూజిక్‌కి మంచి స్కోప్ వుండాలి. అలాగే దర్శకుడు, ప్రొడక్షన్ వేల్యూస్, హీరో.

☆ **దర్శకుని బట్టి మ్యూజిక్ మారుతూ వుంటుందా?**

❐ మెయిన్ మ్యూజిక్ మారేదే దర్శకున్నిబట్టి. ఎందుకంటే మేం ఇచ్చిన ట్యూన్ నచ్చినదీ, లేనిదీ చెప్పేది దర్శకుడే. ఉదాహరణకి తేజగారి సినిమాలో ఎన్ని సిట్యుయేషన్స్ వుంటే అన్ని ట్యూన్స్ ఇస్తాను. ఒక్క ఎక్స్‌ట్రా ట్యూన్ వుండదు. అది ట్యూన్ అవ్వడం వల్ల జరుగుతుంది. అలాగే ఎమ్మెస్‌రాజుగారు. మూడు రోజులే సిట్టింగ్స్. ఆప్షన్స్ ఏమీ అడగరు. ఒక్కొక్కరిదీ ఒక్కొక్క స్టయిల్. ఇప్పుడే చెబుతున్నాను ఎమ్మెస్ రాజుగారి 'నీ స్నేహం' బిగ్గెస్ట్ ఆడియో హిట్. 'జయం'కు కూడా నేనిలాగే స్టేట్‌మెంట్ ఇస్తే ఓవర్ ఎమోషన్ అయ్యానన్నారు. నా మ్యూజిక్ మీద కాన్ఫిడెన్స్ వుంది కాబట్టే అలా అన్నాను. అది నిజమైంది కూడా.

☆ **'ఇంద్ర' లో మీరు చేసిన సింగిల్ సాంగ్ 'అయ్యయ్యో' గురించి చెప్పండి?**

❐ 'అల్లరి రాముడు' చేస్తున్న టైమ్‌లో బి.గోపాల్‌గారు - "మణిశర్మ విదేశాలువెళ్ళారు. అర్జెంట్‌గా ఒక సాంగ్ కావాలి. అశ్వనీదత్‌గారు అడగమన్నారు. చేస్తారా" అనడిగారు. అలా చిరంజీవి గారికి పాట చేసే ఛాన్స్ రావడం అదృష్టం.

☆ **మీ గాత్రధర్మాన్ని బట్టి మీరు పాటలు ఎందుకు పాడటం లేదు... మీ గాత్రం అన్ని పాటలకి సరిపోదనే విమర్శ ఉంది?**

❐ ఆడియన్స్ తాలూకు రిసెప్షన్ బట్టి అది వుంటుంది. అన్ని పాటలూ నేనే పాడాలనేమీ లేదు. దర్శకనిర్మాతల ఒత్తిడి బట్టి అన్నీ నేనే పాడాల్సి వస్తుంది. 'సంతోషం'లో నన్ను కంపల్సరీ పాడమన్నారు. కానీ నాగార్జున గారికి నా వాయిస్ మేచ్ కాదు. అందుకే ఒక్కపాటకూడా నేను పాడలేదు.

ప్రతి పాటకి ఫస్ట్ నేనే ట్రాక్ పాడతాను. ఎందుకంటే టైమ్ కలిసి వస్తుందని. ట్రాక్ ఐదు నిమిషాల్లో పాడేస్తాను. సమస్య ఎక్కడ వస్తుందంటే నేను పాడిన ట్రాక్ విని దర్శక నిర్మాతలు నా వాయిస్సే బాగుంటుందని వుంచేయ మంటున్నారు. నేను వద్దని, వేరే వాళ్ళతో పాడిద్దామని చెప్పినా వాళ్ళు ఒప్పుకోవడం లేదు.

'జయం'లో అన్ని పాటలు నన్నే పాడమన్నారు తేజగారు. వేరే ఎవరితో పాడించినా ఆడియో రిలీజ్ చేయనన్నారు. చివరికి బలవంతంగా ఆయనకి తెలీకుండా 'ప్రేమా ప్రేమా' పాటని కె.కె.తో పాడించాను. నేను బైటి సంగీతదర్శకులకి కూడా పాడటం మానేసాను. మ్యూజిక్ డైరెక్టర్‌గా నేను బిజీ. పాటలు కూడా నేనే పాడుతూ వుంటే వేరే సింగర్స్‌కి ఛాన్స్ వుండదు. డెఫినెట్‌గా కొత్త సింగర్స్‌కి అవకాశమిస్తాను.



ఉషతో

**☆ ఈమధ్య సింగర్స్‌కోసం ప్రకటన ఇచ్చారు కదా. ఏమైంది?**

❒ చాలా అప్లికేషన్‌లు వచ్చాయి. స్క్రూటినీ జరుగుతోంది. ఇద్దరు మేల్, ఇద్దరు ఫిమేల్ సింగర్స్ దొరికినా చాలు. ఇంకా కొత్త సింగర్స్ రావాలని మాత్రం వుంది.

**☆ మీ స్వంత స్టూడియో 'సంగీత్ ప్రాడిజీ' ఎలా వుంది?**

❒ బాగుంది. నేను బిజీగా వున్నాను కాబట్టి, అది కూడా బిజీగా వుంది. టెక్నికల్‌గా ఇది One of the best Studios in India.



ఉదయ్‌కిరణ్

**☆ ఎలాంటి పాటలు పాడటానికి మీరు ఇష్ట పడతారు?**

❒ మొదట నా వాయిస్ ఆ హీరోకి సూట్ అవుతుందా లేదా చూస్తాను. తరుణ్‌కి నా వాయిస్ బాగా సూట్ అవుతుంది. నేను పాడితే తరుణ్ పాడుతున్నట్టుగా అనిపిస్తుంది. ఇప్పుడు నితిన్‌కి బాగా సూటయ్యింది. అలాగే ఉదయ్‌కి అక్కడక్కడా సూట్ అవుతుంది. ఇక చిరంజీవి, నాగార్జున, వెంకటేష్‌లకి నా వాయిస్ అస్సలు సూట్ కాదు. పాడమన్నా పాడను. 'ఇంద్ర' కోసం నేను చేసిన ట్రాక్ విని అలాగే ఉంచేద్దామన్నారు గోపాల్‌గారు, దత్తుగారు. బాగోదని చెప్పి కార్తీక్‌తో పాడించాను. ఎందుకో నా వాయిస్ అంటే దర్శక నిర్మాతలకి చాలా ఇష్టం. ఆ ఇష్టమే సమస్య అవుతుంది కూడా. నా పాట బతకాలి, నా వాయిస్ కాదు. నా పాట బతకాలంటే సింగర్ వుండాలి ఇదే ఎక్కువ నేను ఆలోచిస్తుంటాను.



తేజ, కులశేఖర్‌లతో

**☆ 'హోలీ'లో ఉదయకిరణ్‌తో పాడించడం ఎలా జరిగింది?**

❒ ఉదయ్ ఎప్పట్నుంచో పాడతానని అడుగుతున్నాడు. అయితే ఎప్పుడూ నేను ట్రై చేయలేదు. ఈ పాట కొంచెం సింపుల్‌గా వుంటుంది. ఇలాంటి సింపుల్ సాంగ్‌తో సింగర్‌గా ఇంట్రడ్యూస్ అయితే బాగుంటుందని దర్శకుడు ప్రసాద్, నేను కలిసి ఉదయ్‌తో పాడించాం. తను కూడా చాలా బాగా పాడాడు.

**☆ భవిష్యత్తులో కూడా తనతో పాడిస్తారా?**

❒ చూడాలి. తన వాయిస్‌కి సూట్ అయ్యే పాట వుంటే తప్పకుండా పాడిస్తాను.

**☆ ఈ మధ్య తేజ మాట్లాడుతూ 'జయం' సినిమాలో విలన్ పాత్రకోసం గోపీచంద్‌ను టెస్ట్ చేయమని మీకు చెప్పానని చెప్పారు. హీరోగా ఎంటర్ అయిన ఓ నటుడ్ని విలన్ ఇమేజ్ వున్న పాత్రకు సరిపోతాడా లేదన్న విషయంమీద తేజ వంటి దర్శకుడు మీకు అప్పగించిన బాధ్యతను ఎలా నెరవేర్చగలిగారు? అసలు మీకున్న నటనానుభవం ఎంత?**

❒ తేజగారు, కులశేఖర్, నేను ఉన్నప్పుడు గోపీచంద్ వచ్చి ఆ పాత్ర తాను చేస్తానన్నాడు. తేజగారు అతనిని ఎంపికచేసే బాధ్యత నాకప్పగించారు. అతనిని గట్టిగా అరవమన్నాను. అరిచాడు. ఇంకా అరవమన్నాను. అలా మూడునాలుగుసార్లు చేసిన తర్వాత ఇతను ఈ చిత్రానికి విలన్‌గా సరిపోతాడని తేజ గార్కి చెప్పాను. ఇక నాకున్న నటనానుభవం అంటారా... త్వరలోనే మళయాల చిత్రం 'కాశీ' ఆధారంగా ఓ చిత్రం తెలుగులో నిర్మిత మౌతుంది. దానిలో అతి ముఖ్యమైన పాత్రను చేస్తున్నాను. అది చూసిన తర్వాత నాకున్న అనుభవం ఏమిటో మీకే తెలుస్తుంది.

- శ్రీవిక్రమ్

# కాళహస్తి వీరయ్య

## 1900-1956

అది ఉల్లిపాలెం సంస్థానం

మహావైభవంగా వెలిగిపోతున్న రోజులు

షడ్రసోపేతమైన భోజనానంతరం... కర్పూరపు తాంబూలం వేసుకున్న రాజా వారు.... రాణీగారితో 'చతురంగ ఖేలనం'లో ఉన్నారు...

రాణీగారు కూడా.... షోగ్గా కిళ్ళీ నవుల్తూ పావులు కదుపుతున్నారు.

రాజా వారు పావులకేసీ.... తాంబూలంతో ఎర్రబడ్డ రాణీవారి పెదాలకేసీ చూస్తున్నారు.

ఘీంకారం...! రాణీగారి ఏనుగు రాజావారి బంటును చంపేసింది!

రాజా వారు చిరునవ్వు నవ్వారు!

గుర్రం సకిలించి ఏనుగుని పొట్టనెట్టేసుకుంది!

రాణిగారి పెదాల్తోపాటు - కళ్ళు ఎర్రబడ్డాయ్!

ఆలోచిస్తూ.... మంత్రితో మంత్రాలోచనం చేసి... రాజుకే ఎసరెట్టింది!

ఆటకట్టు!!! నవ్వింది రాణి!!

నవరత్నాలూ కింద రాలాయ్....

పొంచి ఉన్న బంటు... మంత్రి గుండెల్లో బల్లెం దింపేశాడు!!

ఇంతలో పసిపిల్లాడి ఏడుపు!

రాణీలేవబోయింది.

రాజా వారు - "ఆగండి ఆట మంచి రసకందాయంలో ఉంది."

పిల్లాడు ఏడుస్తున్నాడు పాలు కావాలేమో! రాణీగారు మాటమింగుతూ అంది.

దాదీ ఉందిలెండి!.... ఆడండి!! అన్నారు రాజావారు.

రాణిగారు బెంగగానే పావు కదిపింది.

అవును ఆ రోజులు అలాంటివి.

రాజులు పాలించే వారు!

రాణులు పాలిచ్చేవారు కాదు!!

పాలివ్వడానికి 'దాదు'లు ఉండేవారు.

అయితే అందరు రాణులూ అలాగే ఉండేవారని కాదు... కొంతమంది అనారోగ్యం చేత, కొంతమంది పాలు లేకా.... దాదుల చేత పాలిప్పించే వారు!!

కొంతమంది మాత్రం పాలివ్వడం వల్ల తమ సౌందర్యం దెబ్బ తింటుదన్న భ్రమలో 'మాత' శబ్దానికే దెబ్బకొట్టీ.... బిడ్డలుట్టిన గొడ్రాళ్ళల్లే ఉండేవారు.

పిల్లాడు ఏడుస్తున్నాడు!!

గుక్కపెట్టి ఏడుస్తున్నాడు!!

'దాది' పాపమ్మ 'తన' పిల్లాడికి పాలిస్తోంది!!

అవతల రాజా వారి పిల్లాడు ఏడుస్తున్నాడు!...

తన పిల్లాడికి పాలివ్వడం ఆపేసింది....

వీడు గుక్కెట్టడం ప్రారంభించాడు!

అటు వైపు రాజా వారి పిల్లాడు... ఏడుపు

ఇటు వైపు కన్నబిడ్డ.... ఏడుపు...

ఒకటి వృత్తి....

ఒకటి బాధ్యత...

ఒకటి మానవత్వం....

ఒకటి మాతృత్వం

తన పేగు తెంచుకుని పుట్టిన పిల్లాడేగా క్షమించడూ... అనుకుంటూ పరుగు పరుగున వెళ్ళి... రాణిగారి పిల్లాడి నోటికి స్తన్యం అందించింది!

ఒక ఏడుపు ఆగింది!! తను కళ్ళ నీళ్ళు పెడుతూ పసిపిల్లాడి కళ్ళు తుడిచింది పాపమ్మ...

"నేను చచ్చిపోయాను బాబు... ఆకలేసిందా నాయనా.... ఏం చేయన్నాయనా ఇద్దరి పిల్లలకి కడుపు నిండా పాలివ్వలేని దౌర్భాగ్యురాల్ని....."

పాపమ్మ పిల్లాడు ఏడుస్తున్నాడు....

మందిరంలో ఉన్న సరస్వతీ విగ్రహం కళ్ళు తెరిచింది!!

పాపడు కాళ్ళు చేతులూ తన్నుకుంటూ గుక్కెట్టి ఏడుస్తున్నాడు!!

వీణాపాణి ఒకసారి వీణ మీటింది!!

ఏడుస్తున్న పిల్లాడు టక్కున ఏడుపాపాడు. బోర్లా పడి సరస్వతీ దేవికేసి చూసాడు!!

వీణ మోగుతోంది!..... పిల్లాడు పాకుతున్నాడు!

అమ్మ విగ్రహం దగ్గరకొచ్చి!.... వెలికిలా పడుకునీ అమ్మకేసీ చూస్తున్నాడు!!

తనికెళ్ళ భరణి నటుడిగా, ఆంధ్రులంతా బాగా ఎరుగున్నారు. కొందరైతే కవిగాను ఎరుగున్నారు. కానీ సంగీతం పట్ల ఇంత అభినివేశం కలదని 'హాసం' చూస్తేనే తెలుస్తుంది.

ప్రతి సంచికలోనూ ఆయన, సంగీతజ్ఞుల గుర్చి రాయటం బాగుంటోంది. 16-30 జూన్ సంచికలో వాసా అప్పయ్యగారి సంగీతం గుర్చిరాసిన సంగతులు ఎంతో బాగున్నాయి. దానికి రెండు కారణాలు. (1)వాసా కృష్ణమూర్తి విశాఖలో ఉండటం, వైనిక విద్వాంసుడుగా ఎంతో చక్కగా వీణవాయించటమే గాక పాడటం కూడా చేసే వాడు. ఆయనంటే రాచకొండ విశ్వనాథ శాస్త్రి గారికున్న అభిమానం అపురూపం. అవన్నీ చూస్తే వాసా వారికీ వీణకీ సంబంధం ఉందనిపిస్తుంది. (2) మా చిన్నమ్మాయి డాక్టర్ పద్మినీ వీణవాయిస్తుంది. ఎఐఆర్‌లో 'ఎ'గ్రేడ్ ఆర్టిస్టు, అన్నమయ్య మీద పి.హెచ్.డి. చేసింది. తన మూలాన నేనెన్నో కచేరీల కెళ్ళి ఎందరో కచేరీలు చూశా. నాకేమీ సంగీతం అబ్బక పోయినా, గంటల తరబడి శాస్త్రీయ సంగీతం వినగలను. మా అమ్మాయి కూడా ఎన్నో ప్రయోగాలు చేసింది. వీణ, నాదస్వరం కలిపి కచేరీలు చేయటం, క్యాసెట్ ఇవ్వటం, పూర్తి తిల్లానాలతో కచేరీ చేయటం, 'మ్యూజిక్ పెయింటింగ్' అనే ప్రయోగంలో ఇద్దరు పేరున్న పెయింటర్స్ పెయింట్ చేస్తుంటే తను వీణ వాయించటం లాటివి. ఈ నిమ్మకాయ ప్రయోగం చేస్తుందేమో చూడాలి. వీణ ధనమ్మాళ్ లాగ పాడుతూ వాయించటం చేస్తుంది. దానితో ఈ ప్రయోగము చేస్తే బాగుండునని ఉంది!

-వేణుగోపాలరావు, విశాఖపట్నం

వీణా మకరందం.... పెదాలు తడిపింది.. చెవులు తడిపింది!!

కడుపు నింపింది!!

పిల్లాడు నవ్వాడు...

చదువులు తల్లీ... సంగీతవల్లీ అయిన అమ్మ ఆశీర్వదించింది!

ఆ పిల్లాడి పేరు!!

కాళహస్తి వీరయ్య...

దైవదత్తమైన సంగీతం అబ్బడం వల్ల... తంబూర, వయోలిన్, వీణ - మృదంగం వంటి అన్ని వాయిద్యాలను అమోఘంగా వాయించగల నేర్పొచ్చింది!!

ఉల్లిపాలెంలో ఉండే - నరసింహాచార్యులు వద్ద అన్నీ అభ్యసించీ అచిరకాలంలోనే విద్వాంసుడిగా పేరు పొందాడు.

వీరయ్యగారు బలిజ కులస్తులు, ఇంటిపేరు మైనంపాటి వారు.

ఉల్లిపాలెం జమిందారు గారు.... ఒకసారి వీరయ్యకి సంగీతంలో పరీక్ష పెట్టారు.

మహామహుల సమక్షంలో - అద్వితీయమైన ప్రతిభ కనపర్చి సభికుల అభినందనలందుకున్నాడు కాళహస్తి వీరయ్య....

ముచ్చటపడి పోయిన ప్రభువు...

కుర్రాడికి మూడెకరాల పొలాన్ని బహుమతిగా ఇచ్చాడు.

చదువుల తల్లి మందహాసం చేస్తే

కన్నతల్లి ఆనందంతో కన్నీరెట్టుకుంది...

కాని కాళహస్తి వీరయ్య.... ఆ మూడెకరాలనీ పేదవాడు.... గురువు అయిన నరసింహాచార్యులుకి గురుదక్షిణగా ఇచ్చేశాడు!!

ఆనందంతో కన్నీరెట్టింది చదువుల తల్లి.

'ఆహా ఎలాంటి కొడుకుని కన్నాన్రో...' అంటూ కావలించుకుని నుదుటి మీద ముద్దెట్టింది కన్నతల్లి.

కొంతకాలం వీణాచార్య సంగమేశ్వర శాస్త్రి గారి వద్ద వీణావాదన నేర్చుకుని అందులో మెళుకువలు తెలుసుకున్నారు...

సంగమేశ్వర శాస్త్రి అసలెవర్ని శిష్యులుగా చేర్చుకోరు...

చేర్చుకున్నారంటే డొక్క చిరిగిందే

డొక్క చిరిగిందంటే... 'డొక్క శుద్ధిగా విద్య అబ్బినట్టే...'

ఎడం చేత్తో వీణవాయించే స్థితి కొచ్చారు కాళహస్తి వీరయ్య.

ఈయన ప్రత్యేకత ఏమిటంటే.... ఎక్కడ సాహిత్యాక్షరాలు ఉంటాయో అక్కడే మీట్లు పడతాయ్... ఇష్టమొచ్చినట్టు మీట్లు పడితే స్వరాక్షరానికీ, సాహిత్యాక్షరానికీ భేదం ఉండదని వీరన్న గారి అభిప్రాయం.



వెంకటరత్నం నాయుడు గారు మైసూర్ చీఫ్ జస్టిస్‌గా ఉన్నప్పుడు దసరా సంబరాలకి మైసూరు మహారాజా దర్బార్‌లో ఆయన కచేరీ ఏర్పాటు చేసారు!!

ఆనాడు కాళహస్తి వీరయ్య చేసిన కచేరీకి అబ్బురపడిపోయిన మహారాజా వీరయ్యలోని సరస్వతికి పాదాభివందనం చేసీ.... "స్టేట్ విద్వాన్ ఆఫ్ మైసూర్" అని ప్రకటించి - కావాల్సినంత ధనం వసతీ ఏర్పాటుచేసి మైసూర్‌లోనే ఉండి పొమ్మన్నారు.

కానీ వీరయ్యగారికీ ఉల్లిపాలెం వదలి వెళ్ళడం ఇష్టం లేక - సున్నితంగా తిరస్కరించారు...

కాళహస్తి వీరయ్యగారు వాగ్గేయకారులు.

ఆయన రాసిన తాన వర్ణాలు చిన్న వర్ణాలు... ఆది తాళంలో సమకూర్చారు.

అఠాణ రాగంలో రాసిన వర్ణంలో "త్రిలోక నాయకుడైన ఓ కాళహస్తి పురవాసా! పంకజాక్షి అయిన అమ్మవారు నీకోసం ఎదురు చూస్తోంది.

తామస మెందుకయ్యా.... ఆమెను ఏలుకోవా" అని పల్లవి.

చరణాలలో మాత్రం బిరాన రారా గోపాలబాలా! అన్నారు.

శివునకు - విష్ణువునకు అభేదం చూపించారన్న మాట...

శ్రీకాళహస్తీశ్వరునిలో శ్రీకృష్ణుని చూసిన మహానుభావుడు కాళహస్తి వీరయ్య.

కాళహస్తి వీరయ్యగారు ధన్యాసి, అఠాణ, రాగాలలో వర్ణాలు, చక్రవాక రాగంలో ఒక కీర్తన రాశారు...

ఇందులో ఒక వర్ణం సాహిత్యం పానుగంటి రాజా వారు రాశారు. దానికి వీరన్న గారు ధన్యాసి రాగాన్ని సమ కూర్చారు.

ఉల్లిపాలెం, కాళహస్తి, పానగాలు, సంస్థానాధిపతుల చేత ఎన్నో సన్మానాలు, సత్కారాలు పొంది - సంగీతంలో తనదైన 'ముద్ర' ఉంచిన కాళహస్తి వీరయ్యగారు... 1956 ఫిబ్రవరి 10వ తేదీన - అఠాణరాగంలో 'పంకజాక్షి నీకై వేచి ఉన్నదట' అన్న కీర్తన పాడుతూ.... పరమేశ్వరుణ్ణి చేరుకున్నారు....

**-తనికెళ్ళ భరణి**

(డాక్టర్ సి.విజయలక్ష్మిగారు రచించిన 'ఆంధ్రప్రదేశ్ సంస్థానాలు - సంగీత వాఙ్మయం' చదివి, స్పందించి)

-భరణి

ఈ వ్యాసంపై అభిప్రాయాన్ని శ్రీ తనికెళ్ళ భరణికి తెలియజేయ దలచుకునే వారు

**తనికెళ్ళ భరణి,**

కేరాఫ్: "హాసం", 502, శ్రీబాలాజీ నిలయం, 13-1-212, మోతీనగర్, హైదరాబాదు - 500 018

అడ్రసుకు ఉత్తరాలు పంపాలి.

**నేను తిరుపతి వాస్తవ్యుడను. నా పేరు విద్యల నారాయణస్వామి. కర్ణాటక సంగీతము మీద చాలా శ్రద్ధ. ఏదో భగవంతుడు ఇచ్చినంతవరకు సంగీతము పాడగలను. మీ 'హాసం' 21వ సంచికలో వ్రాసిన తిరుపతి నారాయణస్వామి నాయుడుగారు మాకు తాతగారు అగుదురు. మా మేనమామ గారి పేరు విద్యల నరసింహులు నాయుడుగారు. ఈయన సుమారు 45 సంవత్సరములుగ మదరాసులోనే వుండి సంగీతమునందు 'పల్లవి విద్వాన్' అని బిరుదు వహించినారు. మా మేనమామ గారికి, తిరుపతి నారాయణస్వామి నాయుడు గారు మేనమామ అగుదురు. ఇందుబట్టి, ముఖ్యముగా నేను కోరడము యేమంటే, తిరుపతి నారాయణస్వామి కీర్తనలు స్వర సాహితముతో చేర్చి, అటువంటి సంబంధపడినవి ఉంటే దయచేసి మీరు ఒక కాపీ పంపెదరని కోరుచున్నాను. నా వద్ద మా తాతగారి కీర్తనలు 12, జావళీలు 4 వున్నవి. కీర్తనలకు స్వరసాహిత్యము లేదు. సాధారణంగా సాహిత్యము మాత్రము గలిగిన కీర్తనలు వున్నవి. మీ పత్రికలో కనబరచినట్లుగా నవరత్న రాగమాలికలోని రాగాలు చూచి చదివినాను. అవి అన్నియు సరిగ్గానే వున్నవి.**

**-వి.నారాయణస్వామి, తిరుపతి**

సీరియల్ 15

# సద్దాం ఆంటీ ఇంటి కథ

- మల్లాది వెంకట కృష్ణమూర్తి



## జరిగిన కథ

అనగనగా ఓ బామ్మ. వయసుతో సంబంధం లేని కుర్రమనసామెది. అనన్య ఆ బామ్మకు మనవరాలు. అనన్య పనిచేసే బాంక్‌లోనే ఆఫీసర్‌గా పని చేస్తున్న నిరుపమ్ అన్నయ్య వెంకటరత్నం ఓ పెద్ద ఇల్లు ఆ ఊళ్ళోనే వుందని అతి త్వరలో అది తమకు రాబోతుందని అందరితోనూ చెబుతూ వుంటాడు. లింగమయ్య అనే వ్యక్తి ఎప్పుడు ఇంటికి వచ్చినా బామ్మ అనారోగ్యం నటిస్తూ ఉంటుంది. అనన్యకు గతం చెప్పడం ప్రారంభించిన బామ్మ. పెద్దతాత వల్లభరావు వీలునామా గురించి చెబుతుంది. ఆ తర్వాత తను పెండ్లాడిన అత్తకొడుకు వెంగళ్రావు గురించి చెబుతుంది. వెంగళ్రావు తెలివి తక్కువవాడు. తప్పనిసరి పరిస్థితుల్లో బామ్మ అతన్ని పెళ్ళి చేసుకోవలసి వస్తుంది. అతను చనిపోయాడు.

ఏడో తారీకు వచ్చింది. బామ్మని అప్పటికే పాలవాడు, పేపర్ వాడు నాలుగైదు సార్లు డబ్బుడిగారు. ఇంట్లో డబ్బుల పెట్టిలో చూస్తే చిల్లు కాణీలు, పచ్చణాలు, బేడ కాసులు తప్ప నోట్లు లేవు. ఇంగ్లీష్ వాడన్నట్లు తను 'కాపర్ వీక్'కి వచ్చాననుకుంది బామ్మ.

రేడియో కొన్నప్పటి నించి దానికి లైసెన్స్ కట్టలేదు. ఇంటింటికీ ఏదో మెషీన్‌తో వచ్చి ఇంట్లో రేడియో వుందో లేదో చెక్ చేసి, అది వుండీ లైసెన్స్ తీసుకోని వారికి ఫైన్ వేస్తున్నారన్న వార్త విని వుంది.

దాంతో బామ్మ చెక్‌బుక్ తీసుకుని స్టేట్ బేంక్‌కి రిక్షాలో వెళ్ళింది. వంద రూపాయలకి చెక్ రాసిచ్చింది. ఆమె నెల నెలా ఇంటి ఖర్చుకి డ్రా చేసే మొత్తం అది. చెక్‌లోని లెడ్జర్ ఫోలియో ప్రకారం దాన్ని తెరచి చూసి చెప్పాడు క్లర్కు.

"ఇది పాస్ చేస్తే మీ అకౌంట్‌లో మినిమం

వుండాల్సిన అయిదు రూపాయలుండవు. మూడు రూపాయల ఆరణాలే వుంటాయి. మీరు మా పాత కస్టమర్ కాబట్టి ఈ చెక్ పాస్ చేస్తున్నాను. మినిమం బేలన్స్ మెయిన్ టెయిన్ చేయండి".

"అలాగే".

డబ్బు డ్రా చేసి తీసుకుని ఇంటి కెళ్ళాక ఫిక్సెడ్ డిపాజిట్ సర్టిఫికెట్లు దాచివుంచిన బట్ట సంచీని బీరువా లోంచి తీసి చూసింది. అందులో ఒకే ఒక్క సర్టిఫికెట్ మిగిలి వుంది. అయిదు వందల రూపాయల అసలు, ఆరుశాతం వడ్డీ కలిపి అయిదు వందల తొంభై రూపాయల చిల్లర నెల తర్వాత వస్తుందని ఉందందులో.

ఆ సంచీలో నిండుగా వుండే సర్టిఫికెట్లన్నిటినీ గత పాతికేళ్ళుగా కరిగించి తన పోషణకి ఖర్చు చేస్తూండటంతో అవి లేవని స్ఫురించింది. అయితే బామ్మ ఎప్పుడూ డబ్బుకి ఇబ్బంది పడకపోవడంతో ఎంతుంది, ఎంత ఖర్చయింది, ఇంకా ఎంతుండాలి, అన్న వివరాల జోలికి వెళ్ళలేదు. తన భర్త మరణానంతరం తన వాటాగా మామగారిచ్చిన నాలుగెకరాల పొలం, ఖాళీ నివేశన స్థలం, చిన్న పెంకుటిల్లు, ఆడది ఒంటరిగా నిభాయించుకోవడం కష్టం అని, అమ్మేసి, ఆ డబ్బుని ఫిక్సెడ్ డిపాజిట్స్‌లో వేసింది. ఆ రోజుల్లో నెలకి ఆవిడ ఖర్చు ఏభై రెండు రూపాయలు. వచ్చే ఆదాయం నెలకి వందపైనే కాబట్టి తన జీవితం నిశ్చింతగా వెళ్ళి పోతుందనుకుంది.

కాని తన జీవితం అంతం కాకుండానే, తన డబ్బు అంతమైందని గ్రహించిన బామ్మ మొదటి సారిగా, ఆ విషయంలో కళ్ళు తెరిచింది.

ఇదేమిటి? ఎందుకిలా అయింది? ఎక్కడొచ్చింది తేడా? అని ఆలోచించింది. టైం పాస్‌కి తన ఖర్చులు నిత్యం డైరీలో రాసుకునే అలవాటుంది బామ్మకి. ఆస్తులమ్మి తను డబ్బు బాంకులో ఫిక్సడ్ డిపాజిట్ చేసిన నెలలో ఆ నెలసరి ఖర్చు చూసింది. సన్నాలు బియ్యం బస్తా పాతిక రూపాయలు. డైరీలో గత నెల ఖర్చుని చూసింది. అక్కుళ్ళు బియ్యం బస్తా నూట ఏభై రూపాయలు. అలా మిగిలిన ఐటమ్స్‌అప్పటి - ఇప్పటి ధరలనికూడా పోల్చి చూసుకుంది.

కందిపప్పు శేరు రూపాయి పావలా - కంది పప్పు కిలో ఆరుంముప్పావలా. (కిలో శేరుకన్నా తక్కువ).

నువ్వుల నూనె వీశె రెండుంపావులా. ఇప్పుడు కిలో పదహారు రూపాయలు. వీశె కన్నా కిలో తక్కువ.

తెలగపిండి సవాశేరు పావలా. తెలగపిండి



**మీ జీతం పెంచాలని ఎప్పుడు అడగాలంటే... మీరు పోస్టు ఆఫీస్‌లో కార్డుకి బేరం ఆడినప్పుడు.**

**1వ తారీఖున కొన్న బస్ టికెట్టును మళ్ళీ జీతం వచ్చేదాకా ఉపయోగించినప్పుడు.**

**మీ కొలీగ్స్ మీకు వారానికో బట్టలసబ్బును ఫ్రీగా ఇచ్చినప్పుడు. మీ బంధువు శుభలేఖ పంపుతూ 'నువ్వు రాలేక పోయినా ఏమీ అనుకోము' అని దానిమీద రాసి పంపినప్పుడు.**

**మీరు ఫైల్‌చేసిన ఇన్‌కమ్‌టాక్స్ రిటర్న్‌ను చూసి ఆఫీసరు 'అనవసరం' అని దానిమీద రాసి రిటర్న్ చేసినప్పుడు. మీరిచ్చిన నెలజీతము చూసి మీ ఆవిడ 'ఇవి కూరలకు సరిపోతాయి మరి మిగతా ఖర్చులకి?' అని అడిగినప్పుడు.**

**సరిగ్గా ఇలాంటి స్థితిలో చిక్కుకున్న ఓ బామ్మ గారి కథకోసం ఈ సీరియల్ చదవండి.**

ఇప్పుడసలు దొరకడం లేదు. వంకాయలు వీశె అణాన్నర. వంకాయలు కిలో రూపాయి పావలా.

కోతిమార్క్ పళ్ళపొడి పాకెట్టు అర్థణా - ఫోర్‌హేన్స్ టూత్ పేస్ట్ రెండున్నర. అదనంగా బ్రష్ ఖరీదు ముప్పావలా.

ఇలా ఏ వస్తువు తీసుకున్నా, ధరలు విపరీతంగా పెరగడం గమనించింది. అట్టే పెరగని వస్తువులు రెండు. ఒకటి అరుదుగా వాడేది, ఒకటి నిత్యం వాడేది.

అవి కార్డు, అగ్గిపెట్టె.

పైగా గతంలో తనకి అవసరం లేని ఎన్నో కొత్త వస్తువులకి ఖర్చు చేస్తోందని కూడా గ్రహించింది. బొగ్గు కుంపటికన్నా, కిరోసిన్ స్టవ్ ఖరీదు. ఇత్తడి గిన్నెలన్నీ అటకెక్కించేసి ప్రెషర్ కుక్కర్ లాంటి కొత్త పాత్రలు కొంది. పాత మంచం అమ్మితే, పాతిక రూపాయలు వచ్చింది.

కొత్తది కొంటే నూట ఏభై అయింది. పాడైన పాత వస్తువుల స్థానంలో కొత్తవి కొనడంతో చాలా డబ్బు ఖర్చయిందని డైరీలన్నీ తిరగేసాక గ్రహించింది.

పైగా కొత్తగా డాక్టరు బిల్లు, మందుల ఖర్చు. తనకి జీవితాంతానికి సరిపడే డబ్బుందన్న ధీమాతో ఎలాంటి పొదుపు పాటించకుండా వస్తున్న బామ్మకి తన ప్రస్తుత ఆర్థిక పరిస్థితి అర్థం కాగానే గుండె గుభేలు మంది.

అప్పటి కింకా ఆవిడ అరవయ్యో పడిలో కూడా పడలేదు. ఇక జీవితాంతం ఎలా వెళ్ళదీయడం?

ఆవిడకి ఎంతో చిరాకేసింది. దాంతో మనశ్శాంతి కోసం, ఆ రోజుల్లో మధ్య తరగతి వాళ్ళకి లభ్యమయ్యే ఏకైక వినోదమైన సినిమా హాలుకి వెళ్ళింది. అందులో ప్రదర్శించే సినిమాకి వెళ్ళింది.

సినిమా హాలులో ఇంటర్వెల్‌లో తారస పడ్డాడాయన.

"కంకాళ్లమ్మవి కదానువ్వు?" అని.

తనని పలకరించినతన్ని వెంటనే గుర్తు పట్టలేదు బామ్మ.

"అవును. మీరెవరో పోల్చుకోలేక పోతున్నాను" చెప్పింది బామ్మ.

"నేను. నీ చిన్నప్పుడు మీ ఊళ్ళో వుండి చదువుకుంటూ, సంగీతం నేర్పించేవాడిని. రామాన్ని" స్వపరిచయం చేసుకున్నాడాయన.

"ఓ మీరా! గ్రామంగారూ.... ఐమీన్ జి.రామంగారు. నమస్కారం మాస్టారు" చెప్పింది బామ్మ చప్పున.

"రాజేశ్వ్రరావు ట్యూన్స్ బాగా చేస్తాడు" అన్నాడాయన చటుక్కున.

"రాజేశ్వరరావు ఎవరండి?"



"ఇంకెవరు? ఈ సినిమా మ్యూజిక్ డైరెక్టర్"

"ఓ"

'ఔనా నిజమేనా...

"అవునండి"

"రికార్డ్ ఇదివరకే విన్నాను. 'నేనున్నానని....' దగ్గర ఘంటసాల వాయిస్‌లోని ఆర్ద్రత గమనించావా?"

"లేదండి"

"ఈ సారి జాగ్రత్తగా విను. ఇంతకీ నువ్వేం చేస్తున్నావు?" అడిగాడు గ్రామం.

"టిటిడి లో వర్క్ చేస్తున్నాను"

"ఓ తిరుపతిలోనా?"

"ఆ టిటిడి కాదండి. ఏం తోచక తిని తిరిగి డీలాపడిపోవడం" చెప్పింది ఆమె.

"షుగరా?"

"అవునండి. కొద్దిగా హార్ట్ ప్రాబ్లం కూడా వుందన్నాడు డాక్టర్"

"మీ అన్నయ్యల్లో ఆ ఇల్లు ఇప్పుడెవరి కిందుంది?" అడిగాడు గ్రామం.

"మా పల్లెలోదా? అది మా చిన్నన్నయ్య అమ్మేసాడు".

"అదికాదు. ఇక్కడే రామ్‌నగర్‌లో ఓ పెద్ద బంగ్లా కట్టించాడు కదా మీ నాన్న?

కోర్ట్‌లో వ్యాజ్యం గెలిచి, తండ్రి స్థిర చరాస్తులు వస్తే పాడుచెయ్యక మంచి పని చేసాడన్నారు అంతా అప్పట్లో. ఆ ఇంటి గురించే నేనడిగేది".

"నేనిప్పుడు దాంట్లోనే వుంటున్నానండి" చెప్పిందామె.

"మీ వారేం చేస్తున్నారు?"

"నా పెళ్ళయిన కొత్తల్లోనే ఫ్రీడమ్ ఫైటర్‌గా మరణించారండి"



ఓ ఇంటాయన ఇల్లు అమ్మకానికి చూపిస్తూ 'ఇది అన్ని విధాలా సౌకర్యవంతమైన ఇల్లు ఉదాహరణకు గాలి ఎటు నుండి వస్తుందో తేలికగా తెలుసుకోవచ్చు. బట్టలసోపు వాసన వేస్తే తూర్పువైపునుండని, మాంసం వాసనవేస్తే ఉత్తరం వైపునుండీ, చెత్తకుండి వాసన వస్తే పడమర నుంచనీ, పేరు తెలియని చండాలమైన వాసనవేస్తే దక్షిణవైపునుంచి గాలి వీస్తుందని తెలుసుకోవచ్చు అన్నాడు.

ఈ సీరియల్‌లో ఏ సౌకర్యం చూసి బామ్మ ఇల్లు కొనడానికి ఒకతను ఎగబడుతున్నాడు? సరదాగా సాగే ఈ సీరియల్‌లో ఆ వివరాలు చూడండి.

"అవునవును విన్నాను, నీకుతోడుగా ఎవరుంటున్నారు? అన్నయ్యలు లేదా వాళ్ళ పిల్లలు..."

చిన్నగా నిట్టూర్చింది కంకాళమ్మ.

"లేదండి. నా సోదరుల్లో కొందరికి పెళ్ళి కాలేదు. కొందరికి అయినా పిల్లలు పుట్టలేదు."

"అరెరె!"

"ఇప్పుడు వాళ్ళల్లో ఎవరూ మిగిలిలేరు. అంతా వెళ్ళి పోయారు. మా నాన్న సంతానంగా నేనొక్కదాన్నే మిగిలివున్నాను ఆ ఇంట్లో"

"చాలా సంతాపకరమైన విషయం. చాలా సంతాపకరమైన విషయం"

"మరేనండి. ఎప్పుడైనా వీలుచూసుకుని రండి"

"తప్పకుండా వస్తాను. నీతోపనుంది కూడా"

ఆదివారం ఉదయం తొమ్మిదిన్నరకి వచ్చాడు గ్రామం. పాత సంగతులు, వాళ్ళ పల్లె సంగతులు కొద్దిసేపు ముచ్చటించాక చెప్పాడు.

"అమ్మాయ్! నువ్వొక్కదానివే ఇంత పెద్దింట్లో బిక్కుబిక్కుమంటూ ఉండడం దేనికి? హాయిగా ఇది అమ్మేసి చిన్న ఇల్లు కొనుక్కుని దాంట్లోకి మారచ్చు కదా"

"ఉన్న ఇల్లు అమ్ముకోవడం దేనికండి?"

"ఇదమ్మితే ఎంత లేదన్నా అయిదో పదో తక్కువగా లక్ష దాకా వస్తుంది. దాన్ని బేంక్‌లో వేసుకుని వడ్డీతో కాలక్షేపం చేస్తూ బ్రతకచ్చు కదాని"

అంతదాకా బామ్మకి తనిల్లు అమ్మాలన్న ఆలోచనే రాలేదు. అయితే ఇప్పుడు ఆర్థిక సమస్య నెత్తి మీదకి వచ్చి కూర్చుంది కాబట్టి దానికిది సరైన పరిష్కారం అన్పించింది. అయినా చూస్తూ చూస్తూ ఆ ఇల్లు అమ్మడానికి మనస్కరించలేదు.

"అలాంటి ఆలోచనేం లేదండి" చెప్పింది.

"నేను చెప్పింది ఆలోచించు. నువ్వు సరేనంటే ఎవరో ఎందుకు నేనే కొంటానిది" చెప్పాడు.

"ఆలోచిస్తానండి"

"సంగీతం మాస్టారి దగ్గర ఇంత మూటెక్కడనించి వచ్చిందను కుంటున్నావా? సంగీతం అన్నం పెట్టదని గ్రహించాక లారీల వ్యాపారంలోకి దిగాను. ఆంధ్రనించి కర్నాటక, మహారాష్ట్రలకి నా లారీలు వెళ్తున్నాయి. డబ్బుకి కటకట లేదు. రెడీకేష్"

బామ్మని చూడడానికి డాక్టర్ వచ్చారు. బామ్మ తన బ్లడ్, యూరిన్ రిపోర్ట్‌లని చూపించింది.

"ఏమ్మా, తిండి తగ్గించమన్నాగా? తగ్గించలేదా. చూడు బ్లడ్‌లో షుగర్ ఎంతుందో? ఇలా వుంటే, ఏదో రోజు కోమాలోకి వెళ్ళి పోతావు అంతే. హార్ట్‌బీట్ కూడా బాగాలేదు. వయసుకి మించిన బరువుంటే వచ్చే రోగాలివి. ఉండాల్సిన బరువు కన్నా ఎక్కువ వున్న ప్రతి కిలోకి ఓ ఏడాది ఆయుస్సు తగ్గుతుంది. తర్వాత నన్నని లాభం లేదు. గుండె మీద ఎంత లోడో తెలుసా?"

పేషెంట్‌కి చావుభయం పెడితేకాని తన మాట వినరనే పాలసీ ఆయనది. గ్రామానికి ఆ డాక్టర్ పరిచయమే. ఇద్దరూ గ్రామం కారులోనే వెళ్ళి పోయారు.

తర్వాత రెండుసార్లు వచ్చాడు గ్రామం, ఆ ఇంటిని అమ్మమని అడగడానికి. బామ్మ ఎటూ నిర్ణయించుకోలేక పోతుంది. అమ్మితే ఆర్థిక సమస్యకి అది మంచి పరిష్కారం. కాని అమ్మడానికి మనస్కరించక పోవడం.

ఇలా రెండు నెలలు గడిచాయి. మరో రెండు నెలలకే సరిపడే డబ్బు బేంక్ అకౌంట్‌లో మిగిలి



వుంది. ఏ నగ అమ్ముదామా అన్న ఆలోచన చేస్తుండగానే ఓ రోజు డాక్టర్ వచ్చి చెప్పాడు.

"చూడమ్మా, అట్రామం నాకు మంచి మిత్రుడు. సికింద్రాబాద్ క్లబ్‌లో ఇద్దరం మెంబర్లం. ఆయన మాటల్లో తనకి ఇల్లు కొనాలనుందని చెప్పాడు. లారీలు ఆపుకోడానికి బోలెడంత స్థలం వుంది. పైగా ఎటు లారీ వెళ్ళాలన్నా కర్నాటకకి, మహారాష్ట్రకి మీ ఇల్లు సెంటరట. ఒక్కదానివి. ముందు వెనక ఎవరూ లేరు నీకు. తర్వాత ఇది ప్రభుత్వం స్వాధీనం చేసుకుంటుంది. ఒకవేళ ఏ రాజకీయ నాయకుడో కబ్జా చేయకపోతే! సో, ఇంటిని అమ్మి ఆ సొమ్ముని నీ తదనంతరం ఏ అనాధ శరణాలయానికో రాసేసావనుకో. ఇటు నీకు, అటు అనాధ శరణాలయానికి ఇంకోవైపు ట్రామానికి మంచి పనే కదా ఇది...."

"ట్రామం ఎవరు?"

"ఆయనే అమ్మాయ్ సంగీతం మాస్టారి నిక్‌నేమ్"

"ఆయన నిక్‌నేమ్ గ్రామం కదా?"

"కాదు. ట్రక్కుల వ్యాపారం చేస్తున్నారు కాబట్టి ట్రామం అంటారాయన్ని అంతా."

కాసేపు బోధ చేసాడాయన. ఆయన చెప్పిందానికి సరే అంటే, ఇక పాలవాడ్ని, పచారీదుకాణం వాడ్ని రేపురా, మాపురా అని తిప్పక్కర్లేదు. జీవితాంతం ఆర్థికంగా ఓకే.

కానీ వెనకటి కథ మళ్ళీ పునరావృతమైతే? ధరలు పెరిగి తన కొచ్చే మొత్తం మింగేసేదాకా తను బ్రతికే వుంటే? అప్పుడు తనకి అమ్మడానికి ఇంకేం వుండక, ఏ ఆధారం లేక వృద్ధాప్యంలో నానా అవస్థలు పడాల్సి వస్తుంది.

అలా ధరలు పెరిగే క్రమాన్ని తను అంచనా వేయలేదు. దాని పేరు ఇన్‌ఫ్లేషన్ అని కనుక్కుంది. తన వయసు ప్రకారం ఇన్‌ఫ్లేషన్ స్లోగా ఉంటుందన్న నమ్మకం లేదు. వరద నదిలా వడి వడిగా పారచ్చు. అందులో తను ఇంకోసారి మునిగిపోతే?

ఓ రోజు గ్రామం వచ్చినప్పుడు ఆయనకి 'నో' చెప్పలేక తన మనసులోని ఆ భయాన్ని వివరించింది. ఆయన మనసులోనే నవ్వుకున్నాడు. రోగాల పుట్టయిన మనిషి కూడా నేను ఇంకొంత కాలం బ్రతుకుతాను అనుకుంటాడే కాని ఈ రోజు చస్తాను అని అనుకోడని.

"సరేలేమ్మా. తొందరేంలేదు. ఆలోచించుకో" చెప్పాడాయన.

ఆ వారంలో ఆయన ఇన్సూరెన్స్ ప్రీమియం కడుతూండగా వచ్చిందా ఆలోచన.

అలాచేస్తే - అనుకున్నాడు. ఆలోచించిన కొద్దీ అది తనకి లాభసాటి బేరం అవుతుందనిపించింది.



**ఎవరి ఇల్లు అయితే**
**చిరునవ్వులతో నిండి**
**ఉండాలనుకుంటారో ఆ ఇంటి సభ్యులకు**
**'హాసం' ప్రజెంట్ చేస్తున్న సీరియల్ ఇది.**

కంకాళమ్మకి కూడా లాభమే. వెంటనే ఆ విషయం తన లాయర్‌తో ఆ సాయంత్రమే చర్చించాడు.

"బానేవుంది. ఈ రకం అగ్రిమెంట్ చట్టార్హమే. నిజానికి ఫ్రాన్స్ దేశంలో ఎప్పటినించో ఈ తరహా అమ్మకాలు జరుగుతున్నాయి. వాటిని ఎన్ వాయేజర్ అంటారు దానర్థం 'ఫర్ వైఫ్' అని." అన్నాడు లాయర్.

లాయర్లతో చర్చించాక కంకాళమ్మ పర్సనల్ డాక్టర్ ఇంటికి వెళ్ళాడు.

"అదేమిటి, కొత్తగా మా హాస్పటల్‌కి వచ్చారు? మీ ఆరోగ్యానికి నాకు తెలిసి ఎలాంటి ఢోకా లేదు. ఆరోగ్యానికి హాని చేసే అన్ని మకారాలకి మీరు దూరమే కదా" నవ్వుతూ అడిగాడు డాక్టర్.

"నా ఆరోగ్యం గురించి కాదు. మీ పెషెంట్ ఆరోగ్యం గురించి ఎంక్వయిరీ చెయ్యడానికి వచ్చాను."

"ఎవరా పేషెంట్? కంకాళమ్మేనా?"

"అవును"

"ఏం ఇంప్రూవ్‌మెంటే లేదు. హర్‌హెల్త్ ఈజ్ ఇన్ ఏ వెరీబాడ్ కండిషన్. బ్లడ్ సుగర్ కౌంట్ ఇటీవల విపరీతంగా పెరిగింది. పైగా కేర్ తీసుకోదు ఎంత చెప్పినా."

"ఆ కండిషన్‌లోని వాళ్ళు మీ ఉద్దేశంలో ఎంతకాలం బ్రతకచ్చు ఏవరేజ్‌గా?"

"ఏవరేజ్‌గా అరవై దాటదు. మహా అయితే అరవై అయిదు"

"ఈ విషయం మీరు ఆవిడకి చెప్పారా?"

"వెళ్ళినప్పుడల్లా మొత్తుకుంటూనే వున్నాను. ఈ రోజుల్లో పేషెంట్లు డాక్టర్ మాట వినరు కదండి. డాక్టర్ భయం పూర్తిగా పోతోంది. దేనికిదంతా?" అడిగాడు.

"ఆ ఇంటి విషయంలో నాకో ఆలోచన వచ్చింది."

తన మనసులోది వివరించాడు. పూర్తిగా విన్నాక డాక్టర్ చెప్పాడు.

"మంచిఐడియా. మీరిప్పుడు ఇంటికి చెల్లించాలనుకుంటున్న లక్ష దాకా కూడా ఈ పద్ధతిలో పే చెయ్యక్కర్లేకుండానే ఇల్లు మీదవుతుంది. అది ఖాయం. అటు ఆమెకీ ఆర్థికంగా ధీమా ఏర్పడుతుంది. ఇందుకు ఆమె ఒప్పుకోవచ్చు"

"మనిద్దరం వెళ్ళి మాట్లాడదామా?"

"నేను వస్తే బావుండదు. సాక్షాత్తూ యముడుని సాక్ష్యానికి తీసుకు వచ్చారనుకుంటుంది. మీరొక్కరే మాట్లాడండి. అవసరం అయితే నన్నడిగితే, నేనావిడకి తగిన సలహా ఇస్తాను."

"సరే అయితే"

"ఏమైందీ నాకు తర్వాత కబురు చేయండి"

"అలాగే"

నెలలో ఆఖరి ఆదివారం మధ్యాహ్నం మూడు గంటలకోసం బామ్మ ఎదురు చూస్తూంటుంది. ఆ సమయంలో విజయవాడ రేడియోస్టేషన్‌నించి ప్రసారం అయే నాటకం వినడం ఆవిడకి ఇష్టం.

ఆరోజు 'కుంకుమరేఖ' అనే నాటకం ప్రసారమౌతోంది. రేడియోలో వింటూంటే, ఎంతో బావుంది. ఖంగుమనే జగ్గయ్య కంఠం ఆర్ద్రతతో నిండిన కనకవల్లి కంఠం శ్రోతల హృదయానికి





'నీ వయసులో నేను మన రాష్ట్రపతులందరి పేర్లు వరుసక్రమంలో టకటకా చెప్పగలిగేదాన్ని తెలుసా?'

'కావచ్చు మమ్మీ అయితే అప్పుడు ఇంతమంది రాష్ట్రపతులు లేరుగా?'

అసలు ఇండియాకు రాష్ట్రపతేలేని కాలంలో పుట్టిన ఓ బామ్మ కథే ఈ 'సద్దాం అంటీ ఇంటికథ'. ఆలస్యం కాకుండా ఈ సీరియల్‌లోకి వెళ్ళి నవ్వుకోండి.

ఇట్టే పట్టేసాయి.

అప్పట్లో ఈ రోజుల్లోలా ముందు ఫోన్ చేసి స్వంత అక్క ఇంటికి కూడా అపాయింట్‌మెంట్ తీసుకుని వెళ్ళే సాంప్రదాయం లేదు. ఎవరు ఎవరింటికైనా ఏ సమయంలోనైనా రావచ్చు. భోజనం వేళమించి వచ్చినా ప్రత్యేకంగా అన్నం వండి వడ్డించడం మర్యాద.

కాబట్టి గ్రామం మధ్యాహ్నం భోజనం ముగించుకుని కునుకు తీసాక బామ్మ ఇంటికి వచ్చాడు. విధి లేక రేడియో కట్టేసి, ఆయన ముందు కూర్చుంది బామ్మ.

అయితే అప్పటికే బామ్మ మనసులో ఇంటి మీద మధన ఓ కొలిక్కి వచ్చింది. దాన్ని అమ్మ దలచుకుంది.

'ఇల్లు అమ్ముతా కాని ఇంకో గంటాగిరండి. రేడియో వింటున్నాను' అని చెప్తామనుకుని నోటి దాకా వచ్చినా బావుండదని ఆగింది.

గ్రామం తను వచ్చిన పని మొత్తం వివరిస్తూంటే, బామ్మ మౌనంగా వినసాగింది. వింటున్న కొద్దీ ఆవిడకి గ్రామం మంచి అగ్రిమెంట్ కోసం వచ్చాడని అనిపించసాగింది. మొత్తం విన్నాక ఆవిడకి ఎలాంటి అనుమానం కలగలేదు. దానికి వప్పుకోవాలనీ ఉంది. అది తన అన్ని ఆర్థిక సమస్యలకు తగిన పరిష్కారం అనిపించింది.

గ్రామం చెప్పసాగాడు. **(ఇంకా ఉంది)**

# తొలితరం కమెడియన్ "ఉమర్‌ముక్రి"

రాజ్‌కపూర్ హీరోగా 'చోరీచోరీ' చిత్రం షూటింగ్ జరుగుతోంది. ఓ సందర్భంలో రాజ్‌కు చెంపదెబ్బ వేసే సన్నివేశంలో నేలకు నాలుగడుగుల ఎత్తున్న కమెడియన్ ఎన్ని రీ టేక్‌లు తిన్నా షాట్ ఓ.కె. కాలేదు. మరో వైపు రాజ్ చెంప బూరెలా ఉబ్బి పోయింది. మరో టేక్‌లోనూ ఆ కమెడియన్ సరిగ్గా చెంప దెబ్బ వేయలేదు. రాజ్‌కు కోపం వచ్చి "ఎన్ని టేకులు తింటావు తమాషాగా ఉందా?'' అని ఆ కమెడియన్‌కు చేయి చాచి ఒక్కటిచ్చుకున్నాడు. ఆ కమెడియన్ గూబగుయ్యిమంది. "ఇప్పుడు సరిగ్గా వేయి'' అన్నాడు రాజ్. అంతే ఆ కమెడియన్ చేయి జాడించి రాజ్‌కు చెంప దెబ్బ వేశాడు. ఆ దెబ్బకు రాజ్ కళ్లలో నీళ్ళు తిరిగాయి. షాట్ ఓ.కె. అయ్యింది. ఆ కమెడియన్ ఎవరో కాదు "ఉమర్ ముక్రి".

హిందీ చిత్ర రంగంలో మహానటుడు దిలీప్‌కుమార్ చేత 'పెద్దన్న'గా పిలిపించుకున్న ముక్రి. 1922 జనవరి 5న నేటి పాకిస్తాన్‌లోని లాహోర్‌లో పుట్టాడు. దిలీప్‌కుమార్‌తో కలిసి ఒకేచోట చదువుకున్నాడాయన. 1942లో జయాసర్‌హది తీసిన 'నాదాన్'లో తొలిసారిగా నటించాడు. అప్పటికే అతని బంధువు హకీం సినిమాలో ఉండేవాడు. కె.ఎ.ఆసిఫ్ వద్ద అసిస్టెంట్‌గా చేసిన తరువాత 'హమ్‌రాహీ'లో నటించాడు. అంతకుముందు "ఫూల్'' చిత్రంలో కూడా. కొంతకాలం తరువాత బాంబే టాకీస్ సంస్థలో చేరడంతో ముక్రి కెరీర్ మలుపు తిరిగింది. వారు 'ప్రతిమ' చిత్రంలో నటించే అవకాశం కల్పించారు. ఇంకా చాలాచిత్రాలకు అసిస్టెంట్ డైరెక్టర్‌గా పని చేశాడు.

బాంబేటాకీసు నుండి విడివడి ఎస్.ముఖర్జీ నెలకొల్పిన ఫిల్మిస్తాన్ స్టూడియోలో చేరాడు ముక్రి. ఏడాది తరువాత మెహబూబ్‌ఖాన్ 'అందాజ్'లో కమెడియన్‌గా మంచి పేరు తెచ్చుకున్నాడు. అనంతరం వచ్చిన "అనోఖాప్యార్"లో క్షురకుడి



సెప్టెంబర్ 4 ఉమర్ ముక్రి ద్వితీయవర్ధంతి సందర్భంగా...

పాత్రలో పండించిన హాస్యం ఆ రోజుల్లో అందరినీ అలరించింది. మళ్లీ మెహబూబ్‌ఖాన్ "ఆన్''లో "కోహినూర్'' చిత్రాల్లో కమెడియన్‌గా మంచిపేరు తెచ్చుకున్నాడు. ఇప్పటికే దిలీప్, ముక్రీలు ప్రాణస్నేహితులై పోయారు. ఒకే కంచంలో తిని ఒకే మంచంలో పడుకునేవారు. అందుకే ముక్రీని తను నటించే ప్రతి చిత్రంలోను నటించేలా చూసుకునేవారు దిలీప్‌కుమార్. ముక్రీ రాజ్‌కపూర్‌తో 'చోరీచోరీ'తోబాటు 'షౌకీన్' చిత్రంలోనూ నటించాడు.

కమెడియన్‌గా ముక్రి మంచి స్థానంలో ఉన్నప్పుడు ఒకసారి సెట్స్‌పై హీరోయిన్ వీణా ముక్రితో గొడవపడి దర్శక నిర్మాతలతో ముక్రీని సినిమాలో నుండి తొలగిస్తే గాని షూటింగ్‌కు రానంది. అప్పుడు వారు నువ్వు రాకపోతే మరో హీరోయిన్‌ను చూసుకుంటాం. కానీ ముక్రీని తొలగించం అని తేల్చి చెప్పడంతో వీణాకు దిగిరాక తప్పలేదు. ఆ రోజుల్లో ముక్రికున్న డిమాండ్ అలాంటిది.

తన 50 ఏళ్ల కెరీర్‌లో 600 చిత్రాల్లో నటించిన ముక్రి షేక్‌ముక్తార్‌తో జోడీగా నటించిన చిత్రాలు బాగా పాపులరైనవి. తెరపై ముక్రి కనిపిస్తే చాలు ప్రేక్షకులు గొల్లున నవ్వేవారు. హమ్‌దోనో, ఇనామ్, లాల్టెన్, మదరిండియా తదితర చిత్రాల్లో ముక్రి చేసిన హాస్యాభినయం ప్రేక్షకులను రంజింప చేసింది. ఇవిగాక అమర్ అక్బర్ ఆంటోని, కూలీ, నసీబ్, రామ్‌ఔర్‌శ్యామ్, హిమాలయ్‌కే గోద్ మె, కాలాపానీ, మేరాసాయా, మిలన్, అమర్, షరాబీ, తదితర చిత్రాల్లో దిలీప్, మనోజ్‌కుమార్, అమితాబ్, సునీల్‌దత్ వంటి అగ్రహీరోలతో నటించాడు. 2000 సెప్టెంబర్ 4న ముంబైలో తన 78వ ఏట గుండెపోటుతో మరణించాడాయన. చివరి రోజుల్లో వేషాలు లేక ఆర్థికంగా ఇబ్బందుల్లో వున్నా ఎవరినీ చేయి చాచి అడగ లేని అభిమాన ధనుడతను. అది తెలిసిన దిలీప్ కుమార్ బొంబాయిలో అల్లర్లు జరిగినప్పుడు పలకరించడానికి వచ్చి గుట్టుచప్పుడు కాకుండా ముక్రీ తలగడ కింద 5 వేలు ఉంచి వెళ్లాడు. వారి మధ్య ఉండే అనుబంధం అటువంటిది. తొలితరం హిందీ కమెడియన్లయిన యాకూబ్, గోప్, ఆగా, రాధాకిషన్, బూడో అద్వాని వంటి హాస్యనటుల సరసన నిలువదగినవాడు ఉమర్‌ముక్రి.

**-హెచ్.రమేష్‌బాబు**




# దటీజ్ భానుమతి...!! వై...!?

**చాలాకాలం క్రితం ఒక ఫిలిం ఫాన్స్ అసోసియేషన్ వారు వచ్చి "ఈ సంవత్సరం ఉత్తమ నటిగా మీకు అవార్డు ప్రకటిస్తున్నాం" అన్నారు భానుమతితో! దానికావిడ "వావ్!?" అంటూ ఆశ్చర్యానందాలు అభినయించలేదు. "చాలా థాంక్సండీ... ఇన్నాళ్ళ నా కృషి మీ ద్వారా ఫలించింది" అంటూ అతి వినయాలూ ప్రకటించలేదు. "యు హేవ్ గాట్ గుడ్ టేస్ట్" అని ఊరుకుంది. దటీజ్ భానుమతి...!! అటువంటి ప్రత్యేకమైన వ్యక్తిత్వం గల భానుమతి గురించి, వివిధ సందర్భాలలో ప్రతిఫలించిన ఆమె వ్యక్తిత్వం గురించి ముళ్ళపూడి వెంకటరమణ 1956లో రాసిన వ్యాసమిది...**

కోకిల పాటని అందరూ ఎందుకు బాగుందంటారు?! కోకిలకు మంచి కంఠం ఉంది. పాటలో సొగసు ఉంది. కోకిలకు ఆ కంఠాన్ని దేవుడిచ్చాడు.



ముప్ఫైఏళ్ళ క్రితం ఒకరోజున ఒంగోలులో ఒక అమ్మాయికి కూడా దేవుడు ఇలాటి వరం ఇచ్చాడు. అందుకని ఆ అమ్మాయి హాయిగా పాడేది. ఆ పిల్లపేరు భానుమతి.

----

"ఈ పాట దేశం అంతా విని ఉంటే ఎంత బాగుండేది! అనేవారు మానాన్న" అంది ఆ అమ్మాయి.

ఆ అమ్మాయి పేరు బొమ్మరాజు భానుమతి.

---

పదిహేనేళ్ల క్రితం ఒక కొత్త పెళ్లి కూతురూ, పెళ్లి కొడుకూ మధుపర్కాలు కట్టుకుని ఒక ఇంటికి వెళ్ళి తలుపు కొట్టారు. తలుపు తీసిన ఆయనకి పాదాభివందనం చేశారు దంపతులు.

"నాన్నా మమ్మల్ని దీవించు" అంది పెళ్లి కూతురు.

నాన్నగారు విస్తుపోయారు.

"నాన్నా! నాకూ, దేవుడికీ, జాతకానికీ నచ్చిన అబ్బాయి నీకు నచ్చలేదు. అయినా నీలో ఉండే ఆత్మ విశ్వాసం, పట్టుదల, నీ కూతురునైన నాకూ అణువణువునా వంటబట్టాయి. అందుకని స్వతంత్రించి పెళ్లి చేసుకున్న మమ్మల్ని మనసారా దీవించు" అంది పెళ్లికూతురు.

ఆ పెళ్లికూతురు పేరు శ్రీమతి పాలువాయి భానుమతి. ఆయన పేరు శ్రీ రామకృష్ణ.

---

"మీకు చాలా టెక్కు అంటారు"

"నామీద నాకున్న నమ్మకాన్ని, గౌరవాన్ని - అహంకారం అనే వాళ్ళకి, మోసగించే మొహమాటం, వికారపు వినయం అభినయించడానికి ఇష్టంలేక నేను నిష్కర్షగా అనే మాటలని విని తలపొగరు అని విమర్శించేవాళ్ళకి నేను చెప్పగలిగేదేం లేదు" అన్నదామె.

ఆమె నటి, గాయని, దర్శకురాలు, సంగీత దర్శకురాలు అయిన బహుముఖ ప్రజ్ఞావతి భానుమతి.

---

"నా చిన్నప్పుడు నేను ఎన్నడూ పెద్ద సినిమా స్టార్‌ని అవాలని

ఆశపడలేదు. బెంగపెట్టుకోలేదు. దేవుళ్ళకి మొక్కుకోలేదు. అసలు ఈ విషయంలో అప్పుడూ ఇప్పుడూ కూడా ఇంతే. నేను దేవుడికి నమస్కారం పెడతానుగానీ ఆశపెట్టను. అలాగే, శివుణ్ణి చూడడానికి పనిగట్టుకు కాశీవెళ్ళాలని పట్టింపులేదు. ఆయన ఎక్కడైనా, ఎప్పుడైనా ఎవరికైనా ఉంటాడు. నేనిక్కణ్ణించి నమస్కారం పెట్టగలను - ఆయన అందుకోనూగలడు'' అంది భానుమతి.

భానుమతి చిన్నతనం రోజుల్లో ఆడపిల్ల సినిమాల్లో చేరడం అంటే, "అమ్మో! ఇంకేమేనా ఉందా'' అని జనం పబ్లికున విస్తుపోయేవారు.

''నేను అలాగే అనుకునేదాన్ని'' అంది భానుమతి నవ్వుతూ.

తల్లిదండ్రుల చాటున నాలుగు గోడల మధ్య భయభక్తులతో పెరిగిన పిల్ల. సంప్రదాయాన్ని, పెద్దల ఆచారాలను గౌరవించి మన్నించడం నేర్చుకున్న అమ్మాయి.

వాళ్ల నాన్నగారు సంగీత విద్వాంసులు. తనలో తాను సన్నగా మెత్తగా పాడుకునే భానుమతి కంఠంలో ఆయనకు మంచి భవిష్యత్తు కనపడింది'' కొత్తలో ఆయన కుమార్తె పాటే కాదు "ఆ పిల్ల చాల బాగా పాడుతుంది'' అని వాళ్లూ వీళ్లూ మెచ్చుకుంటూ అన్న మాటలు స్వయంగా తను కూడా విన్నాక, వెంకటసుబ్బయ్యగారు కుమార్తె విషయంలో ప్రత్యేక శ్రద్ధవహించి సంగీతం చెప్పడం మొదలుపెట్టారు. ఆమె పాట దేశమంతా వినాలని ఆయన సంకల్పించారు.

పధ్నాలుగో ఏటనో, పదిహేనో ఏటనో ఆమెకి "వరవిక్రయం''లో నటించే అవకాశం వచ్చింది.

"పెళ్లికాని పిల్ల వేషమే'' అని చెప్పారు అడుగవచ్చిన దర్శకుడు శ్రీ పి.పుల్లయ్యగారు.

వెంకట సుబ్బయ్యగారు ఆలోచిస్తామన్నారు అప్పటికి. మర్నాటి నుంచీ భానుమతి భవిష్యత్తు మీద వాదప్రతివాదాలు జరిగాయి. అన్నయ్యలు వద్దన్నారు. శ్రేయోభిలాషులు కొందరు "శ్రేయస్సు'' అన్నారు, మరికొందరు అప్రతిష్ట అన్నారు. అమ్మ సందేహించింది. నాన్న తటపటాయించారు.

"నాన్న చెప్పినట్టు వినడం అలవాటు. అందుకని నేనేమీ అనలేదు. అప్పటికి తలవంచుకున్నాను'' అంది భానుమతి.

అలా తలవంచుకుని ఉండటం తనకలవాటు. "వరవిక్రయం'లో నటిస్తున్నపుడు సెట్సుమీద కూడా అంతే. కెమేరా అంటే ఎలా వుంటుందో కొన్నాళ్లవరకూ తెలీదామెకి.

అందరూ హేళన చేసేవారు. అలా గొర్రెలా తలవంచుకుని నిలబడతావేమని.

"మా చెల్లెళ్లు వాళ్లూ గొర్రె అని పేరు కూడా పెట్టారు నాకు... ఇది నచ్చలేదు. పెంకెఘటం అంటారంతా'' అంది భానుమతి పకపక నవ్వుతూ...

---

ఫిలింస్టారు కావాలన్న ఉబలాటంతో బయలుదేరలేదు కాబట్టి అయిన రోజున అయ్యానని మురిసిపోలేదు. గర్వంతో విర్రవీగనూ లేదు. పెద్దలు కూడా ఆమెని అన్నలకన్న, చెల్లెళ్లకన్న మిన్నగా 'స్పెషల్'గా పెంచలేదు. అందరికిమల్లేనే భయభక్తులతో క్రమశిక్షణతో పెంచి పెద్దచేశారు.

ఇలా, అన్నా చెల్లెళ్లూ, అమ్మానాన్నా, సంగీతం తప్ప ప్రపంచం ఏమిటో తెలియదు పధ్నాలుగేళ్ల భానుమతికి. ఆమెకి బొమ్మలపెళ్లిళ్లు చెయ్యడమంటే ఎంతో సరదా. తాటాకు బొమ్మలూ, కొండపల్లి బొమ్మలూ బోలెడు పోగుచేసుకునేది. వాటితోనే ఆడుకునేది. చిన్నప్పుడు ఆమె ఆశలూ కలలూ కూడా బొమ్మల పెళ్లిళ్ల పంధాలోనే ఉండేవి.

"ఎన్ని వందల బొమ్మల పెళ్లిళ్లు చేశానో'' అంది భానుమతి, ఆలోచిస్తూ



తల్లిదండ్రులు

ఎన్ని వందలలో అంచనా వేయ ప్రయత్నిస్తూ.

ఇప్పటికీ అంతే. బొమ్మలంటే ఎంతో ఇష్టం. ఏటా బొమ్మల కొలుపు పెడుతుంది ఎన్ని బొమ్మలున్నా.

"ఆయన నవ్వేవారు. ఇన్ని పనులుంటే చిన్న పిల్లలా బొమ్మల ఆటలేమిటి? అనేవారు'' అంటుందామె.

అందువల్ల నిత్యం తాటాకు బొమ్మలు కట్టుతూ, వాటికి అలంకారాలు చేయటంలో నిమగ్నమైన భానుమతికి మరో ధ్యాస ఉండేది కాదు. ఎన్నడూ ఆమె తల్లిదండ్రుల మాట జవదాట లేదు. కాదనలేదు. కాదన్నదల్లా ఒక్కసారే. అది ఆమె వివాహం విషయంలో.

"అది చిత్రమైన కథ. నాకు పవిత్రమైన కథ'' అన్నది భానుమతి.

కృష్ణప్రేమ చిత్రం తయారవుతున్న రోజులు. భానుమతి తొలిసారిగా రామకృష్ణని చూసింది. ఆయన ఆ చిత్రానికి సహాయ దర్శకుడు. ఆయనకి ఎంతసేపూ తన పనేంటో, తన లోకమేంటో మంచివాడు. ఆ మాట అందరూ అస్తమానం చెప్పుకునేవారు. అప్పుడూ ఇప్పుడూ కూడా అంతే.

ఈ మంచివాడు మంచివాడు అనే సర్టిఫికేటు పదహారేళ్ల భానుమతిని ఆకర్షించింది. క్రమంగా ఆయనమీద గౌరవభావం ఏర్పడింది. ప్రేమ అనవచ్చు, అభిమానం అనురాగం అనవచ్చు. ఏమయితేనేం, ఈ అమ్మాయి తనకి తెలియకుండా ఆ అబ్బాయిని ఆరాధించసాగింది. ఈ కృష్ణప్రేమ సంగతి రామకృష్ణకి అంతకన్న తెలియదు.

ఈ సంగతి పసిగట్టినది, పనికట్టుకు కనిపెట్టినది భానుమతి చెల్లెలు.

"ఔను కాని అక్కా.. ఒక్క సంగతి అడుగుతాను చెప్తావా?'' అంది ఒకనాడు. భానుమతి చెప్పమంది.

"నీకు తెలుసునో లేదో నాకు తెలీదుగానీ సెట్స్‌మీద నువ్వెప్పుడూ ఆ అబ్బాయికేసే చూస్తుంటావు'' అంది చెల్లెలు.

ఈ మాట నిజమైనా భానుమతికి ఈ వైనం తెలియదు.

ఆ సంగతే చెప్పింది చెల్లెలికి.

"పోస్లే నాకు తెలుసు. నేను రోజూ చూస్తూనే ఉన్నా. దొంగ దొరికింది'' అందా అమ్మాయి నవ్వుతూ.

భానుమతికి కూడా తనలో ఉన్న దొంగ ఆరోజునే దొరికింది. భానుమతి ఆ దొంగని ఎక్కడికీ పారిపోనివ్వలేదు. అలా అని ఆ సంగతి ఎవరికీ చెప్పనూ లేదు. రామకృష్ణకి కూడా.

"కాని ఎన్నాళ్లు..?... చివరికి ఒక రోజున అమ్మకి చెప్పాను. అమ్మ నాన్నకి చెప్పింది. నాన్నా నన్నడిగారు. నేను ఔనన్నాను. అమ్మానాన్న కాదన్నారు. అమ్మ చెప్పిన కారణం...'ఆయనకి ఆస్తిలేదు'' నాన్న అభిప్రాయం "పోనీ పర్సనాలిటీ ఉండాలి కదా'' అని. నేను... నేనేమనుకున్నట్లు... నేనేమనుకున్నా పెద్దవాళ్లు కాబట్టి అట్టే పట్టించుకోలేదు. చిన్నపిల్ల అన్నారు. మానాన్న మీద పూర్తి గౌరవంతోనే చెప్తున్నాను. ఆయనే కాదు. పెద్దవాళ్లు అంతా ఇంతే. సదసద్వివేచక్షణా జ్ఞానం పిల్లలకి ఉంటుందని, వాళ్ళకి స్వంత అభి ప్రాయాలూ, లక్ష్యాలూ ఉంటాయనీ... చటుక్కున ఒప్పుకోరు... నేను అప్పటికి ఊరు కున్నాను'' అంది భానుమతి.



అయితే వాళ్ల నాన్నగారు ఊరుకోలేదు. రామకృష్ణగారి తలితండ్రులతో ఈ విషయం ప్రస్తావించారు. వాళ్లకి పెద్ద ఆస్తి ఏమీ లేదు. "మా అబ్బాయి చాలా మంచివాడు. బుద్ధిమంతుడు''

అన్నారు మామగారు సగర్వంగా.

ఇది జరిగే వరకూ రామకృష్ణకి యీ విషయం ఏమీ తెలియదు. డైరెక్టరుగా పని నేర్చుకుంటున్న తను, ఒక కథకి హీరో అన్న వైనం ఏమీ తెలియదు. వెంకటసుబ్బయ్యగారికి తోచిన కారణాలవల్ల అప్పటి వరకూ ఆయన కృషి కూడా భానుమతి వంకకు వెళ్లలేదు.

వేరే సంబంధాలు చూస్తామన్నారు వెంకటసుబ్బయ్యగారు... తొలిసారిగా ఒకరి మీద గౌరవం, అభిమానం కుదిరిన తర్వాత, ఏ ఆడపిల్లకైనా మనసు మారదు. భానుమతికీ మారలేదు.

పెద్దలు నాడే జాతకాన్ని తిరగేయించారు. బహు యోగ్యుడు, సౌమ్యుడు ఆమెకి భర్తకాగలడని ఆ జాతకం ద్యోతకం చేసింది.

భానుమతి ఓర్పుతో రోజులు గడపసాగింది. కృష్ణప్రేమ చిత్రం పూర్తికావడానికి రెండేళ్లు పట్టింది. భానుమతి లక్ష్యం ఫలించడానికి ఎనిమిది నెలలు పట్టింది. ఈలోగా ప్రాణం విసుగెత్తింది కూడా. ఒక రోజున స్టార్ కంబైన్స్ అధిపతి శ్రీరామయ్యగారి భార్య శ్రీమతి కణ్ణామణికి ఈ సంగతి చూచాయగా తెలిసి, భానుమతిని చేరదీసి లాలనగా అడిగింది. భానుమతి మనసువిప్పి చెప్పింది. ఆపైన ఆమె రామకృష్ణకి కబురంపి అడిగింది. ఆయన కూడా దాపరికం లేకుండా సమాధానం చెప్పాడు.

---

కల్యాణం వచ్చినా కక్కొచ్చినా ఆగదని ఆర్యోక్తి. మ్యారేజెస్ ఆర్ మేడ్ ఇన్ హెవెన్ అని 'ఆంగ్లోక్తి'.



భర్త రామకృష్ణతో

రావలసిన కల్యాణ ఘడియలు వచ్చాయి. అవి రావడానికి రెండు ఘడియలు ముందుగా, భానుమతికి, ఒక శ్రేయోభిలాషి ఇంటినుండి ఒకసారి రమ్మని కబురు వచ్చింది. అలాగే రామకృష్ణకీనూ.

ఇద్దరూ అక్కడికి వెళ్లాక "మీకిప్పుడు పెళ్లి" అన్నారు ఆ పిలువనంపిన కుటుంబంలోని వారంతా చుట్టూచేరి.

"మా నాన్నకి చెప్పొద్దూ" అంది భానుమతి విస్తుబోయి. అలాగే చెబుదాం అన్నారు వారు. "అదేమిటీ... ఇలా హఠాత్తుగా ముహూర్తం ఏమిటి?" అన్నాడు రామకృష్ణ విస్తుబోయి. "అది అంతేలే ఘటన" అన్నారు వారు.

జార్జిటౌన్‌లోని ఒక దేవాలయంలో ఈశ్వర సమక్షాన, శుభముహూర్తాన శాస్త్రోక్తంగా, సలక్షణంగా, అయితే నిరాడంబరంగా వివాహం జరిగింది.

వధువు తల్లిదండ్రులూ, వరుడి తల్లిదండ్రులూ మాత్రం ఆ క్షణాన అక్కడ లేరు. అయితే పెళ్లి అయిన ఉత్తరక్షణాన, వధూవరులు మధుపర్కాలతో, సరాసరి నాలుగు వీధులు అవతలవున్న భానుమతి ఇంటికివెళ్లి వందనం చేశారు. "నాన్నా, మమ్మల్ని దీవించు" అంది భానుమతి.

"నీకింత పట్టుదలయితే, నేను మాత్రం ఆపేవాణ్ణా తల్లీ, కన్యాదానం అన్యులు చేయవలసి వచ్చింది" అన్నారు వెంకటసుబ్బయ్యగారు కంటతడిపెట్టి.

"నాన్నా, నీ పట్టుదల, నీ ఆత్మవిశ్వాసం నాలోనూ ఉన్నాయి. అందుకే ఇలా స్వతంత్రించాను. దీవించు నాన్నా" అన్నది భానుమతి. ఆయన మనసారా దీవించారు.

---

"ఒకరోజున ఆయన పెట్టిన విద్యాభిక్ష, ఆరోజున ఆయన దీవెన నా పురోభివృద్ధికి పునాదిరాళ్లు" అన్నది భానుమతి తన పెళ్లినాటి ముచ్చట్లు చెబుతూ. పెళ్లి అయిన నాటికి ఆమె "గరుడ గర్వభంగం" చిత్రంలో నటిస్తోంది. తరవాత ఆమె కొంతకాలం చిత్రసీమ నుండి విరమించుకుంది. మాంబళంలో బొమ్మరిల్లు లాంటి చక్కని ఇల్లు పదిహేను రూపాయల బాడుగకి తీసుకున్నారు. కాపురం పెట్టిన నవ దంపతులు.

---

భారత భాగవతాలు చదువుకుంది భానుమతి. సంప్రదాయాలను గౌరవిస్తుంది. మన్నిస్తుంది. శాస్త్రీయ సంగీతం అంటే ఆమెకు అభిమానం, గౌరవం. ఒకప్పుడు వాళ్ల నాన్నగారికి మాట ఇచ్చింది తను తీసే ప్రతి చిత్రంలోనూ శాస్త్రీయ సంగీతానికి స్థానం వుంటుందని, తాను ఒక్క కీర్తన అయినా పాడుతుందనీను. ఇతరుల చిత్రాలలో తాను పాల్గొన్నప్పుడు కూడా ఈ మాట నిలబెట్టుకోలేక పోయినా, తను నిర్మించే ప్రతి చిత్రంలో సంప్రదాయానుగుణమైన సంగీతం వుంటుంది. ఆమె ఒక కీర్తనగాని, వర్ణంగాని పాడుతుంది. హాస్యరస ప్రధానమైన చిత్రం "చక్రపాణి" ప్రారంభ సంగీతం కదన కుతూహల రాగంలోని కీర్తన, "రఘువంశ సుధాంబుధి".

కళారాధకురాలుగా ఆమె స్వేచ్ఛనీ, ప్రశంసనీ అపేక్షిస్తుంది. ఈ సంగతి తానుగా చెబుతుంది. వీటివల్ల మనస్సుకి ఆనందం ఉత్సాహం కలుగుతాయి అంటుంది.



పక్షిరాజా వారి "అగ్గి రాముడు", "మలై కళ్లన్" చిత్రాలు తయారవు తున్న సమయంలో, అవసరాన్ని బట్టి, భానుమతి సరిగా ఇరవై నాలుగు గంటలలో ఆరుపాటలు రికార్డు చేసింది ఒక నిముషం కాలం, ఒక అడుగు సెల్యులాయిడ్ వృధాగా పోకుండా.

"నేను పాడడానికీ, నటించడానికీ ప్రత్యేకం కష్టపడి ప్రయత్నం ఏమీ చెయ్యను. నా కృషి ఫలితం బాగుంటుందని నామీద నాకు నమ్మకం ఉంది. ఇలా చెప్పడానికి నాకు జంకేమీ లేదు. ఫాల్స్ డిగ్నిటీ లాగే ఫాల్స్ మాడెస్టీ కూడా నాకు నచ్చదు" అంటుంది భానుమతి.

**చిత్రం: మల్లీశ్వరి**

రచన:దేవులపల్లి కృష్ణశాస్త్రి సంగీతం: ఎస్.రాజేశ్వరరావు

మనసున మల్లెల మాల లూగెనే
కన్నుల వెన్నెల డోల లూగెనే
ఎంత హాయి ఈ రేయి నిండెనో
ఎన్ని నాళ్లకీ బ్రతుకు పండెనో!
కొమ్మల గువ్వలు గుసగుస మనినా
రెమ్మల గాలులు ఉసురుసు రనినా
అలలు కొలనులో గలగల మనినా
దవ్వుల వేణువు సవ్వడి వినినా
నీవు వచ్చేవని, నీ పిలుపే విని
కన్నుల నీరిడి కలయ చూచితిని
గడియ యేని యిక విడిచి పోకుమా
ఎగసిన హృదయము పగుల నీకుమా
ఎన్ని నాళ్ల కీ బ్రతుకు పండెనో
ఎంత హాయి ఈ రేయి నిండెనో...

**చిత్రం: అంతస్థులు**

రచన: కొసరాజు
సంగీతం: కె.వి.మహదేవన్ గానం: బృందంతో కలిపి త్రిగళం

దులపర బుల్లోడా దుమ్ము దులపర బుల్లోడా
చిలిపి కళ్లతో షికార్లు కొట్టే
మలపరాములను పిలక పట్టుకుని ॥దులపర॥
సిరిగల చుక్కల చీరకట్టుకుని
జవ్వాది కలిపిన బొట్టు పెట్టుకుని
వరాలగుమ్మ ముద్దుల బొమ్మ
కాలేజీకి కదిలిందంటే
వెకిలి వెకిలిగా వెర్రివెర్రిగా వెంటపడే రౌడీల పట్టుకుని
తళాంగు తకధిన తకతోం తోమ్మని ॥దులపర॥
సంప్రదాయమగు చక్కని పిల్ల
సాయంకాలం సినిమాకొస్తే
ఇదే సమయమని ఇంతే చాలునని
పక్కసీటులో బైఠాయించుకొని
చీకటి మరుగున చేతులు వేసే
శిఖండి గాళ్లను ఒడిసి పట్టుకుని
చింతబరికెను చేతబట్టుకుని ॥దులపర॥
రోడ్డు పట్టని కారులున్నవని
మూడంతస్థుల మేడలున్నవని
డబ్బు చూసి ఎదురింటి ఆడది
తప్పకుండా తమ వలలో పడునని
ఈలలు వేసి సైగలు చేసి గోల చేయు సోగ్గాళ్లను పట్టి
వీపుకు బాగా సున్నం పెట్టి ॥దులపర॥
మాయామర్మం తెలియని చిన్నది
మంగళగిరి తిరునాళ్లకు పోతే
జనం వత్తిడికి సతమతమవుతు
దిక్కుతోచక తికమకపడితే
సందుచూసుకుని సరసాలకు దిగు
గ్రంథ సాంగులను కాపు వేసుకొని
రమారమణ గోవిందా ఊఁ
రమా రమణ గోవిందా హరి అని ॥దులపర॥

**చిత్రం: వరుడు కావాలి**

రచన: రావూరి సత్యనారాయణరావు
సంగీతం:జి.రామనాథన్ గానం:ఘంటసాల (1), భానుమతి (2),పిఠాపురం (3)

1: అంద చందాల ఓ తారకా, చేరరావే చెలీ నా దరీ
నామదీ దోచినా రాణివే
2: అందచందాల ఓ జాబిలీ, చేరరావో ప్రియా నా దరీ
నామదీ దోచినా రాజువై
1: పూల తీరాల తూగాడు డోలవై, డోలలూగే సరాగాల మాలవై
తేలి రా గాలుల, తూలి రా పూవుల ॥పూల॥
తేనెలా సోనలా జాలువై ॥అంద॥
2: పూల తీరాల తూగాడు తేటివై
తేటి రాగాల సాగేటి పాటవై ॥పూల॥
తేలి రా గాలులా, తూలి రా పూవులా
తేనెలా సోనలా జాలువై ॥అంద॥
3: ఓ ప్రేయసీ నా ప్రేయసీ సిసలైన గోల్డె మన ప్రేమ
నా కోహినూర్ డైమండ్‌వే నాతలపైన కూర్చోవే ॥ఓ ప్రేయసి॥
2: సందేహమా - ఓ దేహమా మరి ప్రేమంటే లోహమా
నీ అందమూ నా చందమూ మెచ్చేనోయి ఓ వామనా ॥సందే॥
3: ప్రేమించవా పాలించవా దయరాదా నా మీద
సంసారమో సన్యాసమో ఇక తెల్వాలే ప్రియురాలా

**చిత్రం:అనురాగం**

సంగీతం: పెండ్యాల రచన: ఆత్రేయ

ప్రేమా పిచ్చీ ఒకటే నువ్వూ నేనూ వేరే
కథ చెపుతాను ఊకొడతావా
జో కొడతాను బజ్జుంటావా
అది ఇది కాదని అమ్మను కానని
అల్లరి చేస్తావా నన్నల్లరి చేస్తావా
నిండు మనసనే వెండి గిన్నెలో
నెయ్యీ నెయ్యం కలిపాను
పసిడి గిన్నెలో పాల బువ్వలో
ఆశాపాశం నిలిపాను
ఆ ఆ ఆ అం
ఆ ఆ ఆ అం ॥2॥ ॥ప్రేమా॥
తల్లికాని ఈ తల్లి గుండెలో
ఎవరూ ఊగని ఈ ఊయలలో
అమ్మకాని ఈ అమ్మ గొంతులో
ఎవరికి పాడని పాటలలో జో... జో..

**చిత్రం: గృహలక్ష్మి**

సంగీతం:ఎస్.రాజేశ్వరరావు

మేలుకోవయ్యా కావేటి రంగా శ్రీరంగా ॥మేలు॥ 2
చ. తెల్లవారెనురా విహగాలి లేచెనురా (2)
అల్లదే ఉదయాద్రిపైన (2)
అరుణకాంతి విరిసెరా ॥మేలు॥
చ. చల్ల చిలికే భామలా
కంకణాల మ్రోతలవిగో (2)
జుమ్మని నిను లెమ్మని (2)
పిలిచేను తేటి తియ్యగా ॥మేలు॥
చ. పసిడివాకిటిలో విరజాజి మాలలతో (2)
దాసకోటి వేచినారు (2)
నీదు సేవలు చేయగా ॥మేలు॥



**జైకిషన్ దయాభాయ్ పంచల్ గా 1929 లో గుజరాత్‌లో బల్సార్ లో జన్మించిన జైకిషన్ తన 16 వ యేట బొంబాయికి తరలి వెళ్లాడు. అందగాడు కాబట్టి నటుడిగా ప్రయత్నించి, అది కలిసిరాక సంగీత దర్శకుడయినా సరదా కొద్దీ 'ముడ్‌ముడ్ కే న దేఖ్' (శ్రీ 420) వంటి పాటల్లో కనబడ్డాడు.**

# జైకిషన్ ముచ్చట్లు

✹ హైదరాబాద్‌లో పుట్టిన శంకర్ సింహ్ రఘువంశి బొంబాయిలో తారసిల్లడంతో వారిద్దరి జీవితం ఒక మలుపు తిరిగింది. పృథ్వీరాజ్ కపూర్ నాటకాల కంపెనీ పృథ్వీ థియేటర్స్ లో ఆర్కెస్ట్రాలో పనిచేశారు. హుస్నలాల్-భగత్‌రామ్ వద్ద శంకర్ అసిస్టెంటుగా పనిచేశారు.

✹ రాజ్‌కపూర్ స్వంతంగా 'ఆగ్' నిర్మిద్దామనుకున్నప్పుడు తండ్రి పృథ్వీథియేటర్స్‌లో పనిచేసినవారినే సంగీతం ఇవ్వడానికి ఎంచుకున్నాడు. ఆ విధంగా ఆ చిత్రానికి రామ్ గంగూలీకి అసిస్టెంట్స్‌గా శంకర్-జైకిషన్ పనిచేశారు.

✹ రాజ్‌కపూర్ తదుపరి చిత్రం 'బర్సాత్'కి స్వతంత్రంగా పనిచేశాక ఆ జంట తిరిగిచూసుకోలేదు. 1948 నుండి 1971 వరకు 179 సినిమాలకు సంగీతం సమకూర్చి, సినిమాకు 5 లక్షలు పారితోషికం తీసుకుని రికారు సృష్టించారు. 1971లో జైకిషన్ చనిపోయిన తర్వాత కూడా శంకర్ (ఈయన 1987 లో పోయారు) శంకర్-జైకిషన్ పేరనే సంగీతం అందించారు.

✹ శంకర్-జైకిషన్‌ల పాటల్లో ఏది ఎవరు చేశారు అన్నది సంగీతాభిమానులకు పెద్ద క్విజ్ లాటిది. ఆహ్లాదకరమైనవి జైకిషన్ చేస్తే, విషాదగీతాలు శంకర్ చేశాడంటారు. డాన్సు ట్యూన్లు శంకర్ చేయాలనీ, బ్యాక్‌గ్రౌండ్ మ్యూజిక్, థీమ్‌సాంగ్సు జైకిషన్ చేయాలనీ (బర్సాత్, ఆవారా టైటిల్ సాంగ్స్ జైకిషన్ చేసినవే) వాళ్లలో వాళ్లే అనుకున్నారట. అదీ పాటించలేదట. అలాగే శైలేంద్ర పాటలు శంకర్ చేస్తాడనీ, హస్రత్ జైపురి పాటలు జైకిషన్ చేస్తాడనీ ఒక ఊహ.

✹ ఏ పాట ఎవరు చేశారన్నది బహిరంగ పరచకూడదన్నది వాళ్ల ఒప్పందం. 'సంగమ్' (1964)లో 'యే మేరా ప్రేమ్ పత్ర్ పఢ్‌కర్' పాటకు బాణీ తను కట్టినదేనని జైకిషన్ ప్రకటించడంతో ముప్పు వచ్చిపడింది. తన భార్య పల్లవికి తను రాసిన ప్రేమలేఖనే పాటగా హస్రత్ చేత రాయించానని, అందుకే అంత ముచ్చటగా మనసు పెట్టి ట్యూన్ చేశాననీ జైకిషన్ ఫిలింఫేర్ కు రాసిన ఓ వ్యాసంలో చెప్పేశాడు. దాంతో శంకర్‌కి కోపం వచ్చింది. అదిగో ఒప్పందాన్ని ఉల్లంఘించావ్ అని అలిగి అప్పటినుండి కలిసి సంగీతం ఇవ్వడం మానేశాడు. తర్వాత ఎవరో ఒకరే సంగీతం ఇచ్చినా వ్యాపార ప్రయోజనాల దృష్ట్యా ఇద్దరిపేర్లూ వేసుకునేవారు. ఈ విధంగా సంగమ్ వారి వియోగానికి కారణమైంది.

✹ వారు స్నేహితులుగా విడిపోలేదనే చెప్పాలి. బినాకా గీత్‌మాలాలో అమీన్ సయానీ ' యే మేరా ప్రేమ్ పత్ర్' ను తరచుగా టాప్ సాంగ్‌గా పేర్కొంటూండడంతో తను ట్యూన్ చేసిన 'దోస్త్ దోస్త్ న రహా' కూడా గొప్పగీతమేననీ, అమీన్ సయానీ పక్షపాతం చూపిస్తున్నాడనీ శంకర్ యాగీ చేశాడు. శంకర్‌కు గాయని శారదతో సాన్నిహిత్యం కూడా గొడవలకు కారణమైనదంటారు.

✹ లతా లక్ష్మీకాంత్-ప్యారేలాల్ అనే కొత్త సంగీతదర్శకులను ప్రోత్సహించడం జైకిషన్‌ను కలచివేసింది. ఆల్కాహాల్‌కి బానిస కావడంతో తన 42 వ యేటనే మరణించాడు. అంత చిన్న జీవితంలోనే శంకర్‌తో కలిసి అందించిన మణిమాణిక్యాలెన్నో ఉన్నాయి. కొన్ని సినిమాపేర్లు తలచుకుంటేనే చాలు - మనసు పులకరించిపోతుంది. అన్ని రకాల సినిమాలకు అజరామరమైన సంగీతాన్ని అందించారు. వారిద్దరూ విడిపోయాక కలిసి చేసిన చిత్రం - 'మేరానామ్ జోకర్' ఒక్కటే! - అదీ రాజ్‌కపూర్ కారణంగా!

✹ జైకిషన్ మరణించినా అతని ట్యూన్‌లు అంతరించలేదు. 'రామ్ తేరీ గంగా మైలీ' లో 'సున్ సాహిబా సున్' ట్యూన్ రాజ్‌కపూర్ తీద్దామని తీయలేకపోయిన 'అజంతా' అనే సినిమాకై కూర్చినది. ఆ ట్యూన్ ను ఉపయోగించమని రాజ్‌కపూర్ లక్ష్మీకాంత్-ప్యారేలాల్‌లను అడగడం, వాళ్లు ఒప్పుకోకపోవడంతో ' రామ్ తేరీ..'కి రవీంద్ర జైన్‌ను పెట్టుకుని అతని ద్వారా సినిమాలో పెట్టడం జరిగింది. ఇలా ఎన్నో ట్యూన్‌లు ఆర్.కె.ఫిలింస్ వారివద్ద ఉన్నాయట. ఆ విధంగా జైకిషన్ బాణీలు వేరెవరి పేరుతో వచ్చినా - మన మధ్యకు వస్తూనే ఉంటాయి. అందుకే జైకిషన్ చిరంజీవి!

- ఎస్.కె.రామారావు

## శంకర్ - జైకిషన్ సంగీతం సమకూర్చిన కొన్ని చిత్రాలు



1949-బర్సాత్, 1951-60: ఆవారా, బాదల్, కాలీఘటా, నగీనా, దాగ్, పర్‌బత్, పూనమ్, ఆహ్, ఆస్, ఔరత్, నయాఘర్, పతితా, షికస్త్, బాద్‌షా, బూట్ పాలిష్, మయూర్ పంఖ్, పూజా, సీమా, శ్రీ 420, బసంత్ బహార్, చోరీచోరీ, హలాకు, కిస్మత్‌కే ఖేల్, న్యూఢిల్లీ, పటరాణి, రాజ్‌హఠ్, బేగునాహ్, కట్‌పుత్లీ, బాఘీ సిపాహీ, యహూదీ, అనాడీ, ఛోటీబహెన్, కన్హయ్యా, లవ్‌మేరేజ్, మై నషే మే హూ, షరారత్, ఉజాలా, కాలేజ్‌గర్ల్, దిల్ అప్నా ప్రీత్ పరాయీ, ఏక్‌ఫూల్ చార్‌కాంటే, జిస్ దేశ్‌మే గంగా బహతీహై, గబన్, సింగపూర్, 1961-1971: ఆస్‌కాపంఛీ, బాయ్‌ఫ్రెండ్, జబ్ ప్యార్ కిసీసే హోతా హై, జంగ్లీ, ససురాల్, ఆషిక్, అస్లీనక్లీ, హరియాలీ ఔర్ రాస్తా, ప్రొఫెసర్, రంగోలీ, దిల్ ఏక్ మందిర్, హమ్‌రాహీ, ఆయీ మిలన్ కీ బేలా, రాజ్‌కుమార్, సంగమ్, సాంఝ్ ఔర్ సవేరా, ఆర్జూ, గుమ్‌నామ్, జాన్‌వర్, ఆమ్రపాలి, లవ్ ఇన్ టోక్యో, సూరజ్, తీస్రీకసమ్, రాత్ ఔర్ దిన్, బ్రహ్మచారి, మేరే హుజూర్, యకీన్, మేరానామ్‌జోకర్.

## కొంటెకొశ్శెన్లు - తుంటరి జవాబులు




✱ బుక్కపట్నం
శ్రీనివాసాచారి - హైద్రాబాద్

ప్ర॥ రకరకాల కథలు చెప్పి ఏదోరకంగా మందు కొట్టేసే వాళ్ళని ఏమంటారు?

జ॥ ఆల్కహాలీస్ - అల్‌కహానీస్

✱ డి.బల్లజార్, ఆర్.సి.పురం

ప్ర॥ 'కార్డియాలజిస్టు'కి ఏ రోడ్డు నచ్చుతుంది?

జ॥ బైపాస్ రోడ్

✱ పి.పి.యస్.అప్పారావ్, రుద్రారం

ప్ర॥ మా వాడికి కంప్యూటర్ నాలెడ్జి విపరీతంగా వుంది. అయినా ఇంటర్ తెగ తప్పుతున్నాడు. కారణం ఏమిటంటారు?

జ॥ కంప్యూటర్ పిచ్చిలో పడి పాస్ అనేమాట (పాస్‌వర్డ్) మర్చిపోయుంటాడు.

## చిలిపిలిపి




'X'-'S' = ఎక్సెస్

-సి.ప్రకాష్, రుద్రారం

ACDT = ఎసిడిటీ

-డి.బల్లజార్, ఆర్.సి.పురం

ABCD = అడల్ట్ బూతుల సీడీ



## ఈ రూటే వేరు




Fair Leg = సంతకాలు
Cloth Head = బట్టతల
Ball Flower = బంతిపూలు

-వరదా సాయికుమార్, పర్లాకిమిడి

## డబుల్‌రోల్




ఆ 'బీడి' కాల్చే కూలి పనిలో
'ఒబీడియంట్'గా ఉంటాడు
-బి.విశ్వజ, జవహర్‌కాలనీ

'రవి'కి జరిగింది
ఘో'రవి' పత్తే!
-బివిరావు, రుద్రారం

ఆ 'దంపతుల'లలో
ఒకరి రాశి 'తుల'ట.
-కోట చందన, మచిలీపట్నం

## పేరు - రిపేరు



ప్రియమైన నీకు - ఆహ్వానం - ఇట్లు శ్రావణిసుబ్రహ్మణ్యం

కుచ్చికుచ్చికూనమ్మా - ప్రేమించేది ఎందుకమ్మా

-బి.శ్రీరాం

నాలో వున్న ప్రేమ - నీతో - చెప్పాలని వుంది.

-జె.చరణ్, తాడేపల్లిగూడెం

## పేరడీ పేరేడ్



దోమలు గుసగుసలాడే
నా తనువును తూటులు చేసే ॥దోమలు॥
వలవున్న విడదని తెలుసు పగలైన నన్నేకరచూ
ఆ కాటుకి బలముందిలే అది నాకు మునుపే తెలుసు ॥దోమలు॥
నను ఏరి కోరిన దోమ - దూరింది తెరలోకైనా
ఏ క్రీములు రాస్కున్నను విడలేదు నిముషము కూడా ॥దోమలు॥
మస్కిటోలు మళ్ళీ కుట్టే వొళ్లంత దద్దుర్లొచ్చే
కాయిల్సుని వెలిగించుచూ నెలరాబడి కరుసయి పోయే ॥దోమలు॥

-తెలికిచర్ల రామకృష్ణ
విజయనగరం

('బందిపోటు' చిత్రంలో 'ఊహలు గుసగుసలాడే' పాటకు పేరడీగా)

## చిలిపి కవిత



### మొగాడ్.... ఓ మైగాడ్

పెళ్ళికి ముందు
బాసలు చేసినవాడు
పెళ్ళిరోజు
బాసింపట్టు వేసుకుని
బుద్ధిగా కూర్చున్నాడు
బాసికాలు కట్టిన
మరుక్షణం నుంచి
బాసులా ప్రవర్తిస్తున్నాడు

-భమిడిపాటి వెంకటేశ్వరరావు, రుద్రారం

## కొన్ని ఆధునిక సూక్తులు

1. ఇంట గెలిచి ఇంటర్నెట్‌లో గెలువు!
2. కంప్యూటర్లు అమ్మిన చోటే కళ్లజోళ్లు అమ్మినట్టు!
3. "ఫ్లాపీ" చిరాయువు!



-సరసి (కార్టూనిస్టు)
హైదరాబాద్

సీరియల్

4

# మా మామయ్య ఘంటసాల కథ

-శ్రీమతి ఘంటసాల సావిత్రి



ఒకసారి కలకత్తా నుంచి సితార్ విద్వాంసులు ఆలీఖాన్ గారు బ్రతుకు తెరువుకోసం మద్రాసు వచ్చి రెండు నెలలు ప్రయత్నాలు చేసి ఫలించక తిరిగి వెళ్లిపోతానంటే, మర్నాడు మా యింట్లో ఆయన కచేరీ పెట్టి ఆలీఖాన్‌గారికి వెయ్యి రూపాయలిచ్చి ఖర్చులకి ఉంచుకోమన్నారు. తరువాత ఆలీఖాన్‌గారు బాగా పుంజుకున్నారు. మా రెండో అమ్మాయి సుగుణమ్మ పెళ్లికి ఆలీఖాన్ సితారు కచ్చేరీ ఏర్పాటు చేశాము. జోహరాబాయి గారితో "రాణి" అనే హిందీ సినిమాలో "పాన్‌కే బీడె దోదో పైసె" అనే పాట పాడారు. ఇది కామెడీ పాట. దీనికి ఎల్.వి.ప్రసాద్‌గారు డైరెక్టరు సి.ఆర్.సుబ్బరామన్ గారు సంగీతం సమకూర్చారు. ఈ సినిమా విడుదల అయిందీ లేనిదీ తెలీదు. సినిమాలో ఈ పాట ఉంచారో లేదో కూడా తెలీదు. పాతాళభైరవి హిందీ సినిమాకి మావయ్య సంగీతం సమకూర్చగా పాటలు తలత్ మెహమూద్ పాడారు. జయసింహని హిందీలోకి డబ్బింగ్ చేసినప్పుడు మామయ్య పాడిన "జయ జయ శ్రీరామా" అనే పాటని అలాగే వుంచేసారని రమేష్‌నాయుడు చెప్పారు. పాండవ వనవాసం సినిమాని బెంగాలీలోకి డబ్బింగ్ చేసారు. ఇందులో హేమంత్‌కుమార్‌గారు పాడారు. జె.వి. రాఘవులు సంగీతం సమకూర్చారు. మావయ్య పాడిన ఆంజనేయ దండకం అవీ అలాగే ఉంచారు. ఈ సినిమా సూపర్ హిట్ అయింది. ఈ సినిమా చూసిన ప్రముఖ నిర్మాత, దర్శకులు సత్యజిత్‌రాయ్ గారు సంగీతం చాలా అద్భుతంగా వుంది. ఎవరు చేశారని అడిగితే రాఘవులు "మా గురువుగారు ఘంటసాల గారు చేసా"రని చెప్పారట. సత్యజిత్‌రాయ్ గారు మద్రాసు వచ్చినప్పుడు మావయ్యను కలిసి పాండవ వనవాసం సంగీతం ఎంతో గొప్పగా చేశారని మెచ్చుకున్నారు. అలాగే ఏ.వి.యం. వారు తీసిన శ్రీ కాళహస్తి మహత్యం సినిమాలో మొదట దండకాలు, శ్లోకాలు అవి ఏ.ఎం.రాజా గారి చేత పాడించాలనుకున్నారు. స్టూడియోలో మావయ్య రికార్డింగ్ జరుగుతుంటే ఏ.వి.యం. అధినేత



ఏ.వి.మెయ్యప్పన్ గారు మావయ్య గొంతు విని "చాలా బాగుంది. ఎవరితను" అని అడిగి తెలుసుకుని కాళహస్తి మహాత్మ్యంలో పద్యాలు, దండకాలు అన్నీ మావయ్య చేత పాడించారు. కొన్ని పాటలు మాత్రం రాజా గారిచేత పాడించారు.

## విజయా సంస్థతో అనుబంధం

విజయా సంస్థలో పనిచేసిన డైరెక్టర్లలో శ్రీ కె.వి.రెడ్డిగారికి, శ్రీ కమలాకర కామేశ్వరరావుగారికి మావయ్య అంటే చాలా ప్రీతి. కె.వి.రెడ్డి గారు ఎప్పుడూ "ఘంటసాలా! నీ కంఠం అద్భుతమైనది. ప్రజలు నన్ను తిట్టకుండా వుంటే హీరోయిన్స్‌కి కూడా నీ చేతనే పాడిస్తా" నే వారు. కె.వి.రెడ్డి గారు మా యింటికి ఎదురుగా వుండే వారు. రెడ్డిగారు రావడం ఆలస్యమైతే రెడ్డి గారి భార్య మా యింటి వైపు వరండాలో లైట్లు వెలుగుతున్నాయో లేదో అని చూసే వారు. లైటు వెలుగుతుంటే యింకా మావయ్య కూడా రాలేదు, కాబట్టి యిద్దరూ యింకా స్టూడియోలో ఉన్నారనుకునే వారు.

చంద్రహారం సినిమాలో మావయ్యకి "ఎవరివో ఎచటనుంటివో" "ఏమిశిక్ష కావాలో కోరుకొనవే ప్రేయసి" "ఇది నా చెలి ఇది నా సఖి" అనే పాటలు



చాలా యిష్టం. ఈ సినిమా పూర్తయ్యాక "తరువాతి సినిమాలో క్రిస్టియన్ పాటలు వుంటాయి. అవి ట్యూన్ చెయ్యాలి. ప్రయత్నం చేస్తుండు" అని చక్రపాణిగారు చెప్పారు. కాంట్రాక్టు అంటూ ఏమి ఇవ్వలేదు. మావయ్య సరేనన్నారు. దానికి ఎల్.వి. ప్రసాద్‌గారు డైరెక్టరు. చంద్రహారం అయిపోయిన తరువాత విజయ సంస్థ, మావయ్య కాంట్రాక్ట్ రాసుకోలేదు. ఎల్.వి.ప్రసాద్‌గారు రాజేశ్వరరావు గారిని సంగీత దర్శకులుగా పెట్టుకున్నారు. అప్పుడు నాగిరెడ్డి గారు, చక్రపాణి గారు ఘంటసాలని కొత్త సినిమాకి సంగీతం చెయ్యమని చెప్పాము. ఇప్పుడు యిలాగైంది. మరి రాజేశ్వరరావు గారి సంగీతంలో ఘంటసాల పాడతారో లేదోనని అనుమానించి ఏ.ఎం.రాజా గారితో పాటలు పాడించారు. ఆ సినిమా "మిస్సమ్మ", నాగిరెడ్డిగారు, చక్రపాణిగారు ఎన్నోసార్లు అనుకున్నారట ఘంటసాల పాడితే మరింత బాగుండేవి పాటలు అని.

విజయా వాళ్లు తరువాత తీసిన సినిమా "మాయాబజార్." దానికి కె.వి.రెడ్డిగారు దర్శకులు. మొదట సంగీతం చెయ్యడానికి రాజేశ్వరరావు గారిని అనుకుని తరువాత మావయ్యని చెయ్యమన్నారు. ఇందులో నాలుగు పాటలు రాజేశ్వరరావు చేసారు. మావయ్య ఆ పాటలు విని, బాగున్నాయని, ఆ ట్యూన్లే వుంచారు. కాని ఆర్కెస్ట్రా, రికార్డింగ్ అన్నీ మావయ్యే చేసారు.

మిగిలిన పాటలు కూడా అన్నీ బాగా హిట్ అయ్యాయి. మాయాబజార్ సినిమాకి రాజేశ్వరరావుగారి పేరు వేద్దామన్నారు. దానికి చక్రపాణిగారు 'నాలుగు పాటలు మాత్రమే ఆయన చేసింది. మిగిలినదంతా నీవు చేశావు ఆయన పేరు వెయనక్కరలేదు' అన్నారు. దీని తరవాత ''అప్పుచేసి పప్పు కూడు'' దీనికి ఎల్.వి.ప్రసాద్ డైరెక్టరు.

మళ్లీ రాజేశ్వరరావుగారిని తీసుకున్నారు. మావయ్య పాడతారో లేదోనని కొన్ని పాటలు రాజాగారితో పాడించి రికార్డు చేశారు. నాగిరెడ్డి, చక్రపాణిగారు కలిసి మావయ్యని "ఘంటసాలా! మా సినిమాలో పాటలు పాడవా?'' అని అడిగారుట. దానికి మావయ్య "అదేమిటండీ? మన సినిమాలో ఎందుకు పాడను? తప్పకుండా పాడుతాను'' అన్నారట. ఐతే రేపొచ్చి రిహార్సల్స్ చూసుకోవాల్సిందిగా అడిగారు.

## గుండమ్మ కథ

విజయా వారు కమలాకర కామేశ్వరరావు గారి దర్శకత్వంలో ఘంటసాల సంగీత దర్శకత్వంలో తీసిన చంద్రహారం సినిమా తరువాత మళ్లీ వీరిద్దరి కాంబినేషన్‌తో ఒక సాంఘిక చిత్రం తీయాలని సంకల్పించి గుండమ్మ కథ సినిమా తీసారు.

విజయా వాళ్లు తరువాత కమలాకర కామేశ్వరరావు గారి దర్శకత్వంలో, మావయ్య సంగీత దర్శకత్వంలో అన్ని పాటలు సూపర్ హిట్



అవ్వాలనుకుని తీసిన సినిమా "గుండమ్మ కథ". నాగిరెడ్డిగారు, చక్రపాణిగారు, కామేశ్వరరావుగారు మావయ్యతో సినిమాలో పాటలన్నీ సూపర్‌హిట్ కావాలని చెప్పారట.

మావయ్య "గుండమ్మ కథ'' సినిమా నిర్మాణంలో వున్నప్పుడు నాతో "రాజీ! ఈ సినిమాలో పాటలన్నీ హిట్ అవా''లని తరచూ అంటూండేవారు. పాటల రికార్డింగ్ పూర్తి అయి పిక్చర్ విడుదలై ఆ భగవంతుడి దయవల్ల గుండమ్మ కథలో పాటలన్నీ విపరీతమైన ప్రజాదరణ పొంది, ఆ సినిమా ఎన్నో చోట్ల రజతోత్సవాలు చేసుకుంది. ఈ సినిమా విజయంతో మావయ్య ఎంతో తృప్తి పడ్డారు.

## గుఱ్ఱం జాషువా

195లో జాషువా గారు రాసిన పాపాయి పద్యాలు రికార్డుగా విడుదలయ్యాయి. ఆ పద్యాలు రికార్డింగ్ అవుతున్నప్పుడు జాషువా గారు మా యింటికి వచ్చి బయట వరండాలో



కూర్చునే వారు. తరువాత మావయ్య వారిని లోపలికి తీసుకువచ్చి మాట్లాడే వారు. మావయ్యతో ఎవరో వచ్చారని చెప్పగానే బయటకు వచ్చి చూస్తే జాషువా గారు. "అదేమిటండీ బయట కూర్చున్నారు? లోపలికి రండి'' అంటే "నేను కులం వల్ల అంటరానివాడినండి. ఇక్కడే కూర్చుంటాను లోపలికి రాను'' అంటే మావయ్య "మాకు అలాంటి భేదాలేవీలేవు. అందరూ మాకు సమానులే. ముందు మీరు లోపలికి రండి'' అని బలవంతంగా తీసుకువచ్చి కూర్చోపెట్టి, అతిథి మర్యాదలు చేసారు. జాషువాగారు చలించిపోయి మీ వంటి గొప్ప సంస్కారవంతులని చూడలేదని చెప్పి నమస్కరించి వెళ్ళారు. మావయ్యకి కులమత భేదాలు లేవు అని చెప్పేకంటే అసలు తెలీదు అంటే సబబుగా వుంటుంది.

## గాయకులకు ప్రోత్సాహం

మా ఇంటికి ఎంతో మంది సినిమాల్లో పాటలు పాడే అవకాశం కోసం వస్తుండే వారు. వారిలో పి.బి.శ్రీనివాస్ గారు తరుచుగా వస్తుండే వారు. వచ్చి వాళ్లందరూ పాటలు పాడి వినిపిస్తుండే వారు. మావయ్య పి.బి.శ్రీనివాస్ గురించి ''ఈ కుర్రవాడు బాగా పాడుతున్నాడు. తప్పకుండా రాణిస్తాడు'' అని నాతో అంటూ వుండే వారు. అలాగే పి.బి.శ్రీనివాస్ మంచి గాయకుడిగా పేరు తెచ్చుకున్నారు. ఎ.యం.రాజాగారు కూడా మా యింటికి వచ్చి పాటలు పాడుతూ ఉండే వారు. ఆ స్నేహంతో రాజాగారి చేత మేము తీసిన "పరోపకారం'' సినిమాలో పాట పాడించారు.

పిఠాపురం నాగేశ్వరరావు గారు అంటే మావయ్యకూ చాలా అభిమానం. విజయా వారు మామయ్య సంగీత దర్శకత్వంలో తీసిన పాతాళభైరవి, పెళ్లిచేసిచూడు, చంద్రహారం, మాయాబజార్ సినిమాలలో పిఠాపురం గారి చేత కూడా పాడించారు. విజయకుమార్ నా కడుపులో ఉన్నప్పుడు నియో మోడరన్ లాడ్జి నుంచి పెద్ద గ్లాస్‌తో చిక్కని మీగడ పెరుగు తెస్తుండే వారు. "అమ్మ! మీరు ఈ పెరుగుతిని దబ్బపండు లాంటి, ఘంటసాల గారిలాంటి అబ్బాయిని కనాల'నేవారు.

## మామయ్య - తోలేటి

1957లో అనుకుంటాను. తోలేటిగారు చనిపోతే మావయ్య, పామర్తి, వయోలా సుబ్రహ్మణ్యం గారు వెళ్లారు. మృతదేహాన్ని స్మశాన వాటికకి తీసుకు వెళ్లటానికి మనుషులని మాట్లాడితే ఒక్కొక్కరు 65 రూపాయలడిగారట. తోలేటిగారి యింట్లో అప్పుడు దహన సంస్కారాలకు తగిన డబ్బు లేదు. అందుకని మావయ్య, పామర్తి, సుబ్రమణ్యంగారు ఆలోచించి బయట వాళ్లకు దాదాపుగా 300 రూ॥ యివ్వవలసి వస్తుంది. ఆ డబ్బు వుంటే దహన సంస్కారాలకి పనికి వస్తుంది. అని యింకొక వ్యక్తిని కలుపుకుని మద్రాసులోని కన్నమ్మపేటలో స్మశానానికి తోలేటిగారి శవాన్ని మోసుకువెళ్లారు. ఆ తరువాత ఏ.వి.మెయ్యప్పన్ గారికి విషయం తెలిసి తోలేటిగారింటికి వెయ్యి రూపాయలు పంపించారు. ఆ రోజుల్లో హెచ్.ఎం.వి. కంపెనీ వారు ప్రైవేటు రికార్డులు విడుదల చేస్తే పాటలు రాసిన కవికి మాత్రం డబ్బులిచ్చే వారు. పాడిన వాళ్లకి రాయల్టీ వచ్చేది. అందుకని తోలేటి గారు బ్రతికి వుండగా తరచుగా వస్తూ నేనే పాటలు రాస్తాను. మీరు పాడండి అని ఎన్నో మంచి పాటలు రాసిస్తే మావయ్య వాటిని పాడి రికార్డులుగా విడుదల చేసారు. అలాంటి అద్భుతమైన పాటలే స్వాతంత్ర్యమె మా జన్మహక్కని, ఆంధ్రజ్యోతి, భారతీయుల కళా ప్రాభవము, అమ్మా సరోజనీదేవి, ఆశాజీవి, తెనుగు భారతి, మావయ్య సంగీతంలో రావు బాలసరస్వతీదేవి గారు పాడిన ముసురేసిందంటే, ఆంధ్రమహిళ, ఎస్.వరలక్ష్మి పాడిన కనవోయి వసంతము, నవ వసంత ఎంతో ప్రజాదరణ పొందాయి. శ్రీకాళహస్తి మహాత్మ్యంలో తోలేటిగారు రాసిన దండకాలు, పద్యాలు అన్నీ మావయ్య పాడినవే. ఎంతో ప్రజాదరణ పొందాయి.

## పొట్టి శ్రీరాములు - మావయ్య

పొట్టి శ్రీరాములుగారు, మావయ్య మంచి స్నేహితులు. బళ్ళారి జైలులో వున్నప్పటినుంచి పరిచయం. శ్రీరాములుగారు పొద్దుటి పూట మరణించారు. అప్పుడు ఫోనులేదు. వెంటనే మావయ్యకి తెలిసి మోపర్రు దాసుగారు, పామర్తిలతో కలిసి బులుసు సాంబమూర్తి గారింటికి వెళ్లితే అక్కడ ఎవరూ లేరట.

మద్రాసులో వుంటున్న తెలుగువారెవరికీ తెలియలేదని బాధపడ్డారు. దాసుగారు చాలా హుషారైన మనిషి. హరికథకులు చెప్పేవారు కదా. అందుకని పెద్దగొంతు వుండేది. ఆయనకి కోపం



వచ్చి వెంటనే వీధి వీధికి వెళ్లి శ్రీరాములుగారు పోయారని అరిచి చాలామందిని పోగు చేసు కొచ్చారు. ఆ తర్వాత చాలామంది తెలుగువారికి విషయం తెలిసి వచ్చారు. టంగుటూరి ప్రకాశం పంతులుగారు విషయం తెలుసుకుని మద్రాసుకి బయలుదేరి వస్తుంటే ఒకచోట వాగునీరు ఉధృతంగా వచ్చి ఆయన కారు ఆగిపోయింది. "నేను వస్తున్నాను, మీరు తొందరపడవద్దు" అని మద్రాసుకి కబురు పంపించారు. ప్రకాశం పంతులుగారు వచ్చి, పొట్టి శ్రీరాములుగారి మృత దేహానికి దహన సంస్కారాలు అయ్యేటప్పటికి, యింకా యింటికి రాలేదని నేను చాలా కంగారు పడ్డాను. స్మశానంలో మావయ్య శ్రీరాములు గారికి యిష్టమైన దేశభక్తి గీతాలు అనేకం పాడారుట.

మహాత్మాగాంధీగారు చనిపోయినప్పుడు మా యింట్లో మనిషి పోయినట్టుగా బాధపడ్డాం. అప్పుడు నా వయస్సు పదిహేను సంవత్సరాలు. నాకు అంతగా ఏమీ తెలీదు. అప్పుడు మావయ్య "అస్తమించెను బాపూజీ అవరించెను చీకటి" అని ఒక పాట రాసి రికార్డుగా విడుదల చెయ్యాలను కున్నారు. కానీ ఆ పాటకి సంగీతం సమకూర్చే టప్పటికి ఒక నెలరోజులు పట్టింది. అప్పుడు రికార్డింగ్ చేద్దామనుకుంటుండగా మహమ్మద్ రఫీ గారు పాడిన "సునో సునో దునియా వాలే బాపూజీకి అమర్ కహానీ" పాట రిలీజైంది. అది రేడియోలో వచ్చినప్పుడు విన్నారు. రఫీ చాలా బాగాపాడారు. మళ్లీ నేను గాంధీ గారి మీద పాడితే ఏం బాగుంటుందని ఆ ప్రయత్నం విరమించుకున్నారు.

## స్నేహబంధం

మావయ్య విజయనగరంలో సంగీతం నేర్చుకునేటప్పుడు ముద్దు పాపారావుగారని చాలా దగ్గరైన స్నేహితుడు వుండే వారట. ఒక్కరోజు కూడా ఆయన మావయ్యని చూడకుండా వుండేవారు కాదట. పాపారావుగారు మావయ్య కన్నా పెద్దవారు. ఆయన సంగీత కళాశాలలో మావయ్యకి సహాధ్యాయి. ఆయన ప్రతిరోజూ ఉదయాన్నే బయలుదేరి సత్రానికి వచ్చి మావయ్యను తీసుకొని హోటల్‌లో టిఫిన్, కాఫీ యిప్పించేవారుట. అలా మూడు సంవత్సరాలు మావయ్య ఆకలి తీర్చిన మహానుభావుడాయన. అప్పట్లో వాళ్లు జమీందారులట. ఆయనకి భార్య బిడ్డలున్నా మావయ్యతో సత్రంలో నేలమీద పడుకునే వారట. మావయ్య చూసి కోపం చేసుకుంటే యింటికి వెళ్లి మళ్లీ వారం తరువాత యధావిధిగా సత్రానికి వచ్చేసేవారట. ఆయన అప్పుడప్పుడు వాళ్లింటినుంచి ఆవకాయ, కంది పొడి తెచ్చియిస్తుండేవారట. ఆయన హార్మోనియం చాలా బాగా వాయించేవారట. పాపారావుగారు, "ఘంటసాలా, నీకు ఆ దేవుడు అతి మధురమైన గొంతునిచ్చాడు. ఎప్పటికైనా నువ్వు చాలా గొప్పవాడి వవుతావు. ఎంతో పేరు సంపాదిస్తావు. అలా నువ్వు ముందు పేరు, డబ్బు సంపాదిస్తే నాకు వాచీ కొనిపెట్టు. నేను ముందు పేరు తెచ్చుకుంటే నేను నీకు వాచీ కొనిపెడతాను." అనేవారట. అలా వాళ్లిద్దరూ ఒప్పందం చేసుకున్నారట. కాలక్రమంలో మావయ్య ఆ విషయం మరచిపోయారు. లైలా మజ్ను విడుదలై మావయ్యకి బాగా పేరొచ్చి బిజీ అవుతున్నప్పుడు పాపారావుగారి దగ్గర నుంచి మామయ్యని ఎంతగానో అభినందిస్తూ ఉత్తరం వచ్చింది. ఆ వుత్తరంలో ఆయన మన ఒప్పందం మరిచి పోయావా? అని రాసారు. అప్పుడు మావయ్యకి జ్ఞాపకం వచ్చి ఆయనని మద్రాసు వచ్చి తన దగ్గర కనీసం రెండు నెలలైనా వుండమని వుత్తరం రాసి వారికి నచ్చిన వాచీ కొనుక్కోమనీ వెంటనే 75/- రూపాయలు మనియార్డరు చేసారు. పాపారావు గారు ఆ డబ్బుని, ఉత్తరాన్ని అందరికీ చూపించి తెగ సంబర పడ్డారుట. "నేను మావాడి దగ్గరికి మద్రాసు వెళ్తాను. నన్ను రమ్మని రాసాడు" అని ఆనందిస్తున్న సమయంలో ఆయనకి టైఫాయిడ్ జ్వరం వచ్చి సరైన వైద్యసదుపాయం లేక 1949లో గుణుపురంలో చనిపోయారు. అప్పుడు మావయ్య చాలా బాధపడ్డారు. పాపారావుగారు, మావయ్య ఒకరిని ఒకరు "అన్నా" అని పిలుచుకునే వారుట. ఆయన పోయిన కొద్దికాలానికే ప్రభుత్వం జమిందారీలని రద్దు చేసి వారి జాగిరులన్నీ స్వాధీనం చేసుకుంది. పాపారావుగారి కుటుంబం అయోమయంలో పడింది. అప్పుడు పాపారావు గారి మామగారు ఆ కుటుంబ భారం వహించారు. కానీ ఆయనదీ అదే పరిస్థితి. అంతవరకూ జమిందారులుగా సకల భోగాలు అనుభవిస్తూ గడిపిన వారు ఒక్కసారిగా గట్టున పడ్డ చేపల్లా అన్నిటినీ పోగొట్టుకుని పేదవాళ్లయ్యారు. అతి కష్టం మీద 1958 వరకు పది సంవత్సరాల పాటు ఆ కుటుంబాన్ని పోషించిన ఆయన అశక్తుడై మా నరసింగరావుని, గత్యంతరం లేక, మద్రాసు వెళ్లి బ్రతుకు తెరువు వెతుక్కోమని చెప్పి మావయ్య దగ్గరకి పంపించారు. సంగతి తెలుసుకున్న వెంటనే మావయ్య లోపలికి వచ్చి, విషయం చెప్పి, "ఈ కుర్రవాడు నాకు అన్నం పెట్టి ఆదుకున్న ప్రాణ స్నేహితుడి కొడుకు. ఇంకమీదట యిక్కడే వుంటాడు. నీకు ఏ పని కావాలంటే ఆ పని చేయించుకో. వాడు పరాయివాడు కాదు. మన పిల్లల్లో ఒకడు. ఒక వేళ యిక్కడ నచ్చకో, గాలి మళ్లో వాడంతటవాడు వెళ్లిపోతాను అంటే పంపించు. లేకపోతే వాడు చివరివరకూ మనతో, మన యింట్లోనే వుంటాడు. అలా వాడిని చూసు కోవడం నా ధర్మం, నీ బాధ్యత" అని చెప్పారు. అప్పటి నుంచి నరసింగ మా అబ్బాయిగా మాతోనే వుండి పోయాడు. పాపారావు గారి ముగ్గురు అమ్మాయిలకి మావయ్యే పెళ్లి చేసారు. అందుకే ఎవరైనా నరసింగ ఎవరని అడిగితే మా అక్కయ్యగారి అబ్బాయి అని చెప్తాను. మా పిల్లలందరూ కూడా నరసింగ మా అన్నయ్య అనే చెప్తారు. ఇంతవరకు నరసింగ పరాయివాడన్న భావం ఎవరిలోను కలగలేదు.

అలాగే నాకు యింటి పనులలో సహాయ పడుతూ, మావయ్య ఊరికివెళితే కూడా వెళుతూ మా యింట్లో కొమరవోలు కృష్ణారావు, తమ్ముడు కృష్ణగా సెటిల్ అయ్యాడు. ఒక అక్షరం కూడా చదవడం, రాయడం రాదు. వీళ్లిద్దరూ దాదాపు యాభై సంవత్సరాలుగా యిక్కడే మాతో మా కుటుంబ సభ్యులుగా మారిపోయారు.

1960-61 దాకా మా సొంత సినిమా ప్రొడక్షన్ వుంది. మా మరిది (తాత అని పిలిచే వాళ్లం) ఆ పనులు చూసుకుంటూ వుండేవాడు. 61 తరువాత యింక ప్రొడక్షన్ వద్దు. మనకి కలిసిరాలేదు అని గట్టిగా నిర్ణయించుకుని మూసేసారు. అప్పుడు మా తాత మాధవరం మిల్క్ కాలనీలో ఆవులు పెట్టుకోవడానికి అప్లయి చేశాడు. అక్కడి నుంచి అనుమతి లభించాక మావయ్యతో చెప్పాడు. అక్కడే క్వార్టర్స్ కూడా యిస్తున్నారంటే మావయ్య యింటి మీద 25000 రూపాయలు అప్పు చేసి పది ఆవులు పది గేదెలు 1963లో కొనిచ్చారు. రెండు, రెండున్నర సంవత్సరాలు బాగా జరిగింది. ఆ తరువాత పశువులకి జబ్బు చేసి చని పోయాయి. 66లో మాధవరంలో యిల్లు ఖాళీ చేసి వచ్చేశారు. 1968లో బి.ఎన్.రెడ్డిగారి అల్లుడు హెచ్.జి.వి.రెడ్డి గారు సర్జికల్ ఇన్స్ట్రుమెంట్ ప్లాంట్‌లో జనరల్ మానేజర్‌గా పని చేసే వారు. వారితో సిఫారసు చేయించి అక్కడ టైం కీపర్ ఉద్యోగం యిప్పించారు.

మావయ్య చాలా సున్నిత మనస్కులు.

ఎవరినీ ఏ రకంగానూ నొప్పించే వారు కాదు. భలే తమ్ముడు సినిమాలో పాడటానికి ఆ చిత్ర నిర్మాతలు మహమ్మద్ రఫీగారిని మద్రాసు పిలిపించారు. ఆయన యిక్కడికి వచ్చిన వెంటనే మావయ్యని కలిసి "మీరుండగా నేను తెలుగులో పాటలు పాడకూడదు. మీరేమీ అనుకోవద్దు. నేను తిరిగి బొంబాయి వెళ్లిపోతాను" అన్నారు. దానికి మావయ్య "అలాంటిదేమీ పెట్టుకోవద్దు. మీరు పాడితే మీకు ఫ్లయిట్ ఖర్చులు, యితర ఖర్చులతో పాటు నాకిచ్చేదానికన్నా ఎక్కువ యిస్తారు. కాబట్టి మీరు లాభం పొందండి. అంతే. మనసులో ఏమీ పెట్టుకోక పాటలు పాడండి" అన్నారు.

## రఫీ

ఈ సందర్భంలో మరో విషయం గుర్తొస్తోంది. తెలుగులో అంజలీదేవిగారు తీసిన "సువర్ణ సుందరి" సినిమా సంగీత పరంగా ఎంతో విజయాన్ని సాధించింది. అది హిందీలో తీస్తున్నప్పుడు లతామంగేష్కర్, రఫీ "హాయి హాయిగా ఆమని సాగే" పాటని హిందీలో పాడటానికి మద్రాసు వచ్చారు. ఈ పాట వరస కుదరక రఫీగారు ముందు కొద్దిగా యిబ్బంది పడ్డారు. తెలుగులో మావయ్య పాడిన పాట విని లతాగారు ఎంతగానో మెచ్చుకున్నారు. హిందీ రిహార్సల్ జరుగుతున్నప్పుడు మావయ్య వేరే రికార్డింగ్ కోసం అక్కడికి వెళ్లారు. ఈయనని లతాగారు చూసి "ఒక్కసారి ఈ పాటని నాతో పాడండి" అని అడిగారు. ఆయన పాడనన్నారు. ఆయనని కనీసం ఒక్కటైనా పాడమని బలవంతం చేసారు. నేను బాగా అలిసిపోయాను. పాడలేను అని కుంటి సాకు చెప్పారు. లతాగారు ఆయనని యింటికి వెళ్లి విశ్రాంతి తీసుకొని, వచ్చి పాడమని అన్నారు. సరేనని యింటికి వచ్చి విషయమంతా నాతో చెప్పి "రఫీ గారు పాడటానికి వచ్చినప్పుడు నేను పాడకూడదు. అది సభ్యత కాదు. అలా పాడి ఆయనని కించపరచలేను. నేను వెళ్లను" అన్నారు. అలాగే వెళ్లలేదు.

"చిరంజీవులు" సినిమాలో "తెల్లవారవచ్చె తెలియక నా స్వామి" పాటని మొదట లతా మంగేష్కర్ చేత పాడిద్దామనుకున్నారు. కానీ అప్పుడు బొంబాయిలో ఆర్టిస్టుల గొడవలు జరుగుతున్నాయి. బొంబాయి ఆర్టిస్టులు వేరే రాష్ట్రాలకు వెళ్లి పాటలు పాడకూడదని అనడం చేత ఈ పాటని లీలగారి చేత పాడించారు.

బొంబాయిలో ఒకసారి మావయ్య సంగీత కచ్చేరి ఏర్పాటు చేస్తే దానికి ప్రముఖులెందరో హాజరయ్యారు. అందులో నౌషాద్, సి.రామచంద్ర, శంకర్ జైకిషన్ మొదలైన వారున్నారు. వి.శాంతారాంగారు హిందీ సినిమా 'నౌరంగ్'లో మావయ్య చేత పాడించాలని మాట్లాడారు. కానీ ఏవో కారణాల వల్ల జరగలేదు.

## అనార్కలి

అంజలీ పిక్చర్స్ 'అనార్కలి' సినిమా నిర్మాణంలో వున్నప్పుడు ఔట్‌డోర్ షూటింగ్‌కి వెళ్లారు. అనార్కలి సమాధి కట్టిన తరువాత ఏదైనా పాట వుంటే బాగుంటుందని ఆది నారాయణరావుగారు ఆ ఊరి నుంచి అర్జంట్‌గా ఒక పాట రాయించి, ట్యూన్ చేసి రికార్డు చేసి పంపమని రాసారు. మావయ్య వెంటనే సముద్రాల రామానుజం గారి దగ్గరకి వెళ్లి పాట రాయించుకుని ట్యూన్ చేసి రికార్డు పంపిస్తే వాళ్లు షూటింగ్ ముగించుకున్నారు. అదే ట్యూన్ సినిమాలో ఉంచారు. మావయ్య, మిగిలిన సంగీత దర్శకులు ఎంతో సఖ్యంగా కలిసిమెలిసి వుండే



వాళ్లు. ఆప్యాయతలే తప్ప అసూయలు లేవు. పద్యాలు వస్తే చాలామంది మావయ్యనే ట్యూన్ చెయ్యమనే వారు. మావయ్య తన సొంత ఖర్చులని తనే భరించే వారు. కానీ ఏ నిర్మాత మీదా ఆధార పడలేదు. రికార్డింగ్‌కి నిర్మాత కారు పంపిస్తానంటే వద్దని మా సొంతకారులోనే వెళ్లేవారు. ఆయనకి చాలా అరుదుగా కోపం వచ్చేది. అదైనా కాసేపే. తనకి నచ్చని పాటలు పాడినప్పుడు యింటికి చాలా విసుగ్గా వచ్చేవారు. ఈ రోజు నా మనసేమీ బాగాలేదు అనేవారు. కొంచెం సేపు తరువాత తిరిగి మామూలుగా అయిపోయే వారు. అప్పగింతల పాటలు చెయ్యవలసి వొస్తే ఆయన చాలా బాధపడే వారు. ముందుగా ఏడుపు వచ్చేది. మన యింట్లో మన అమ్మాయిల పెళ్లిళ్ళు చేసేటప్పుడు అప్పగింతల ఘట్టం ఉండడానికి వీల్లేదు. ఇంతకాలం మనం ఆడపిల్లలను పెంచి యింకొకళ్లకి ఎలా అప్పగిస్తాం? అనే వారు. అలాగే మా పిల్లల పెళ్ళిళ్ళు తను వుండగా జరగలేదు.

1949-1950లో సాంధ్యశ్రీ, అద్వైతమూర్తి, పుష్పవిలాపం రికార్డులుగా వచ్చినప్పుడు ఒక మలయాళపు అతను (తెలుగురాదు) ఆ పద్యాలు విని నలభై పేజీల పుస్తకంలో మావయ్య కంఠాన్ని గురించి, మాధుర్యం, గాంభీర్యం, బాణీల గురించి ఇంగ్లీషులో వర్ణించి మాకు యిచ్చి వెళ్లాడు.

## లవకుశ/నాగయ్య

"లవకుశ" సినిమా ఏడు సంవత్సరాలు తీసారు. దానికి నిర్మాత శంకరరెడ్డిగారు. అన్ని సంవత్సరాలు ప్రొడక్షన్ అయ్యేసరికి ఆర్థికంగా ఆయన చితికి పోయారు. అందుకని అన్ని పాటలూ మావయ్యనే పాడమని, "మరొకరితో పాడిస్తే మళ్లీ డబ్బులివ్వవలసొస్తుంది. నా పరిస్థితి బాగులేదు" అని అన్నారు. అందుకని ఆ సినిమాలో అన్ని పాటలు మావయ్యే పాడారు. ఆ కారణంగా నాగయ్యగారికి పాడవలసొచ్చింది. ఈ విషయం తలచుకుని వణికి పోయారు. "నేనేమిటి నాగయ్య గారికి పాడటమేమిటి? ఇంతకంటే అపచారం వుంటుందా? నాకా అర్హత లేదు" అనుకుంటూ నాగయ్యగారింటికి వెళ్లి విషయం చెప్పారు. నాగయ్యగారు ఆప్యాయంగా ఆయన భుజం తట్టి "చూడు నాయనా! నేను యిప్పుడు పాడే స్థితిలో లేను. నాకు ఎవరో ఒకరు పాడక తప్పదు. ఆ పాడేది నువ్వే అయితే నాకు అంతకు మించిన సంతోషం లేదు" అన్నారు. గాయకుల్లోని గొప్పతనాన్ని గుర్తించగలిగిన సంస్కారి ఆయన. తెనాలి రామకృష్ణ, పూలరంగడు చిత్రాలలో నాగయ్యగారితో కలిసి పాడటం తన పూర్వజన్మసుకృతం అంటుండేవారు మావయ్య. ఇండస్ట్రీలో అందరూ ఆయన్ని "మాష్టారు" అని గౌరవంగా, ప్రేమగా పిలిచేవారు. ఒక్క సముద్రాల గారు మాత్రమే ఆయన్ని "ఒరే నాయనా" అని పిలిచేవారు. అలా పిలిపించుకోవడం ఆయనకి చాలా యిష్టం.

## గిరిజా కళ్యాణం

మావయ్యకి పంకజ్ మల్లిక్, సైగల్, రఫీ అభిమాన గాయకులు. వాళ్ల పాటలు వింటూ చాలా ఆనందించే వారు. ఇటువంటి మధుర గాయకులకు జన్మనిచ్చిన వాళ్ల తల్లిదండ్రులు ఎంతో అదృష్టవంతులని అంటుండే వారు. ఎస్.రాజేశ్వరరావు, నౌషాద్ సంగీతమంటే ఆయనకి చాలా యిష్టం.

కంచి పీఠాధిపతులు మద్రాసులో ఒకసారి చాతుర్మాసం చేశారు. చాతుర్మాస దీక్ష చేసి సాయంకాలం ఏదో ఒక ప్రోగ్రాం చేసేవారు. అనుకున్నంతగా జనం రాలేదు. చిన్నపీఠాధిపతి గారు పెద్దాయనతో "ఘంటసాల గారి కచ్చేరీ పెట్టించుకుంటే జనం ఎక్కువ మంది వస్తారు. ఘంటసాలగారికి దైవభక్తి ఎక్కువ. ఆ భక్తిపాటలు పాడాడంటే తప్పకుండా ఎక్కువ జనం వస్తారు. మీరు ఆయన ప్రోగ్రాం పెట్టించండి" అంటే వారి తరపు మనుషులు మా యింటికి వచ్చారు. మావయ్య పాడతానన్నారు.

పెద్దస్వామి వారు వున్నచోట కరెంటు దీపాలు, మైకులు ఉండకూడదు. మైలాపూరులో మైకులతో ఆ ప్రోగ్రాం బయట పెట్టారు. ఆ ప్రోగ్రాంకి విపరీతమైన జనం వచ్చారు. ఆ వీధిలో ట్రాఫిక్ జామ్ అయింది. ఆ కచేరిలో అష్టపదులు, గిరిజా కళ్యాణం మొదలైనవి పాడారు. ఇది అయిపోయిన తరువాత కంచి పీఠాధిపతి పెద్దాయన మళ్లీ

రమ్మని కబురు చేస్తే వెళ్లాము. అప్పుడు ఆ స్వామివారు "నువు పాడిన గిరిజా కళ్యాణం చాలా బాగుంది. సంస్కృత పదాల విరుపు, అర్థం చెడకుండా అష్టపదులు చాలా బాగా పాడావు. నీ కంపోజింగ్ చాలా బాగుంది. మైక్‌లేకుండా నాకొకసారి వినాలని వుంది" అన్నారు. మావయ్య మైక్‌లేకుండా పాడారు. మర్నాడు హిందూ పేపర్లో ప్రోగ్రాం గురించి రివ్యూ బాగా రాసారు. చాలా బాగుందని మెచ్చుకున్నారు.

అప్పటినుంచి గిరిజా కళ్యాణం ప్రతి కచేరీలోను టైం కలిసిసొస్తుందని, తన కిష్టమని పాడేవారు. ఈ గిరిజా కళ్యాణం శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రి గారు రాసారు. ఈ గిరిజా కళ్యాణాన్నే మామయ్య 1963లో హైదరాబాదులో శంకరమఠంలో శంకరాచార్యులు గారి దగ్గర పాడారు. దీన్ని ఆకాశవాణి హైదరాబాద్ వారు యిప్పటికి భక్తిరంజనిలో వినిపిస్తున్నారు.

ఈ గిరిజా కళ్యాన్ని "రహస్యం" సినిమాకి రాసారు. దాన్ని మావయ్య, సుశీల, లీల, మల్లిక్ మొదలైన వారు పాడారు. గిరిజా కళ్యాణం పాడేటప్పుడు "చెలువారు మోమున లేలేత నగవుల" అని వస్తుంది. అది అమ్మవారు శివుడికి అర్చన చేసుకోవడానికి వెళ్తూ వుండగా చెలికత్తెలు అడుగుతారు కదా! ఈ లైను ఎలా ట్యూన్ చెయ్యాలి అని అనుకుంటూ 'పాత పాట లున్నాయి. ఆ పాటలు మీ అమ్మ, అమ్మమ్మలు పాడే వారు కాదా, వాళ్లని అడగరాదా' అన్నారు. నేను మా అమ్మమ్మని (అత్తగారు) పాడి వినిపించవా అంటే ఆ చరణం పాడింది. ఆ ట్యూనే మావయ్య పాడారు.

అలాగే 'వినాయక చవితి' సినిమాలో నలుగు పాటకి, గొబ్బిళ్ల పాటలకి నాకు ట్యూన్ రావడం లేదు. పాడి వినిపించు అన్నారు. పాడితే అవే ట్యూన్స్ సినిమాలో పెట్టుకున్నారు. పల్లెటూర్లలో సంక్రాంతికి గొబ్బెళ్లు పెట్టుకుని పాటలు పాడటం చిన్న పిల్లలకు అలవాటు. ఆయన ముందు పాడటం మాకు భయం అంటే 'భయం ఎందుకు? నేను కోప్పడటం లేదు. పాడి వినిపిస్తేనే కదా నాకు తెలిసేది' అనేవారు. మా పెద్దబాబుతో సహా ఎవరూ ఆయన ముందు పాడటానికి సాహసించే వాళ్లం కాదు.

"జీవిత చక్రం" సినిమాకి శంకర్‌గారు సంగీత దర్శకులు. అప్పటికి జైకిషన్‌గారు మరణించారు. బొంబాయిలో రికార్డింగుకి రమ్మని పిలిస్తే నన్ను బొంబాయి చూపిస్తానని తీసుకెళ్ళారు. ఏదో పుస్తకాలు, పత్రికలు తిరగేస్తున్నారు. ఖద్దరు ధోవతి, చొక్కావేసుకొని వున్నారు. హిందీ వాళ్లు ఆయనని చూసి ఆయనేం పాడతాడు? చూడటానికి ఎలా వున్నాడు. పాంటు షర్టు కూడా వేసుకోలేదు. ఈయన తప్ప యింకెవరూ దొరకలేదా అని మాట్లాడు కోవడం మొదలు పెట్టారు. శంకర్‌గారు నా దగ్గరకు వచ్చి తెలుగులో "అమ్మా నా భవిష్యత్తు ఈ సినిమా మీద ఆధార పడి వుంది. ఘంటసాల గారు బాగా పాడాలి." అన్నారు. ఆయన రిహార్సల్లో గొంతు విప్పి పాడితే అక్కడ స్పీకర్లు వైబ్రేషన్‌తో దద్దరిల్లాయి. అది చూసి ఆయన గురించి అనేక విధాలుగా మాట్లాడిన వారు ఆశ్చర్యపోయి ఎంత గొప్ప కంఠం అని నమస్కారాలు చేశారు. దేవుడి దయవల్ల ఆ సినిమాలో పాటలన్నీ బహుళ ప్రజాదరణ పొందాయి.

మావయ్య అమెరికాలో ప్రోగ్రాం యిచ్చి నప్పుడు చాలా మంది అమెరికన్స్ వచ్చారట. ఆయన పాడుతుంటే వైబ్రేషన్ ఫీలై గోడలు తాకి చూస్తే వైబ్రేట్ అవుతున్నాయట. ఆ మర్నాడు ఇంగ్లీషు పేపర్లలో "ఇలాంటి మెటాలిక్ వాయిస్ ఎక్కడా వినలేదు. అద్భుతమైన గంభీరమైన కంఠం" అని రివ్యూ వ్రాసారు.

## శ్రీ వెంకటేశ్వర మహత్యం

మావయ్య ఆరాధ్య దైవం తిరుపతి వేంకటేశ్వరుడు. తిరుమల తిరుపతి దేవస్థానం వారు ఆయన్ని ఆస్థాన గాయకుడిగా నియమిస్తున్నట్లు



ఉత్తరం రాసినప్పుడు ఆయన పొందిన ఆనందం వర్ణనాతీతం. తన జీవితం ధన్యమైనట్లు భావించారు. ఎన్నో జన్మల తపస్సు ఫలంగా ఈ పదవి లభించింది అనే వారు. 1970 నుంచి 1973దాకా ఆ పదవిలో వున్నారు. అందుకుగాను దేవస్థానం వారు మావయ్యకి ఒక బంగారు పతకాన్ని గుర్తుగా యిచ్చారు. ఆస్థాన గాయకులుగా నియమించిన వెంటనే కుటుంబంతో తిరుపతి వెళ్లాము. ఆలయంలో గర్భగుడికి ఎదురుగా మావయ్యని, మమ్మల్ని కూర్చో పెట్టారు. ఆరోజు మావయ్య అక్కడ చాలాసేపు పాటలు పాడారు. తరువాత మాకందరికి వంటశాల, అద్దాల మందిరం, స్వామివారి వివిధ వాహనాలు అన్ని చూపిస్తూ మావయ్య కూర్చుని పాడిన స్థలంలో వాగ్గేయకారుడు అన్నమయ్య కూర్చుని సంకీర్తనలు పాడేవారని, ఆ తరువాత మావయ్యే కూర్చున్నారని, అక్కడ కూర్చో పెట్టమని దేవస్థానం ఉత్తరువని చెప్పినప్పుడు, మా అదృష్టానికి మాకే మాటలు రాలేదు. ఆరోజు అక్కడ పాడుతున్నప్పుడు అనుకోకుండా చాలా కాకతాళీయంగా ఎస్.జానకి, ఆవిడ భర్త రామం కనిపించారు. ఎలాగు వచ్చారు కదా, రెండు పాటలు పాడండి అని మావయ్య అన్నారు. ఆవిడ దాన్ని మహాభాగ్యంగా భావించి కీర్తనలు పాడారు. ఆ తరువాత మళ్లీ యింతవరకు ఎవ్వరినీ అక్కడ కూర్చుని పాడటానికి అనుమతించలేదని యిటీవల నేను తిరుపతి వెళ్లినప్పుడు చెప్పారు. ఆ అదృష్టం, గౌరవం రెండు మావయ్యకే దక్కాయి. అమెరికాలో ఐక్యరాజ్యసమితిలో పాడినప్పుడు వారు శాంతి పతకాన్ని యిచ్చారు. ఈ రెండూ మావయ్య తనకు లభించిన అత్యున్నత గౌరవంగా భావించేవారు.

ఆయన పాడిన పాటలలో ఏది బాగా నచ్చింది అంటే చెప్పటం చాలా కష్టం. ఎక్కువ శాతం ఆయనకి నచ్చినవే పాడారు. జయభేరి చిత్రంలో పాటలు, అష్టపదులు, లవకుశలో "ఏ నిమిషానికి ఏమి జరుగునో ఎవరూహించెదరు" మొదలైనవన్నీ యిష్టమే. ఒకరోజు ఆయన యింటికి చాలా సంతోషంగా వచ్చి "ఈరోజు నేను చాలా మంచి పాట పాడాను విను" అంటూ "నను పాలింపగ నడిచి వచ్చితివా" అనే పాట బుద్ధిమంతుడు సినిమా కోసం పాడినది పాడి వినిపించారు. ఇంట్లో తీరికగా వున్నప్పుడు ఈ పాటలు పాడుకుంటూ వుండేవారు.

ఆయన చాలామంది గాయనీగాయకులతో పాడారు కానీ భానుమతి గారితో పాడేటప్పుడు ఆయన ఛాలెంజ్‌గా తీసుకుని పాడేవారు. ఏ రంగంలోనైనా సమ ఉజ్జీ వున్నప్పుడే పోటీ వుంటుంది. అలా పోటీ వున్నప్పుడే పాట బాగా వచ్చేది అనే వారు. మల్లీశ్వరి సినిమా అప్పుడు కూడా అందరు భానుమతి గారు బాగా పాడతారా ఘంటసాల గారు బాగా పాడతారా అని అనుకునే వారు అంటే, యిద్దరూ అంత పోటాపోటీలుగా పాడేవారన్నమాట. మిగిలిన వాళ్లంతా చిన్నపిల్లలు అనేవారు. సారంగధర సినిమాకి మావయ్య సంగీత దర్శకులు. రామారావుగారు, భానుమతి గారు నటించారు. ఈ సినిమాకి మావయ్య సంగీతం చేసిన విధంగా పాడతానని ఆవిడ అన్నారు. సాధారణంగా అయితే ఆవిడ శృతికి సరిపడేటట్లుగా ట్యూన్ చేయించుకునేవారు. మావయ్య పాటలు పాడటానికీ, సంగీత దర్శకులు కావటానికి భానుమతి గారు, ఆవిడ భర్త రామకృష్ణగార్ల ప్రోత్సాహం ఎంతో వుంది. ముఖ్యంగా రామకృష్ణగారికి మావయ్యంటే ఎంతో అభిమానం, యిష్టం. ఆ కారణంగానే వాళ్ల సొంత సినిమా రత్నమాలకి సి.ఆర్.సుబ్బరామన్ గారికి సహాయ సంగీత దర్శకులుగా నియమించారు.

మావయ్య చేత త్యాగరాజ కీర్తనలు రికార్డుగా చేయించి విడుదల చేయించాలని చాలా కోరిక. కానీ ఆయన పాడలేదు. దానికి కారణం శాస్త్రీయ సంగీతం పాడాలంటే నెల, రెండు నెలలు సాధన చెయ్యాలి. గొంతు శాస్త్రీయ సంగీతానికి అలవాటు పడితే మళ్లీ లలిత సంగీతం పాడటం కష్టం అనే వారు.

(ఇంకా వుంది)

సెప్టెంబరు 5 గిరిజ వర్ధంతి సందర్భంగా




నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ
తీరుతెన్నులపై అధ్యయనం
చేసిన రచయిత, జర్నలిస్టు నటుడు

**రావి కొండలరావు**

రాసిన వ్యాసమిది



# హాస్యంలో విషాదం-గిరిజ



కొందరు హీరోయిన్లుగా ప్రవేశించి, హాస్యనటులవుతారు. కొందరు హాస్యనటులుగా వచ్చి హీరోయిన్లవుతారు. 'ఇందులో తొలి మాట ప్రకారం చూస్తే ఒక గిరిజ కనిపిస్తుంది. కస్తూరి శివరావు తానే నిర్మాతగా దర్శకుడిగా తీసిన 'పరమానందయ్య శిష్యులు' (1950)లో గిరిజని నాయికగా పరిచయం చేశాడు శివరావు. అందులో అక్కినేని నాయక పాత్రధారి. గిరిజ తల్లి దాసరి తిలకం. నాటి నాటకాల్లోనూ, సినిమాల్లోనూ నటించారామె. యస్.వి.రంగారావు ప్రవరుడిగా, తిలకం వరూధినిగా నటించిన "వరూధిని" తిలకం తొలిచిత్రం కావచ్చు. అంతకు ముందు చిన్నచిన్న వేషాలు వేసినట్టు తెలుస్తున్నా! 1946లో 'వరూధిని' విడుదలై దెబ్బతిన్నది. ఆ ప్రబంధ కథ ప్రజకి నచ్చలేదో, తీసిన బి.వి.రామానందం సరిగా తియ్యలేదో! చూసిన వాళ్లున్నారు గాని, గుర్తులేదు.




'పరమానందయ్య శిష్యులు'లో గిరిజ అందంగానే కనిపించింది. బాగానే వుందనిపించినా, అక్కినేని పక్కన నటించినా, చకచకా పాత్రలు రాలేదు. ఒకటి రెండు సినిమాల్లో సాదా పాత్రలు ధరించిన తర్వాత, హాస్యనటుల ప్రక్కన నటించి, 'హాస్యనటి'గా మారిపోయింది. ఈ మార్పుకి కొన్నేళ్ళు పట్టినా, తర్వాత ఆ హాస్య పాత్రలు ఆమెను స్థిరపరిచాయి. హాస్య నటులందరి పక్కనా ఆమె నటించినా, రేలంగితో ఎక్కువగా నటించడంతో అదో జంటగా నిలబడి పోయింది - 'రేలంగిరిజంట'గా అప్పుచేసి పప్పుకూడు, భార్యాభర్తలు, కులగోత్రాలు, రాముడు భీముడు, జగదేకవీరునికథ, పెళ్లికానుక మొదలైన సినిమాలు గిరిజని చక్కని హాస్యనటిగా గుర్తు చేస్తాయి.

1961లో 'పెండ్లి పిలుపు' షూటింగు. అందులో ఆమె రేలంగి పక్కనే. పల్లెటూరి పాత్ర. ఉత్తరాంధ్ర యాసలో మాట్లాడే పాత్ర. ఆరుద్రగారు రచయిత. పూసపాటి కృష్ణంరాజు (కీ.శే.) అప్పుడు సినిమాల్లో వుండేవాడు. తక్కువ కథలు రాసినా మంచివి రాశాడు. రాసినవన్నీ



ఉత్తరాంధ్ర భాషలోనే రాశాడు. అంచేత ఆరుద్రగారు అతన్ని ఆ కంపెనీలో పెట్టి గిరిజ సంభాషణలు, సంబడం చూడమన్నారు. ఆ గిరిజ బాత్‌రూమ్‌లోకి వెళ్ళి, షవర్ తిప్పితే భళ్లున నీళ్లొస్తాయి. "ఓలమ్మ వాన, వాన పడిపోతంది" అని పరుగెత్తుతుంది. కృష్ణంరాజు వూరుకోలేదు. డైలాగు సరిదిద్దడానికి ప్రయత్నించాడు. "ఓలమ్మవోన, వోనడిపోతంది" అని చెప్పాలన్నాడు. అవి డబ్బింగ్‌లో సర్దుకో వచ్చులే అన్నరోజులు కావు. అక్కడికక్కడే రికార్డింగు. "వోనేంటి వోన! వోనడిపోతంది - అంటే అర్థం కాదు. మరీ అంత యాసలోకి వెళితే, అక్కడి వాళ్లకి అర్థం కావచ్చునేమో గాని, తక్కిన ప్రాంతాల వాళ్లకి అసలు అర్థం కాదు. అంచేత వాన అనీ, పడిపోతంది అనీ అంటాను" అని గిరిజ వాదించారు. "ఆమె చెప్పింది కరక్టే - మరీ ఇంటీరియర్ భాష వొద్దులెండి'' అని నిర్మాత డి.బి.నారాయణ గిరిజనే సమర్థించారు. గిరిజ సంతోషించింది కాని కృష్ణంరాజు సంతోషించలేదు. "భాషని ఖూనీ చేస్తున్నారే" అని బాధ పడిపోయాడు. షాట్ అయిపోయిన తర్వాత "అక్షరాల్లో తేడా వున్నా, యాసలో తేడా రాదు. యాస గనక సరిగ్గా వస్తే, ఏ అక్షరం పడినా ఇబ్బంది వుండదు" అని గిరిజ అంది. కృష్ణంరాజు ఒప్పుకున్నాడు. "మంచి స్టడీ వున్న ఆర్టిస్టు'' అని ఆరుద్రగారు సర్టిఫికేట్ ఇచ్చారు. గిరిజ సంభాషణలు శుభ్రంగా వినిపిస్తాయి. ఏ అక్షరమూ పొల్లు పోదు. ఎక్స్‌ప్రెషన్ వుంటుంది. మంచి కళ్ళు గనుక, కళ్లు కూడా ఆమెతో పాటు నటించి, సహకరించి, పకపకమనిపిస్తాయి.





అప్పటి నటీమణులకు మంచి సంప్రదాయాలు, అలవాట్లూ వుండేవి. పండగా పబ్బం వస్తే ఇంటి నుంచి గారెలో, బూరెలో పెద్ద పాత్రలలో తెచ్చి, చిన్నా పెద్దా అందరికీ ఇచ్చేవారు. ఆ ఆప్యాయతాభిమానానురాగాలు అలాంటివి. సూర్యకాంతం, గిరిజ, షావుకారు జానకి, కృష్ణకుమారి సెట్టుకి వస్తే "ఏదో తెచ్చి వుంటారు - ఇస్తారు'' అని ఎదురుచూసే వారు అంతా.

గిరిజకి తేనాంపేటలో పెద్దమేడ వుండేది. మేడమీద ఏర్‌కండిషన్ గదులు. పెద్ద కారుండేది. ఎంతో దర్జాగా హీరోయిన్ స్థాయిలో కనిపించిన గిరిజ ఎందుకో ఎలాగో రానురాను చితికి పోయింది. ఆ మేడ, ఆ కారూ అవన్నీ ఏమైపోయినాయో తెలీదు. మనిషి బక్కచిక్కిపోయి, పాలిపోయింది. సినిమాలు తగ్గిపోయాయి. ఓ సినిమాలో గుడిసెలో వుండే ఒక బీద పాత్రకి ఆమె పర్సనాలిటీ సరిపోతుందని ఇచ్చారు. మూడు రోజులు షూటింగ్ చేశారు. తర్వాత ఆమెను మార్చి ఆ పాత్ర ఇంకొకరికి ఇచ్చారు! కారణం - ఆ పాత్రకి పూర్వకథ వుందిట. ఆ కథలో ఆమె బాగా ఐశ్వర్యవంతురాలు. రానురాను ఆస్తిపాస్తులు పోయి, ఆరోగ్యం చెడిపోయి పేదది అయిపోతుంది. "పేదకి పర్సనాలిటీ సరిపోతుంది గాని, ముందు దృశ్యాల మాటేమిటి?'' అని దర్శకుడు, నిర్మాత చర్చలు చేసి ఆమె పారితోషికం కొంత చెల్లించి, ఆమెను మార్చేశారు. అటు తర్వాత ఆమె మరీ దౌర్భాగ్యస్థితి అనుభవించింది. ఎక్కడి హాస్య పాత్రలు, ఎక్కడ గిరిజ? అంతటి దీనావస్థ ఎలా కలిగింది ఆమెకి? అయోమయం, అర్థంకాని విషయం.

**'సినిమా వారికి ఇది శాపం' అని సర్ది చెప్పుకున్నా -**
**జరిగి (తిరగేస్తే గిరిజ)న స్థితి తలచుకుని,**
**చివరిదశ తలచుకుంటే ఆ గాథ పెద్దబాధే!**
**ఒక ఊపు వూపి, జనాన్ని తెగనవ్వించిన జంట,**
**రేలంగిరిజంట. ఆయా పాత్రల్లో గిరిజలేని రేలంగినీ,**
**రేలంగి లేని గిరిజనీ ఊహించుకోలేం.**

**చిత్రం: జగదేకవీరుని కథ** రచన: పింగళి నాగేంద్రరావు
సంగీతం: పెండ్యాల నాగేశ్వరరావు గానం: ఘంటసాల, స్వర్ణలత

అతడు : ఆశా ఏకాశా
నీ నీడను మేడలు కట్టేశా ॥ఆశా॥
ఆమె : చింతలో రెండు చింతలో
నా చెంతకాదు నీ తంతులూ ॥చింతలో॥
అతడు : వద్దంటె కాదే ముద్దుల బాలా
ప్రేమ పరగణా వ్రాసేశా
నిన్ను రాణిగా చేసేశా
చేతులు జోడించి మ్రొక్కేశా ॥ఆశా॥
ఆమె : కోశావులేవోయి కోతలు చాల
చూశానులే నీ చేతలూ
రాజు ఉన్నాడూ! మంత్రి ఉన్నాడు
సాగవు సాగవు నీ గంతులు ॥చింతలో॥
అతడు : ఆ! రాజా? మంత్రా? ఎవరూ? ఎక్కడ?
రాజుగారి బూజు దులిపేస్తా
మంత్రిగారి చర్మం ఒలిచేస్తా
కోటలో పాగా వేసేస్తా
గట్టిగ నీ చెయ్యి పట్టేస్తా ॥ఆశా॥

**చిత్రం: అన్నపూర్ణ** రచన: ఆరుద్ర
సంగీతం: సుసర్ల దక్షిణామూర్తి గానం: జిక్కి

కులాసా రాదోయ్ రమ్మంటే
మజాకా కాదోయ్ వలపంటే
ఖలేజా అంటూ వుండాలోయ్... రాజా
అదుంటే యెపుడూ నిన్ను ఎడబాయనోయ్ ॥కులాసా॥
ఓ.... ఓ.....
గులాబీ చక్కదనం జిలేబీ తియ్యదనం
చలాకీ సొగసుల లేతదనం కలసిన యవ్వనం
నీదేచేసెద అందము
నీకూ నాకూ బంధము - పోనోయ్ - పొమ్మంటే ॥కులాసా॥
వయ్యారం ఒలికిస్తా హుషారు కలిగిస్తా
వరించి నీచే వలిపిస్తా - హోహో అనిపిస్తా
రావాలనుకొని వచ్చావు యిక
పోవాలన్నా పోనీను - మనసోయ్ నీవంటే ॥కులాసా॥

**చిత్రం: వెలుగునీడలు** రచన: శ్రీశ్రీ
సంగీతం: పెండ్యాల గానం: పి.సుశీల, ఘంటసాల

ఆ: హోయిహోయిగా జాబిల్లి - తొలి రేయి వెండిదారాలల్లి
మందు జల్లి నవ్వసాగె ఎందుకో - మత్తు
మందు జల్లి నవ్వసాగె ఎందుకో ॥హోయి హోయిగా॥
తళతళ మెరిసిన తారక - తెలి వెలుగుల వెన్నెల దారుల
అ: కోరి పిలిచెనో తన దరిచేరగా
మది కలిచెనో తీయని కోరిక ॥హోయి హోయిగా॥
మిలమిల వెలిగే నీటిలో -చెలి కలువల రాణీ చూపులో
ఆ: సుమదళములు పూచిన తోటలో
తొలి వలపుల తేనెలు రాలెనా ॥హోయి హోయిగా॥
విరిసిన హృదయమె వీణగా -మధురసముల కొసరిన వేళల
అ: తొలి పరువము లొలికెడు సోయగం
కని పరవశమందెనొ మానసం ॥హోయి హోయిగా॥

**చిత్రం: కులదైవం** రచన: కొసరాజు
సంగీతం: మాస్టర్ వేణు గానం: ఘంటసాల, జమునారాణి

అ: పదవే పదవే వయ్యారి గాలిపటమా
పదవే పదవే వయ్యారి గాలిపటమా
పైన పక్షిలాగా ఎగిరిపోయి పక్కచూపు చూచుకుంటూ
తిరిగెదవే గాలిపటమా ॥పద॥
ప్రేమ గోలలోన చిక్కిపోయినావ
నీ ప్రియుడున్న చోటుకై పోదువా
ఆ: ఓ.... ప్రేమ గోలలోన చిక్కిపోయినావా
నీ... ప్రియుడున్న చోటుకై పోదువా
నీ తలుకంతా నీ కులుకంతా
అదియెందుకో తెలుసును అంతా ॥పద॥
నీకు ఎవరిచ్చారే బిరుదు తోక
కొని తెచ్చావేమో అంతేగాక
అ: రాజులెందరూడిన, మోజులెంత మారినా
తెగిపోక నిల్చె నీ తోకా ॥పద॥
ఆ: నీలి మబ్బుల్లో ఆడుకుందువేమో
మింటి చుక్కల్తో నవ్వుకుందువేమో
అ: వగలాడివిలే జగదంతవులే
దిగిరాకుండా యెటులుందువులే ॥పద॥

**చిత్రం: అప్పుచేసి పప్పుకూడు** రచన: పింగళి నాగేంద్రరావు
సంగీతం: యస్.రాజేశ్వరరావు గానం: ఘంటసాల, స్వర్ణలత

అతడు : కాశీకి పోయాను రామాహరీ!
గంగతీర్థంబు తెచ్చాను రామాహరీ!
ఆమె : కాశీకి పోలేదు రామాహరీ,
ఊరి కాల్వలో నీళ్లండి రామాహరీ
మురుగు కాల్వలో నీళ్లండి రామాహరీ!
అతడు : శ్రీశైల మెళ్లాను రామాహరీ!
శివుని వీభూతి తెచ్చాను రామాహరీ!
ఆమె : శ్రీశైలం పోలేదు రామాహరీ!
శివుని వీభూతి తేలేదు రామాహరీ!
ఇది కాష్టంలో బూడిద రామాహరీ!
అతడు : అన్నమక్కరలేదు రామాహరీ!
నేను గాలి భోంచేస్తాను రామాహరీ!
ఉత్త గాలి భోంచేస్తాను రామాహరీ!
ఆమె : గాలితోపాటుగా రామాహరీ!
వీరు గారెలే తింటారు రామాహరీ!
నేతిగారెలే తింటారు రామాహరీ!
అతడు : కైలాసమెళ్లాను రామాహరీ!
శివుని కళ్లార చూశాను రామాహరీ!
రెండు కళ్లార చూశాను రామాహరీ!
ఆమె : కైలాసమెళితేను రామాహరీ!
నంది తన్ని పంపించాడు రామాహరీ!
బాగా తన్ని పంపించాడు రామాహరీ!
అతడు : ఆలుబిడ్డలు లేరు రామాహరీ!
నేను ఆత్మయోగీనండీ రామాహరీ!
గొప్ప ఆత్మయోగీనండి రామాహరీ!
ఆమె : ఆ మాట నిజమండి రామాహరీ!
నేను అందుకే వచ్చాను రామాహరీ!
నేను అందుకే వచ్చాను రామాహరీ!

ఓ తమాషా కథ

# ఫినిషింగ్ టచ్...!?

-సూరేపల్లి విజయ

ఆఫ్ఘానిస్తాన్.....

దూరంగా విసిరి పారేసినట్టున్న ఓ కొండ ప్రాంతంలో వుందా తొర్ర, అమెరికా వాళ్ళ పుణ్యమా అని, ఆ తొర్ర అనబడే బంకర్‌ని ప్రస్తుతం తన డెన్‌గా మార్చుకున్నాడు బిన్‌లాడెన్.

అప్పుడే ఇండియా నుంచి వచ్చిన గోపాలం చెమట్లు కక్కుతూ, ఓసారి ఆకాశం వంక చూసాడు. అసలే బ్యాడ్ డేస్.... పుసిక్కిన జార్జిబుష్ లాడెన్ మీద కోపంతో తన మీద బాంబు విసరడు కదా... అనే డౌట్ పీకింది.

ఏయిర్‌పోర్ట్ నుంచి బస్సులో వచ్చి, ఆ తర్వాత ఓ గాడిదను అద్దెకు తీస్కొని (ఆఫ్ఘానిస్తాన్‌లో గాడిదల మీద ప్రయాణం తప్పనిసరి) బిన్‌లాడెన్ అడ్రస్ పట్టుకొని అతి కష్టంమ్మీద అక్కడికొచ్చాడు గోపాలం.

ఓసారి తల వంచి, దాదాపు యాభై అరవై అడుగులున్న ఆ తొర్రలోకి చూసాడు. తను చేయవలసిన కర్తవ్యం గుర్తొచ్చి, మెల్లగా వంగి, ఆ తొర్రగుండా పాకుతూ వెళ్తున్నాడు.

తన బ్రతుకు మీద తనకే థూ యాక్ అనిపించింది. అయినా పని తనది ... తప్పదు అనుకుంటూ అలా కప్పలా గెంతుతూ ఓసారి, పాములా పాకుతూ మరోసారి కోతిలా యింకోసారి... అలా... అలా శ్రమ తెలియకుండా వుండడానికి వివిధ ట్రిక్కులు ఫాలో అవుతూ ఎట్టకేలకు తొర్ర చివరికి వచ్చాడు. అక్కడ కాస్త విశాలంగా వుంది. కనీసం వంగొని అయినా మాట్లాడొచ్చు.

****

"కౌన్ హై బే" ప్లాస్టిక్ డబ్బాలో గోళీకాయ లేసి సౌండ్ యిచ్చిన ఎఫెక్ట్‌లో ఓ గొంతు వినిపించింది.

గోపాలానికి ఒళ్ళు మండింది. మరొకప్పుడైతే నువ్వు బే, మీ అయ్య బే, మీ తాత బే అని వంశవృక్షాన్ని బేలతో జత కలిపి 'నానా బూతు' సమితి చేసేవాడు. కానీ యిప్పుడు చేయలేదు.

కౌన్ హై బే అంటే, మాట్లాడవేంటి బే' మళ్ళా ఆ గొంతు సౌండిచ్చింది.

"నేనే గోపాలం బేని... బే" అన్నాడు గొంతు పెగుల్చుకొని గోపాలం.

ఓసారి గోపాలం అవతారం వంక చూసి, ఆ తర్వాత కాసింత అనుమానాన్ని ఫేస్‌లోకి ట్రాన్స్‌ఫర్ చేస్కొని....

"నిన్నా జార్జిబుష్ పంపించలేదు కదా" గొణుక్కుంటూ అడిగాడు.

"లేదు... నేనే ఇండియా నుంచి మిమ్మల్ని వెతుక్కుంటూ వచ్చాను".



"ఇండియా నుంచి అయితే బేఫికర్... పాకిస్తాన్ నుంచి కాదు కదా... వాళ్ళని నమ్మొద్దు. మొన్నటి దాకా, నాతో హ్యాండ్ కలిపి యిప్పుడు హ్యాండిచ్చారు" గుర్రుగా అన్నాడు బిన్‌లాడెన్.

"ప్చ్... అని జాలిగా చూసి నవాజ్ షరీఫ్‌కే హ్యాండిచ్చారు. నువ్వెంత" అన్నాడు గోపాలం.

"చుప్ రహో.... వచ్చిన పని బాతో" అన్నాడు దర్పంగా మెషిన్‌గన్‌తో గడ్డం గోక్కుంటూ.

"నీతో ఓ పని బడి వచ్చాను. మీరు మెషిన్ గన్‌తో గడ్డం గోక్కోవడం ఆపితే చెబుతాను" గోపాలం కాసింత ధైర్యం చేసి అన్నాడు.

లాడెన్ గడ్డం గోక్కోవడం ఆపి, "ఇప్పుడు చెప్పు" అన్నాడు.

"మా ఇండియాలో ఆంధ్రప్రదేశ్ అని ఓ రాష్ట్రం వుంది".

"నగం మాలుమ్ హై" అసలు విషయం బాతో" అన్నాడు లాడెన్.

"హైద్రాబాద్‌లో నగరం నడిబొడ్డులో నేను అసయ్యంగా కొంత ఖాళీ స్థలం కొన్నాను. అప్పుడెప్పుడో అయిదారేళ్ళ క్రితం".

"అయితే నాకేంటి బే" కోపంగా అన్నాడు లాడెన్.

అసలే అమెరికా వాళ్ళు ఎప్పుడు తన మీద బాంబేస్తారోనని యమటెన్షన్‌గా వున్నాడు.

గోపాలం కోపాన్ని తమాయించుకున్నాడు.

"మా స్థలంలో వున్న గుడిసెల్ని కూలగొట్టాలి" అన్నాడు గబగబా.

పక్కలో జార్జిబుష్ వేసిన బాంబు పడ్డట్టు భయపడి "హమ్మో.... మై నహీ కరుంగా" అన్నాడు లాడెన్.

"ఊర్కోండి సార్... మీరు కాకపోతే యింకెవరు కర్తారు చెప్పండి. అయిన వరల్డ్ ట్రేడ్ సెంటర్ మీద దాడి చేసి, దాన్ని కుప్పకూల్చిన మీకు ఈ ఆఫ్ట్రాల్ గుడిసెలో లెక్కా.... పైగా మీకు బోల్డు గ్లామరు వస్తుంది. నాలాంటి బాధితులు హైద్రాబాద్‌లో బోల్డు వున్నారు" చెప్పాడు గోపాలం.

"సరిగ్గా నాకు అర్థమయ్యేలా చెప్పు బే" అన్నాడు మరోసారి 'బే' పద ప్రయోగం చేస్తూ.

"ఇదిగో లాడెన్. నువ్వు అస్తమానం బే... బే... బే... అంటే నేనేం చెప్పనంతే" బుంగమూతి పెట్టి అన్నాడు గోపాలం.

"సర్లే బే... సారీ బే... యింకోసారి అనను బే" అని గోపాలం వంక చూసాడు.

"సర్లే... అసలు విషయం చెబుతాను. మా హైద్రాబాద్ కబ్జాలకు కూడా ఫేమస్సే. మనం ఆఫీసుకు వెళ్ళివచ్చేలోగా మన యింటిని కబ్జా చేయగలరు.

సాక్షాత్తూ ప్రభుత్వ భూములే కబ్జా చేసారు. ఖాళీ స్థలం కనిపిస్తే చాలు కబ్జా చేసే భూబకాసురులు వున్నారు. భూమిపోయిన వాళ్ళందరి తరపున నేనొచ్చాను. తలా కొంత చందా వేస్కోని, నన్ను మీ దగ్గరికి పంపించారు' అసలు విషయం చెప్పాడు గోపాలం.

"అంటే... నేనిప్పుడు ఏం చేయాలి?" అడిగాడు. మరోసారి మెషిన్‌గన్ బారెల్‌తో తన గడ్డం గోక్కుంటూ.

వరల్డ్ ట్రేడ్‌సెంటర్ కూల్చేసినంత ఎఫెక్ట్‌లో కబ్జా భూముల్లో తిష్ట వేసుకూచున్న వాళ్ళందర్నీ కూల్చేసి మా స్థలాలు మాకు యిప్పించాలి. మా శక్తి కొద్దీ ఫీజు మేము యిచ్చుకుంటాం." గోపాలం వినయాన్ని యాక్ట్ చేస్తూ చెప్పాడు.

"కానీ, దాని వల్ల నాకేంటి లాభం బే" అన్నాడు.

"నువ్వో పిచ్చి బేవి" అన్నాడు చిద్విలాసంగా గోపాలం.

"క్యా... క్యా బోలా?"

"నేను సరిగ్గానే బోలాను. యిప్పటికే బోల్డు రోజులైంది. మీ మీద యుద్ధం మొదలై".

"అవునవును... అందుకే నా అనుచరులు తలా దిక్కుకు పోయారు. ఈ బంకర్‌లో తల దాచుకోవల్సి వచ్చింది" విచారంగా అన్నాడు లాడెన్.



'హాసం'లో ఇది నా హేట్రిక్ స్టోరీ. ఏ రైటర్‌కు అయినా పబ్లిష్ అయ్యే ప్రతీ కథ అపురూపంగా వుంటుంది. పత్రికల సంఖ్య తగ్గి, తగ్గిన ఆ పత్రికల సంఖ్యలో, సిన్సియర్‌గా వేసే పత్రికల సంఖ్య అంకెలలోకి వచ్చిన నేపథ్యంలో అతి తక్కువ వ్యవధిలో మూడు కథలు రావడం.... ఊహించని కాంప్లిమెంటరీ కాపీలు, ఊహకందేలోపే సిన్సియర్‌గా వచ్చే రెమ్యునిరేషన్ రావడం ఆశ్చర్యమే. అయినా 'హాసం'లో ఇది సాధ్యం. మాకు రైటర్స్ కన్నా, ఆ రైటర్స్ రాసే అక్షరాలే ముఖ్యం అని చెప్పి... వెంటవెంటనే మళ్ళీ మళ్ళీ హాసం కోసం కథ రాయాలనే ఆలోచన, ఆసక్తి కలిగించిన హాసం సంపాదక వర్గానికి.... థాంక్స్

-సూరేపల్లి విజయ

1-9-12/3/హెచ్, ఆజంపురా, మెదక్

"ఆ తల దాచుకోవడమేదో మా యిండియాలోనే చేయొచ్చు. ఒక్క దెబ్బకు మూడు పిట్టలు".

"మూడు పిట్టలా? పిట్ట మాంసం తిని చాలా రోజులైంది బే" అన్నాడు నాలిక తడుపుకుంటూ

తల పట్టుకొని అన్నాడు గోపాలం.

"నేనే వేరే మీనింగ్‌లో చెప్పాను. మా ఇండియాకి వచ్చి గుడిసెలు పీకించి, మా భూములు మాకు యిప్పించడం వల్ల నీకు డబ్బు వస్తుంది. అసలే యిబ్బందిగా వుందటగా" అన్నాడు గోపాలం.

"అవునవును. మొన్నో దోస్త్ వస్తే చాయ్ రొట్టె యిచ్చాను. నీకిద్దామంటే యిదిగో యిది వుంది" అంటూ ఓ మూలనున్న ఓ ముంత తెచ్చి యిచ్చాడు సిగ్గుగా.

"ఏమిటది?" గోపాలం చూడకుండానే అడిగాడు.

"కల్లు... ఆ మధ్య తలదాచుకోవడానికి తాటి చెట్టు ఎక్కి, పనిలో పనిగా పనికి వస్తుందని కల్లు గీసా... తాగు... తాగు" అన్నాడు లాడెన్.

"తర్వాత్తాగుతాను గానీ, నేను చెప్పేది విను లాడెన్ జీ. నువ్వు ఇండియా వస్తే టెంపరరీగా అమెరికా వాళ్ళ దాడి నుంచి తప్పించుకోవచ్చు. పై పెచ్చు నీకు బోల్డు పబ్లిసిటీ వస్తుంది. ఎందుకంటే వరల్డ్ ట్రేడ్ సెంటర్ కూల్చేయడం కన్నా, మా ఇండియాలో ఆక్రమించుకున్న స్థలాల్లోని గుడిసెల్ని పీకేయడమే కష్టం కాబట్టి..."

లాడెన్ తన దగ్గరున్న కంప్యూటర్ టెక్నాలజీతో తన అనుచరులను సంప్రదించి "సరే" అన్నాడు.

****

ఇండియాకు వచ్చి, ఆ తర్వాత హైద్రాబాద్‌కు వచ్చి, అక్కడ కబ్జా చేయబడ్డ భూములను తిరిగి స్వాధీన పర్చుకోవడం మొదలెట్టాక తెలిసింది లాడెన్‌కు... అదెంత కష్టమో.

డజన్ల కొద్దీ రౌడీలు ఆ స్థలాల్లో గుడిసెలు వేసుకున్నారు. ఒకడు బాంబులతో, యింకొకరు కత్తులతో మరొకడు పిస్తోళ్ళతో కాపలా కాస్తున్నారు. ఒకడ్ని సఫా చేస్తే, యింకొకడు బయల్దేరుతున్నాడు. ఒక దగ్గర గుడిసెలన్నీ పీకేయించి, మరో దగ్గరికి వెళ్ళొచ్చేలోగా పీకేయించిన గుడిసెల స్థానంలో మళ్ళీ గుడిసెలు వెలుస్తున్నాయి.

లాడెన్‌కు తల తిరిగి పోయింది. తానెంత గెరిల్లా టైపులో ట్రై చేసినా కుదరడం లేదు. యిక తన విశ్వరూపం చూపించక తప్పదనుకున్నాడు.



వెంటనే తన అనుచరులను రంగంలోకి దింపాడు.

అమెరికాలో అటాక్ చేసిన టైప్‌లో స్టేట్ గవర్నమెంట్ ఆయుధాలతో కబ్జా చేసిన వాళ్ళ పని పట్టాలని అనుకున్నాడు.

కానీ, అది కుదరక పోవడంతో తనే స్వయంగా రంగంలోకి దిగాడు.

యముండ... టైపులో నేను లాడెనుండ అని మెషిన్‌గన్‌లు, బాంబర్‌లు బయటకు తీసాడు. నానా హంగామా చేసాడు. తన చరిత్ర అంతా క్యాసెట్స్ రూపంలో తయారుచేసి, కబ్జాదారులకు పంపించాడు.

అతి కష్టమ్మీద తాను అనుకున్నది సాధించాడు. పదిహేను రోజులు సుదీర్ఘ పోరాటం తర్వాత హైద్రాబాద్‌లో కబ్జా అయిన భూములకు విముక్తి కలిగింది. కాకపోతే ఈ ప్రయత్నంలో చావుదప్పి కన్నులొట్ట పోయినట్టయింది. లాడెన్ పరిస్థితి.

కడప బాంబు జస్ట్‌లో మిస్సయి అతని వీపును కొద్దిగా డామేజ్ చేసింది. వెంటనే గవర్నమెంట్ ఆసుపత్రిలో జాయిన్ చేసాడు గోపాలం లాడెన్‌ని.

సరిగ్గా అప్పుడే, అక్కడే అతని ఖర్మకాలింది. గవర్నమెంటాస్పిటల్ ట్రీట్‌మెంట్ రుచి అర్థమైంది. ఓ డొక్కు, తుక్కు సగం విరిగిన ఇనుప మంచం మీద గిరాటేసారు లాడెన్‌ను.

"అయామ్ లాడెన్" అన్నాడు కోపంగా లాడెన్.

"హ్హి హ్హి హ్హి" అని నవ్వి, "సద్దాం హుస్సేన్ అయినా, ఈదీ అమీన్ అయినా మా హాస్పిటల్‌లో ట్రీట్‌మెంట్ ఇలానే వుంటుంది" అంటూ భుజం మీద గుచ్చాల్సినవి ఒళ్ళు నుండి మోకాల్లో గుచ్చారు. తన మెదడుకు ఆ సూది గుచ్చుకోవడంతో....

లాడెన్ కెవ్వున కేకేసాడు. అలా మూడ్రోజులు ఆ హాస్పిటల్‌లో నరకం అనుభవించి... నాలుగో రోజు గోపాలం రాగానే-

'గోపాలం..... నన్ను హాయిగా ఆ అమెరికా వాళ్ళకే అప్పగించేయ్'' అన్నాడు ఏడుప్పు గొంతుతో.

"హా.... వెయ్యి గొడ్లను తిన్న రాంబందు ఒక గాలివానతో సరి.... అంటే యిదే మరి...'' అనుకొని...

"లాడెన్ జీ.... మా పని పూర్తయింది. మాకిక కబ్జాదారుల బెదడ లేదు. యిదిగోండి మీ ఫీజు" అంటూ పెద్ద స్టీలు డబ్బా నిండా రూపాయి, రెండు రూపాయలు, అయిదు రూపాయల నాణేలు యిచ్చాడు.

"ఇదేంటి... నాకు డాలర్స్‌లో, ఏ లక్షల్లో యిస్తారనుకున్నాను" అన్నాడు లాడెన్ కోపంగా.

"మా స్థలాలు మావే అంటూ కోర్టు చుట్టూ నాయకుల చుట్టూ, గుండాల చుట్టూ తిరిగి... తిరిగి మేము కొన్న రేటు కన్నా, ఖర్చు పెట్టిందే ఎక్కువైంది. అందుకే అతి కష్టమ్మీద... క్షమించాలి మరి".

చేసేది లేక, పోనీలే అమెరికా బాధ నుంచి కొంత కాలం విశ్రాంతి దక్కిందనుకుంటాను. ఆ నాణేల డబ్బా నెత్తిమీద పెట్టుకొని ఆఫ్ఘానిస్తాన్‌కు బయల్దేరుతుండగా ఫోనొచ్చింది లాడెన్‌కు.

"సాబ్... మీరిక్కడికి రావొద్దంటా''

"క్యాబే.... ఏమైంది? అమెరికా వాళ్ళు మన బంకర్లు ఖతం చేసారా?''

"నహీ సాబ్... అమెరికా వల్ల మనకేం డేంజర్ ఎదురవ్వలేదు. కానీ సాబ్ ఎవరో హైద్రాబాద్ నుంచి వచ్చారు. కబ్జాదారులట.... భూ బకాసురులట. అక్కడ హైద్రాబాద్‌లో వాళ్ళని మీరు తరిమేసి చంకలు గుద్దుకున్నారట... మా సత్తా దేఖో" అంటూ మన బంకర్లను కబ్జా చేసి, గుడిసెలు వేసుకున్నారు. ఎంతకీ కదల్లం లేదు. గట్టిగా మాట్లాడితే ఏం చేస్కుంటారో చేస్కోండి. వెళ్ళి జార్జిబుష్‌కు చెప్పుకోండి అంటూ తెలుగులో బండబూతులు తిడుతున్నారు సాబ్."

"ఖా... మో... ష్" అంటూ తన చేతిలో వున్న మెషిన్‌గన్‌తో తల మీద గట్టిగా కొట్టుకున్నాడు లాడెన్.

అంతే... అతని తల వరల్డ్ ట్రేడ్ సెంటరైంది.

"థాంక్యూ మిష్టర్ గోపాలం... ప్రపంచంలో తీవ్రవాదాన్ని పెంచి పోషిస్తున్న వ్యక్తిని మటాష్ చేసినందుకు, మేము ప్రకటించిన విధంగా నూట యిరవై కోట్లు యిస్తున్నాం. తీస్కోండి" అన్నాడు. అమెరికా ప్రెసిడెంటు జార్జిబుష్.

వాజ్‌పేయ్ గోపాలం భుజం తట్టాడు. హైద్రాబాద్‌లో తలనొప్పిగా వున్న, కబ్జాదారుల ఆట కట్టించడమే కాక, భారతదేశానికి మెడ నొప్పిగా వున్న తీవ్రవాద పోషకుడ్ని ఫినిష్ చేసినందుకు సి.యం. గోపాలాన్ని అభినందించి, పనిలో పనిగా రాష్ట్రాభివృద్ధి కోసం ఆ నూట ఇరవై కోట్లు అప్పుగా యివ్వమని అడిగాడు.

గోపాలం ఆలోచనలో పడ్డాడు.

****

ఇంతకు ఈ కథకు ఫినిషింగ్ టచ్ ఏమిటి? ఎలా వుండాలి? తీరా చూస్తే యిదంతా గోపాలానికి వచ్చిన కలలా వుండాలా?

హమ్మయ్య యిలానే బావుంది. కలెందుకు... యిదే నిజమైతే బావుండు... అనేలా వుండాలా?

ఫినిషింగ్ టచ్ ఏమిటో.... మీ ఊహకే వదిలేస్తూ.....

## జస్ట్ ఫర్ ఫన్

## ప్రైజ్ విన్నర్

ప్రజలకు చేరువయ్యే పథకంలో భాగంగా కొత్తగా పెట్టిన టోల్ గేట్ దాటిన ప్రతీ నూరవ ప్రయాణికుడికి వెయ్యి నూట పదహార్లు బహుమతిగా ఇద్దామని అనుకున్నారు పోలీసు విభాగం వాళ్లు. సరిగ్గా ఆ ప్రకారం ఓ మారుతీకారు వచ్చింది. ఆ కారుని ఆపిన పోలీసు డ్రైవింగ్ సీటులో ఉన్నతనికి పుష్పగుచ్ఛం, నూట పదహారు రూపాయల చెక్కు ఇచ్చి విషయం చెప్పి శుభాకాంక్షలు చెప్పాడు.



"థాంక్స్" అంటూ బొకేను అందుకుని పక్కనున్న భార్యకు ఇచ్చాడతను.

"అనుకోకుండా వచ్చిన ఈ డబ్బుతో మీరేం చేయబోతున్నారు?" అడిగాడు పోలీసు.

అతని దగ్గర సమాధానం రెడీగా ఉంది. "డ్రైవింగ్ లైసెన్సు కొనుక్కోబోతున్నా!" అన్నాడు హుషారుగా.

పోలీసు ఉలిక్కిపడడం చూసి భార్య సర్దబోయింది. "మా ఆయన తాగినప్పుడు అలాగే మాట్లాడుతాడు. పట్టించుకోకండి"

వెనక సీటులో కునికిపాట్లు పడుతున్న చెవిటి తాతగారు ఈ హడావుడికి నిద్రలేచి పోలీసును చూసి మొత్తుకున్నాడు. "నేనక్కడికి మా వాడికి చెబుతూనే ఉన్నానండి. కొట్టేసిన కారుతో ఎక్కువ దూరం వెళ్లలేంరా. పోలీసులు మధ్యదారిలోనే పట్టేసుకుంట్రారా" అని.

# విజయవాడలో హాస్యనాటికల పోటీలు

హాస్యం రాయడం అంటే హాస్యంకాదు. అది చాలా సీరియస్ విషయం. ఇప్పుడు తగ్గిపోయిందిగాని, ఇదివరలోనే మంచి హాస్యం వచ్చింది. వ్యాసాలు, నాటికలు, కథలు - అలా. ఇవాళ సినిమా హాస్యం ఎంతెంత మాత్రమో, టీవీ హాస్యం అంతే, అంతకంటె ఎక్కువపాళ్లే. అన్నీ ఆల్‌మోస్ట్ - ఏడుపుగొట్టు 'లాగుడు' నాటకాలే. నాటకాన్ని విభజించి, ఒకే అంకంలో ముగిసేలాగా పూర్వీకులు రాశారు. వాటిని ఏకాంకికలన్నారు. నవ్వించే వాటిని ప్రహసనాలన్నారు. కలగలపు



'చుట్టం చూపు' నాటికలోని దృశ్యం

వాటిని నాటికలన్నారు. హాస్యం తగ్గిపోతున్నదనీ, హాస్యాన్ని నాటికల ద్వారా పండించాలనీ విజయవాడ సుమధుర కళానికేతన్ ఏడేళ్లుగా హాస్యనాటికల పోటీలు నిర్వహిస్తున్నది. మూడు రోజుల్లో 10 నాటికలు ప్రదర్శింపబడతాయి. వీటిలో కొత్త నాటికలు, పాతవీ వుంటాయి. కొత్తగా రాసినవాటికి ప్రత్యేకంగా 'క్యాష్ బహుమతి' ఇస్తారు. కొత్త రచయితలు వస్తున్నారు, రాస్తున్నారు.

జూలై 26, 27, 28 తేదీల్లో జరిగిన పోటీల్లోని కొన్ని నాటికల్లో హాస్యం లేనేలేదు. ఒకటి రెండు 'అపహాస్య నాటికలు' కూడా వచ్చాయి. 28 నాటికల ప్రదర్శనలు చూసి వాటిలో పదింటిని ఎన్నిక చేశామని కార్యకర్తలు చెప్పారు గాని, భమిడిపాటి కామేశ్వరరావుగారు చెప్పినట్టు మిగతావి ఇంకా అధ్వాన్నంగా వున్నాయన్నమాట. సంభాషణల్లోగాని, దృశ్య, సన్నివేశపరంగా గాని లేని హాస్యాన్ని పుట్టించాలని కాబోలు, కొన్ని నాటికల్లోని నటులు, 'ఓవర్'గా నటించారు. సందర్భం వున్నా లేకపోయినా పిచ్చి పిచ్చిగా కేకలు వెయ్యడం, పడిపోవడం, వాళ్లే నవ్వేసుకోడం వంటి చేష్టలన్నీ చేస్తే హాస్యం పండినట్టే అనుకున్నట్టున్నారు. అలాంటి నాటికలకి బహుమతులు రాలేదు. కొత్త కథావస్తువుతో సరదాగా నవ్విస్తూ సాగిపోయిన నాటికలకే బహుమతులు ఇచ్చారు. స్క్రిప్టుకీ ఇచ్చారు.

ప్రతి నాటికలోనూ సందేశం వుండాలన్న రూలేం లేదు. అక్కర్లేదు కూడానూ. 'ఫార్స్' కావచ్చు. ప్రహసనం అంటే అంతే. అలా చూసుకున్నప్పుడు 'అమెరికా అల్లుడు' ఎక్కువగా నవ్వించింది, అందరూ బాగా చేశారు గనక ప్రథమ బహుమతి గెల్చుకుంది - ఎన్నిక కాబడిన ప్రతి నాటికకీ ఇచ్చే నాలుగువేలు కాక, మరో నాలుగువేలూ గెల్చుకుంది. ఉత్తమ రచన కూడా ఆనాటికకే. ఆ రచయిత కీ॥శే॥ బత్తుల రామకృష్ణ (ఇతను జంధ్యాల గారి దగ్గర చాలా కాలం దర్శకత్వ శాఖలో చేశాడు) ఇందులో నటించిన ముఖ్యపాత్రధారి మల్లాది భాస్కర్ ఉత్తమ నటుడు. అలాగే దర్శకత్వానికీ (టి. శివరామకృష్ణ) ఈ నాటికకే గెల్చుకుంది. రెండో బహుమతి 'నట్టింట్లో నాటకం'. (గెల్చుకున్న ఈ రెండు నాటికలూ హైద్రాబాదు నుంచి వచ్చినవే) ఈ నాటికలో నటించిన ఎ.కె. శ్రీదేవి ఉత్తమ నటి. ఈ



శ్రీ పద్మనాభం సన్మాన దృశ్యం

అమ్మాయి పనిమనిషిగానూ, మారు వేషంలో వచ్చిన నటీమణి గానూ 'ఓవర్' చెయ్యకుండా వైవిధ్యం చూపించి, నటించింది. అలాగే మల్లాది భాస్కర్ కూడా రిస్ట్రెయిన్డ్‌గా, ఎక్స్‌ప్రెషన్స్‌తో నవ్వించాడు, కొత్త నాటిక రాసిన అద్దేపల్లి భరత్‌కుమార్ ('హుచ్' నాటిక) 'ఉత్తమ నూతన రచన' బహుమతి (1500) అందుకున్నాడు.

'హాస్యం' కూడా రాసి, హాస్యాన్ని ఒలికించే పాత్రలు ధరించిన గొల్లపూడి మారుతీరావుని సుమధుర కళానికేతన్ మొదటిరోజు సత్కరించింది. రెండో రోజున హాస్యనటుడు పద్మనాభాన్ని సత్కరించింది. మూడో రోజున హాస్యరచయిత, హాస్య నాటికల దర్శకుడు శంకరమంచి పార్థసారథి, తల్లావఝుల సుందరాన్ని సన్మానించింది. ఇదీ బాగుంది - డైరెక్టర్నీ, రైటర్నీ సత్కరించడం మహోచితంగా వుంది!

ఇవి ఇలా వుండగా, ఓ ఉదయం "ప్రహసనాల దండ - నవ్వుల జల్లు - జోకుల విందు" అని, హాస్య కార్యక్రమం ఏర్పాటు చేశారు. గుండు హనుమంతరావు సారథ్యంలో హైదరాబాద్ నుంచి వర్ధమాన నటీనటుల ప్రహసనాల దండ, పన్నాల సుబ్రహ్మణ్య భట్టు నిర్వహణలో



ద్వితీయ ఉత్తమ బహుమతి పొందిన 'నట్టింట్లో నాటకం'లో ఓ దృశ్యం

జోకుల విందు - జరిగాయి. ప్రేక్షకుల నుంచి కూడా కొందరు లేచి వచ్చి, జోకులు చెప్పారు. కొన్ని జోకులు పాతవే, కొన్ని పేలాయి, కొన్ని తుస్సుమన్నాయి. హైదరాబాద్ నుంచి వచ్చిన ఇద్దరమ్మాయిలు కొత్త పాటకి 'రికార్డు డాన్సు' చేసారు - ఇదీ హాస్యమేనా? ఒక నటుడు జానపద గీతం పాడాడు. అదీ హాస్యం కిందికే వస్తుంది కాబోలు. అక్కడక్కడ 'బూతు' కూడా ధ్వనించింది గనక, నేటి హాస్యానికి అది మచ్చు



శ్రీ గొల్లపూడి మారుతీరావు సన్మాన దృశ్యం

తునక అనుకోవాలా? ఒకాయన సుబ్బిసెట్టి మిమిక్రీ అని చేసి, 'డబుల్ మీనింగ్ డైలాగ్స్'తో బూతుల జల్లు కురిపించాడు. కార్యకర్తలు ముందుగా స్క్రూటినైజ్ చెయ్యాల్సింది! అపహాస్యం, అపశ్రుతులూ లేకుండా ఆరోగ్యంగా వుండేవి. హాస్య నాటికల కోసం, హాస్యోద్ధారణ కోసం సుమధుర కళానికేతన్ చేస్తున్న కృషిని మెచ్చుకోవాలి. ఇలా హాస్య నాటికల పోటీలు నిర్వహిస్తున్న సంస్థ ఇదొక్కటే గనక, రాసేవాళ్లచేత రాయించగలిగితే ఉత్తమ హాస్య నాటికలు ఎన్నో వస్తాయి!

**- సుకుమార్**




ఆగష్టు 1-15 సంచికలో "ఇంద్ర" సినిమా భం భం భోలే శంఖం మోగెలే - అనే పాట చిరంజీవికి, హరిహరన్, శంకర్‌మహదేవన్‌ల చేత పాడించిన విధానం గురించి చదువుతుంటే -- అక్కినేని నటించిన "దసరా బుల్లోడు" సినిమాలో ఇద్దరు నటులకు ఇద్దరు గాయకుల గాత్రం విన్పించిన పాట గుర్తుకు వచ్చింది. ఆ పాట ఇది "వినరా బుల్లెమ్మ వీర గాధలూ వీనులవిందుగా". ఈ పాటలో ఘంటసాల, పిఠాపురం వాయిస్‌లు మార్చి మార్చి నాగేశ్వరరావు, పద్మనాభంలకు ఇరువురికీ ఉపయోగించారు. ఇదేవిధంగా అక్కినేని నటించిన "రైతుకుటుంబం" సినిమాలో 'అమ్మా, చల్లని మాయమ్మ' అనే పాటలో కూడా అక్కినేని, రామ కృష్ణలకు ఘంటసాల, జయదేవ్‌ల వాయిస్‌లు మార్చిమార్చి ఆ విధంగా ఉపయోగించారు. గుర్తు చేసుకునే అవకాశం కల్పించినందుకు థాంక్స్.

-ఎన్.రామ్‌బాబు, అద్దంకి

మీరు ఉదహరించిన సంఘటనలు అనుకోకుండా జరిగినవే తప్ప కావాలని అలా పాడించనూ లేదు. చిత్రీకరించనూ లేదు. 'అవేకళ్ళు' సినిమా లోని 'మా వూళ్లో ఒక పడుచుంది' పాటలో కూడా అలాగే జరిగింది. ఘంటసాల పాడిన లైన్లతో పాటు పిఠాపురం నాగేశ్వరరావు పాడిన 'లారిలల్ల (2) లల్లల్ల' అనే ఆలాపనలకు కూడా హీరో కృష్ణ లిప్‌మూమెంట్‌ని ఇవ్వడం మనం గమనించవచ్చు. కానీ 'భం భం బోలే' పాటకు ముందు మేం సూచ్యప్రాయంగా ఉదహరించిన సంఘటనలు వేరు. 'పల్లెటూరిబావ' సినిమాలో అక్కినేని నాగేశ్వర రావుకి బాలు, ఘంటసాల, రామకృష్ణ పాడడం మచ్చుకి ఒకటి.

-ఎడిటర్

రాణీరత్నప్రభ చిత్రంలోని "నిన్నకనిపించింది"పాట రచయిత ఎవరు? కొందరు ఆరుద్ర గారని కొందరు కొసరాజుగారని వ్రాస్తున్నారు. హెచ్.ఎం.వి కాసెట్లో రచయితల పేర్లు కామన్‌గా ఇచ్చారు. వాహినీ వారి పెద్దమనుషులు చిత్రానికి సంగీత దర్శకులెవరు?

-ఎ.వెంకటరావు, అద్దంకి

రాణీరత్నప్రభ సినిమాలోని 'నిన్న కనిపించింది నన్ను మురిపించింది' పాట రచయిత ఆరుద్ర. వాహినీవారి 'పెద్దమనుషులు' చిత్రానికి సంగీతం అద్దేపల్లి రామారావు, ఓగిరాల రామచంద్రరావు.

-ఎడిటర్

## హిందీ పాటలను అనుకరించిన / అనుసరించిన కొన్ని తెలుగు పాటలు

| వ.నెం. | చిత్రం పేరు | - పాట | - తెలుగుచిత్రం | పాట |
|---|---|---|---|---|
| 1. | పతంగా | -ప్యార్‌కె జహాకీ | - జీవితం | 'చక్కనైన కోయరాజును" |
| 2. | నాస్తిక్ | -దేఖ్‌తెరే సంసార్‌కి | - ఉమాసుందరి | "నమ్మకురా ఇల్లాలు పిల్లలు" |
| 3. | షెహనాయ్ | -బచ్‌కె రహనాజీ | - అంతే కావాలి | "హుషారుగా ఉండాలోయ్" |
| 4. | ఝునక్ 2 పాయల్ బాజే | -నైన్ సేనైన్ నాహీ | - రాజనందిని | "అందాలు చిందుసీమలో" |
| 5. | ఉడన్ ఖటోలా | -ఓదూర్‌కె ముసాఫిర్ | - టౌన్ బస్ | "అందాల నాగుబాము" |
| 6. | అల్‌బేలా | -ధీరేసే ఆజారే | - నాటకాలరాయుడు | "నీలాల కన్నుల్లో మెలమెల్లగా" |
| 7. | సుబహ్ కా తారా | -గయా అంధేరాహువా | - సంతానం | "సంతోషమేలా సంగీతమేలా" |
| 8. | నాగిన్ | -మన్‌డోలేమెరా | - భాగ్యరేఖ | "మనసూగే సఖ తనువూగే" |
| 9. | తుంసా నహీదేఖా | -యూతో హమ్‌నే | - ఇల్లరికం | "ఎక్కడి దొంగలు అక్కడనే" |
| 10. | తీరందాజ్ | -ఏక్ హసీమ్ షా | - ఇల్లరికం | 'మధుపాత్ర నింపవోయి" |
| 11. | మౌసి | -తింతింతిం తారోసే | - శాంతినివాసం | "కం కంకం కంగారు" |
| 12. | ఉజాలా | -ఝూమ్‌తా మౌసమ్ | - శాంతినివాసం | "రాధా రావె రాణీ రావే" |
| 13. | సి.ఐ.డి. | -లేకే పెహలాప్యార్ | - అభిమానం | "ఓహో బస్తీ దొరసాని" |
| 14. | ఆజాద్ | -నా బోలే నాబోలే | - చింతామణి | "రావోయి రావోయి ఓ మాధవా" |
| 15. | ఆజాద్ | -దేఖోజీ బహార్ ఆయి | - చింతామణి | "పున్నమి చకోరినోయి" |
| 16. | అనార్కలి | -ఏ జిందగీ ఉసీకిహై | - అనార్కలి | "జీవితమే సఫలము" |
| 17. | భాభీ | -చల్‌రె పతంగ్ | - కులదైవం | "పదపదవే వయ్యారి గాలిపటమా" |
| 18. | భాభీ | - చల్‌ఉడ్‌జారే పంఛీ | - కులదైవం | "పయనించె ఓ చిలుకా" |
| 19. | ఏక్‌ముసాఫిర్ ఏక్ హసీనా | -నాజినీబడారంగీన్‌వాదాతెరా | - నవగ్రహపూజా మహిమ | "ఎవ్వరో, ఎందుకీరీతి" |
| 20. | ససురాల్ | -ఏక్ సవాల్‌మై కరూ | - ఖైదీ కన్నయ్య | "ఈ నిజం తెలుసుకో" |
| 21. | ససురాల్ | -తెరీ ప్యారీ సూరత్‌కో | ఖైదీ కన్నయ్య | "తియతీయనితేనెల మాటలతో" |
| 22 | చోరీ చోరీ | -రసిక్ బల్‌మా | - నిండు సంసారం | "దేవుడున్నాడా" |
| 23. | చౌద్ వీకాచాంద్ | -చౌద్‌వీకా చాంద్‌హో | - మదనకామరాజుకథ | "నీలిమేఘమాలవో" |
| 24. | జంగ్లీ | -మేరా యార్ షబ్బఖైర్ | - ఇరుగుపొరుగు | "వారెవా జోరుహై" |

(వచ్చే సంచికలో మరికొన్ని)

-సేకరణ: ఎస్.శ్రీనివాసరావు, ఎమ్మిగనూరు

కాన్సెప్ట్ : రాజా

# పెళ్లిచూపులు

కార్టూన్స్ : గాంధీ



# వినాయక చవితి సందర్భంగా కార్టూన్స్ స్పెషల్...



# వినాయక చవితి సందర్భంగా కార్టూన్స్ స్పెషల్...
























# వినాయక చవితి సందర్భంగా కార్టూన్స్ స్పెషల్...
























నిక్షిప్త చిత్రం

హాస్యం

వినాయకచవితి నాడు పుట్టిన **ఆదివిష్ణు** జన్మదినాన్ని పురస్కరించుకుని **శ్రీ ఎమ్.వి.యస్.హరనాధరావు** అభినందనలతో అందించిన అమూల్య చిత్రమిది




నిలబడ్డవారు.. ఎడమనుంచి కుడికి.. : గొల్లపూడి మారుతీరావు, పరుచూరి వెంకటేశ్వరరావు, జంధ్యాల, దివాకరబాబు, యం.వి.యస్.హరనాధరావు

కూర్చున్నవారు.. ఎడమనుంచి కుడికి.. : కప్పగంతుల మల్లికార్జునరావు, ఎన్.ఆర్.నంది, డి.వి.నరసరాజు, ఆదివిష్ణు, సి.యస్.రావు, ఆర్.వి.యస్.రామస్వామి


ఎస్.పి. క్రియేషన్స్
హోలీ
ఎన్. సూర్యప్రకాశ రావు
ఎస్.వి.ఎన్. వరప్రసాద్
ఆర్.పి. పట్నాయక్ కులశేఖర్ శరత్ & సమీర్‌రెడ్డి శంకర్ పేకేటిరంగా కళ్యాణకృష్ణ కూనిరెడ్డి శ్రీనివాస్ శంకర్ & బృందా
Krishna